సన్యాసులు ఆరు విధాలుగా ఉంటారు. 1. కుటిచకుడు 2. బహూదకుడు 3. హంస 4. పరమహంస 5. తురీయాతీతుడు 6. అవధూత

**1. కుటీచకుడు :** ఇతడు వైష్ణవ సన్యాసి. శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన వాడు. శిఖయజ్ఞోపవీతం కలిగి ఉంటాడు. దండ కమండలాలు ధరిస్తాడు. కౌపీనము (గోచీ) శాటీ (పైన కప్పుకునే వస్త్రము) కంధ (పడుకోవటానికి వేసుకునే బొంత) కలిగి ఉంటాడు. పితృ, మాతృ, గురు ఆరాధనాపరుడై ఉంటాడు. పిఠరము (అన్నం వండుకునే కుండ) ఖనిత్రము (గడ్డపార) శిఖ్యము (ఉట్టి) మాత్రమే సాధనాలుగా ఉంటాయి. ఒకచోటే ఉంటాడు. సంచారం చెయ్యవలసిన అవసరం లేదు. ఊర్ధ్వపుండ్రములు, త్రిదండము ధరిస్తాడు.

**2. బహూదకుడు :** ఇతడు కూడా శిఖ, యజ్ఞోపవీతాలు, దండకమండలాలు, కౌపీనము, శాటీ ధరించి ఉంటాడు. త్రిపుండ్రధారి. మధుకరము చేసుకుని ప్రతిరోజూ ఎనిమిది ముద్దలు మాత్రమే తింటాడు.

**3. హంస :** ఇతడు జడలు ధరించి ఉంటాడు. త్రిపుండ్రములు గాని, ఊర్ధ్వ పుండ్రములు గాని ధరించి ఉంటాడు. కౌపీనము మాత్రమే ధరిస్తాడు. మధుకరాన్ని మాత్రమే భుజిస్తాడు.

**4. పరమహంస :** పరమహంసల మార్గము అత్యంత దుర్లభమైనది. ఈ మార్గంలో సంచరించే వారు చాలా తక్కువ మంది ఉంటారు. ఎక్కడో పుణ్యక్షేత్రాలలో ఒకరు కనిపిస్తారు. వీరు నిత్యము పవిత్రులై ఉంటారు. వీరికి శిఖాయజ్ఞోపవీతాలుండవు. సర్వకాల సర్వావస్థలయందు పూజనీయులు. సాక్షాత్తు వేదపురుషులు. వీరికి మిత్రులు, శత్రువులు ఎవరూ ఉండరు. ఇతడు వేదాధ్యయనం చెయ్యడు. సర్వశాస్త్ర పండితుడు. అన్ని కర్మలు చెయ్యటంలోను నిష్ణాతుడు. ఇతని దృష్టిలో శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలు అన్నీ సమానము. షడూర్ములు (1. ఆకలి 2. కోరిక 3. శోకము 4. మోహము 5. జర 6. మరణము) వాసనలు లేనివాడు. మనసు లేనివాడు. నింద, గర్వము, మత్సరము, దంభము, దర్పము, ఇచ్ఛ, ద్వేషము, అరిషడ్వర్గాలు లేనివాడు. తన దేహాన్ని శవంలాగా చూస్తాడు. శరీరము ఏ క్షణంలోనైనా నశిస్తుంది. నేనే నిత్యమైనవాడను, శాశ్వతమైన వాడను, శాంతస్వరూపుడను అని విశ్వసిస్తాడు.

**5. తురీయాతీతుడు :** గోముఖ వృత్తిచే ఫలహారము చేస్తాడు. మూడు ఇళ్ళలో మాత్రమే భిక్ష స్వీకరిస్తాడు. దేహమాత్రావశిష్టుడు. దిగంబరుడు. శరీరాన్ని శవంలా చూస్తాడు.

**6. అవధూత :** అ – అన్నింటినీ, వ – వదలివేసి, దూ – అందరికీ దూరంగా, త – తత్త్వాన్వేషణలో కాలం గడిపేవాడు. ఏ రకమైన నియమాలు లేనివాడు. ఏ విధమైన ఆభిజాత్యము లేకుండా, అన్ని వర్ణముల వారి దగ్గరా అజగరవృత్తితో ఆహారం తీసకుంటాడు. అన్నివేళలా స్వరూపానందం అనుభవిస్తాడు. చెట్లు, చేమలు, పర్వతాలతో కూడిన జగత్తును నేను కాను. తన్మాత్రలు నేను కాను. ఇంద్రియాల భ్రమ లేనివాడను, బాహ్యాంభ్యంతరము లందు వ్యాపించినవాడను, నిష్కళంకుడను, నిరంజనుడను. ఏకమైన ఆత్మను నేను. అని భావన చేస్తుంటాడు. స్నానం చెయ్యడు. పుండ్రధారణ చెయ్యడు. కర్మలు చెయ్యడు. శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలు జయించినవాడు. ఏ రకమైన నియమాలు లేకుండా దొరికింది తిని, నిరంతరము పరమాత్మ ధ్యానంలో కాలం గడుపుతాడు. తన ఉనికిని బయట పడనీడు. తానెవరో చెప్పడు. నాకన్న వేరెవరూ లేరని భావిస్తాడు. తానే పరమేశ్వర స్వరూపమని త్రికరణ శుద్ధిగా నమ్ముతాడు.

**నారద పరివ్రాజకోపనిషత్తు :** ఉపనిషత్తులలో సన్యాసాన్ని వివరించినవి మొత్తం 17. కాగా 1. పరివ్రాజక 2. త్రిశిఖిబ్రాహ్మణ, 3. సీతా, 4. చూడా 5. నిర్వాణ 6. మండల 7. దక్షిణామూర్తి 8 శరభ 9. స్కంధ 10. మహానారాయణ 11 అద్వయ అనే పదకొండు ఉపనిషత్తుల సారమే ఈ నారదపరివ్రాజకోపనిషత్తు. సన్యాసాన్ని వివరించే ఉపనిషత్తులలో ఇదే ప్రముఖమైనది.

పూర్వకాలంలో నారదమహర్షి, పుణ్యస్థలాలు, తీర్థాలు, క్షేత్రాలు సేవించి వైరాగ్య భావంతో నైమిశారణ్యానికి చేరి, అక్కడ నివృత్తి మార్గంలో కాలం గడుపుతూ ఉన్న వారందరికీ కూడా ఆ మార్గాన్ని బోధిస్తున్నాడు. ఆ సమయంలో ఒక రోజున శౌనకాది మహర్షులు నారదుణ్ణి సమీపించి, ఓ దేవర్షీ ! "ఏ సాధన చేస్తే మాకు మోక్షము లభిస్తుందో వివరించవలసింది" అని అడిగారు. ఆ మాటలు విన్ననారదుడు "ఓ మహర్షులారా ! ఉపనయనాది సకల (44) సంస్కారములు గలవాడు, వేదవేదాంగాలు అభ్యసించినవాడు, గృహస్థాశ్రమము, వానప్రస్తము పూర్తి చేసినవాడు,

సద్గురువును సేవించినవాడు, సంసార సుఖాన్ని పరిత్యజించినవాడు, సాధన చతుష్టయము గలవాడు, ఆశారహితుడు, ఈషణత్రయము లేనివాడు, శాంతుడు, దాంతుడు, అయిన సన్యాసి, స్వస్వరూపధ్యానంలో శరీరాన్ని త్యాగం చేసినవాడు ముక్తుడవుతాడు" అని చెప్పాడు.

ఆ మాటలు విన్న మహర్షులు ఓ నారదా ! అలాగయినట్లైతే 'సన్యాసవిధి'ని మాకు వివరించవలసింది అని అడిగారు. అప్పుడు నారదుడు మహర్షులందరినీ వెంటపెట్టుకుని సత్యలోకానికివెళ్ళి, బ్రహ్మదేవుని పరిపరివిధాల ప్రార్థించగా, ఆయన ప్రీతిచెంది సన్యాసవిధిని గురించి వివరించటం మొదలుపెట్టాడు. "ఓ మహర్షులారా! బ్రాహ్మణవర్ణంలో పుట్టినవాడు ఉపనయనము పూర్తి అయిన తరువాత సద్గురువును ఆశ్రయించి, ఆయనకు సేవచేస్తూ 12 సం॥ విద్యాభ్యాసం చేసి 25 సంవత్సరాలు వచ్చినతరువాత వివాహం చేసుకుని, గృహస్థాశ్రమ ధర్మాలు నిర్వర్తిస్తూ మంచి పుత్రునికని 25 సం॥ గృహస్తుగా ఉండాలి. 50 నుంచి 75 సం॥ వరకు వానప్రస్థము స్వీకరించాలి. తరువాత ఏకాకిగా అరణ్యాల యందు తిరుగుతూ, నిర్జన ప్రదేశంలో ఉంటూ, ఉచితమైన సత్కర్మలు చెయ్యాలి. ఇహ, పర లోక సుఖాల యందు ఆశను వదలి, విరక్తి గలిగి, చిత్తశుద్ధి పొంది, అహంకార మమకారాలను పూర్తిగా వదలి వెయ్యాలి. సాధనచతుష్టయాన్ని కలిగిఉండాలి. ఇలాంటివాడే సన్యాసానికితగినవాడు." అన్నాడు.

**సన్యాసానికి అర్హత :** సన్యాసము అందరూ తీసుకోవటానికి లేదు. దానికి కొన్ని అర్హతలున్నాయి. అవి

1. నపుంసకుడు 2. భ్రష్టుడు 3. అంగహీనుడు 4. స్త్రీ సంపర్కము గలవాడు 5. చెవిటివాడు 6. బాలుడు 7. మూగవాడు 8. నాస్తికుడు 9. చక్రాంకితమైన వాడు 10. జీవనోపాధి కోసం సన్యసించి ధనవంతుల ఇళ్ళలో ఉండేవాడు. 11. వైఖానసుడు 12. శివార్చకుడు 13. ధనార్జన కోసం వేదం చదివినవాడు 14. కుష్ఠురోగి 15. అగ్నిహోత్రం చెయ్యనివాడు. వీరికి వైరాగ్యమున్నప్పటికీ సన్యాసానికి అనర్హులు. సాధన చతుష్టయము గలవాడే సన్యాసానికి అధికారి. పరివ్రాట్ అంటే విడిచి పెట్టేవాడు. సకలభూతాలవల్ల తాను, తనవల్ల సకలభూతాలు అభయము పొందినవాడే పరివ్రాట్ అనబడతాడు. అతడే పరివ్రాజకుడు.

1. నపుంసకుడు 2. అంగహీనుడు 3. అంధుడు 4. బాలుడు 5. పాపి 6. పతితుడు 7. జీవనోపాధికి ఇతరులను ఆశ్రయించేవాడు 8. వైఖానసుడు 9. శివార్చకుడు 10. చక్రాంకితుడు 11. పాషండుడు 12. బట్టతల గలవాడు 13. అగ్ని కార్యము చేయనివాడు 14. వైరాగ్యము లేకపోవటంవల్ల రెండు మూడు సార్లు సన్యసించిన వాడు 15. ధనం కోసం వేదాధ్యయనం చేసేవాడు. వీరు ఆతుర సన్యాసము స్వీకరించినప్పటికీ, సన్యాసానికి అర్హులు కారు. అత్యవసర కాలంలో తీసుకునేది ఆతురసన్యాసము. మరణ కాలంలో తీసుకునే సన్యాసం కూడా ఆతుర సన్యాసమే. మరణ కాలంలో తప్ప ఆతరురసన్యాసం స్వీకరించరాదు. ఒకవేళ అలా స్వీకరించినా, మళ్ళీ శాస్త్రబద్ధంగా సన్యాసాశ్రమం స్వీకరించాలి. కర్మ ఎప్పుడూ మంత్రసహితంగానే ఉండాలి. లేకపోతే అది అకర్మ అవుతుంది. చేసిన కర్మంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. ఆతురసన్యాసం కూడా మంత్ర సహితంగా, ప్రాజాపత్యయాగం జలంలో చేసి, ఆ తరువాతే సన్యాసం స్వీకరించాలి. మనస్సుతో గాని, శాస్త్రబద్ధంగా గాని, మంత్రావృత్తితో గాని జలంలో వేదోక్తంగా అనుష్ఠానం పూర్తిచేసి, విరక్తి గల విద్వాంసుడు మాత్రమే సన్యసించాలి.

**వైరాగ్యము :** వైరాగ్యం కలిగితేనే సన్యసించాలి. లేకపోతే గృహస్తుగానే ఉండాలి. కోరికలు తీరనివాడు సన్యసిస్తే నరకాన్ని పొందుతాడు. జిహ్వ, ఉపస్థ, ఉదరము, హస్తము తన అధీనంలోకి తెచ్చుకున్న విజితేంద్రియుడు మాత్రమే నువ్యసించాలి. సంసారమునిస్సారము అని గ్రహించి సన్యసించాలి. కర్మ-ప్రవృత్తి రూపం. జ్ఞానము – నివృత్తి రూపము. అందుకని జ్ఞానం సంపాదించి సన్యసించాలి. కేవలము మంత్రజపము, కర్మ, వదిలినంత మాత్రాన అది సన్యాసం కాదు. అది ఇంకొక కర్మ అవుతుంది. ఇంద్రియాలు విషయాసక్తము లైనంతవరకు అది ప్రవృత్తి మార్గమే అవుతుంది. జ్ఞానము అంటే ఇంద్రియాలన్నీ నివృత్తి మార్గంలో విషయదూరములై ఉండాలి. ఇదే సన్యాసము. ఇలా చేసినవాడే పరివ్రాజక పదవికి తగినవాడు. పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకున్నవాడు, సనాతనబ్రహ్మని గురించి తెలుసుకున్నవాడు అప్పుడు మాత్రమే దండాన్ని స్వీకరించి, యజ్ఞోపవీతము, శిఖ వదలిపెట్టాలి.

అనాత్మవస్తువులందు ఆసక్తిని వదలినవాడు, ఈషణత్రయాన్ని త్యజించి పరబ్రహ్మలో అనురక్తుడైనవాడు మాత్రమే బిక్షాన్నము భుజించటానికి అర్హుడు.

అందరితోనూ పూజించబడినప్పుడు, నమస్కరించబడినప్పుడు పొందిన ఆనందము ఇతరులచే కొట్టబడినప్పుడు, తిట్టబడినప్పుడు, అసహ్యించుకొనబడినప్పుడు కూడా పొందగలిగిన వాడే భిక్షాన్న భోజనానికి అర్హుడు. స్తుతి నింద, మానావమానాలను సమానంగా భావించినవాడే సర్వదా ఆత్మారాముడు అవుతాడు. అతడే నిజమైన భిక్షువు. సర్వవ్యాపి అయిన వాసుదేవుడను నేనే. అద్వయమైన అక్షరపరబ్రహ్మను నేనే అని భావించిన వాడే భిక్షాన్న భోజనానికి అర్హుడు. 1. శాంతి 2. శమము 3. శౌచము 4. సంతసము 5. సత్యము 6. ఆర్జవము (కపటము లేకపోవటము, చక్కని నడవడిక) 7. దీనత్వము, 8. దంభము లేకపోవటం. ఈ లక్షణాలు గలవాడే కైవల్యాశ్రమమునందు నివశిస్తాడు. త్రికరణ శుద్ధిగా హింసచెయ్యనివాడు, పాపంచెయ్యనివాడు, అందరికీ మేలు చేసేవాడు మాత్రమే భిక్షువు అనబడతాడు. 1. ధైర్యము 2. క్షమ 3. ఇంద్రియ నిగ్రహము 4. అస్తేయము 5. బాహ్యాంతర శుచి 6. ప్రజ్ఞ 7. బ్రహ్మవిద్య 8. సత్యము 9 క్రోధం లేకపోవటం 10. పరమశాంతం. ఇవి ధర్మ లక్షణాలు. ఈ లక్షణాలు గలవాడు ధర్మాన్ని ఆచరిస్తూ, వేదాంతం వింటూ ఋణత్రయ (దేవఋణము, పితృఋణము, మానవ ఋణము) విముక్తుడైన వాడు మాత్రమే సన్యసించాలి.

**జితేంద్రియుడు :** గతంలో అనుభవించిన సుఖాలు, రాబోయే సుఖాలు, ఈనాడు ప్రాప్తించిన భోగాల గురించి ఆలోచించనివాడు మాత్రమే ముక్తిపొందుతాడు. ఇంద్రియాలను నిరోధించినవాడు, బాహ్యేంద్రియాలతో లోపలికి, అంతరింద్రియాలతో బయటకి చూడగలిగినవాడు సర్వదా కైవల్యాశ్రమములో ఉంటాడు. శవము సుఖదుఃఖాలను ఏవిధంగా స్వీకరించదో, అలాగే ప్రాణమున్నప్పుడు కూడా ఉండగలవాడు మోక్షాన్ని పొందుతాడు. కౌపీనము, కంబళి, ఏకదండము. సన్యాసి ఈ మూడింటినే ధరించాలి. ఎక్కువ గనక ధరిస్తే రౌరవాది నరకాలు అనుభవిస్తాడు. చిరిగిపోయినబట్టలుకుట్టుకుని బొంతగాతయారు చేసుకోవాలి. ఒకటే కాషాయవస్త్రం ధరించాలి. భేదదృష్టి లేకుండా, నిశ్చలుడై ఆశారహితుడై, ఏకాకిగా సంచరించాలి. వర్షాకాలంలో మాత్రమే ఒకేచోట ఉండాలి. భార్యాపుత్రులను వదిలి, తాను చదివిన వేదాలు, శాస్త్రాలు, చేసిన కర్మలు అన్నీ వదిలి రహస్యంగా సంచరించాలి. కామక్రోధాదులను పూర్తిగా త్యజించి, అహంకార

మమకారాలు లేనివాడే పరివ్రాజకుడు. బంగారాన్ని మట్టిని సమానంగా చూసేవాడు, ఏ జీవికీ దుఃఖాన్ని కలిగించనివాడు, ఆశ కొంచెం కూడా లేనివాడే మునీశ్వరుడు. దంభము, అహంకారము, హింస, లోభత్వము, దీనత్వము వంటి దుర్గుణాలు లేనివాడు, ఆత్మజ్ఞాన సంపన్నుడు మాత్రమే ముక్తిని పొందుతాడు. ఇంద్రియ సుఖాలకు వశమయినవాడు దుఃఖము పొందుతాడు. ఇంద్రియాలను నియంత్రించినవాడు జ్ఞానము పొందుతాడు. ఆజ్యం పోస్తే అగ్ని చల్లారదు. అలాగే అనుభవించటం వల్ల కోరికలు తీరవు. కాబట్టి సాధకుడు కోరికలకు వశుడు కారాదు. ఇష్టాఇష్టాలు, రుచి గలవి, రుచి లేని పదార్థాలు తినికూడా వికారం పొందనివాడు, సుగంధము దుర్గంధము, హర్షశోకాల మధ్య తేడా లేనివాడు జితేంద్రియుడు. వాక్కు మనస్సు పరిశుద్ధముగా చేసికొని రహస్యంగా తిరిగేవాడు ముక్తి పొందుతాడు.

**అవమానము :** వాసనలున్నవాడు సన్యాసము స్వీకరించరాదు. వాటిని విషంలాగా చూడాలి. గౌరవములందు కోరికలుండరాదు. అవమానము వల్ల అహంకారము నశిస్తుంది. అందుకని అవమానమును అమృతంలాగా చూడాలి. అవమానం వల్ల సంచితపాపము కూడా నశిస్తుంది. తితిక్ష పెరుగుతుంది. తితిక్ష అంటే ఎదిరించ గలిగిన శక్తి ఉండి కూడా ఎదిరించకుండా ఉండటం. దీనివల్ల తన ఉన్నత స్థితికి బాట ఏర్పడుతుంది. అందుకే అవమానాన్ని అమృతంగా భావించాలి. సన్మానాలు పొందినా, దక్షిణలు స్వీకరించినా, తన సంచితపుణ్యం నశించి పోతుంది. అందుచేత వీతరాగుడు సన్మానము విషంగాను, అవమానము అమృతంగాను భావించాలి. అవమానించబడిన వాడు ఆనందంగా ఉంటాడు. సుఖంగా తిరుగుతాడు. అవమానించిన వాడు దుఃఖిస్తాడు. చివరకు దుఃఖంలోనే నశిస్తాడు. నిందలను ఓర్చుకోవాలి. ఎవరినీ అగౌరవపరచరాదు. ఎవరితోను విరోధం పెట్టు[illegible]డు. నీ మీద కోపగించిన వాడి మీదకూడా నువ్వు కోపగించరాదు. పరమ శాంతంతో వారిని కుశలమడగాలి. అసత్యమాడరాదు. ఆత్మజ్ఞాననిష్ఠుడై నిరపేక్షుడై, ఇతరులను ఆశీర్వదించాలి. ఆశలేనివాడై, ఆత్మబలం గలిగి సుఖస్వరూపుడై సంచరించాలి. ఇంద్రియ నిగ్రహము, రాగద్వేషాలు లేకపోవటము, సకల జీవులందు దయ కలిగి ఉండటంవల్ల అమృతత్త్వము పొందుతాడు. రక్తమాంసాలు, మలమూత్రాలతో కూడి దుర్గంధభరితమైన ఈ దేహాన్ని త్యజించాలి. నవధాతువులతో

కూడిన ఈ దేహం మీద ఆసక్తి గలవాడు నరకం పొందుతాడు. దేహంలో నేను అనే అహంకారమే మృత్యుమార్గాన్ని చూపుతున్నది. సమస్త నాశనములకు కారణమైన అహాన్ని త్యజించాలి.

**పుణ్యపాపాలు :** తనను ప్రేమించే వారి యందు పుణ్యము, ద్వేషించే వారి యందు పాపము వదిలెయ్యాలి. అది ఎలా అంటే ప్రేమించే వారు చేసే స్తుతివల్ల పుణ్యము, ద్వేషించే వారు చేసే నిందవల్ల పాపము నశిస్తాయి. ఇలా సంచిత పాప పుణ్యాలు నశించగా పరిశుద్ధ చిత్తుడై మోక్షానికి అర్హుడవుతాడు. ఈ రకంగా నిదానంగా సమస్త బంధాలు, ప్రతిబంధకాలు త్యజించి, సుఖదుఃఖాలు, లాభనష్టాలు, శీతోష్ణాది ద్వంద్వములను త్యజించి, నిరంతరము పరమాత్మ యందే నివసించాలి. ఎప్పుడూ ఒంటరిగానే సంచరించాలి. ఎవరి సహకారము కోరకూడదు. ఇటువంటి వాడు సర్వదా సిద్ధి పొందుతాడు. ఒంటరిగా తిరిగే వాడికే జ్ఞానబుద్ధి కలుగుతుంది. భిక్షాన్నానికి కపాలము, నివాసానికి చెట్టు తొర్ర, కట్టుకోవటానికి గుడ్డపీలికలు స్వీకరించి, కోరికలు లేకుండా, సర్వజీవుల యందు సమానమైన భావన గలవాడే జీవన్ముక్తుడు. సర్వభూతహితుడు, శాంతుడు, త్రిదండి, కమండలధారి, ఎప్పుడు పరబ్రహ్మమందే రమించేవాడు, సన్యసించి భిక్ష కోసం గ్రామంలోకి వెళ్ళాలి. ఒక్క క్షణము కూడా వృధా చెయ్యకుండా ఆత్మరతి చెయ్యటానికే భిక్షాటనము చెప్పబడింది. ఈ లక్షణాలతో సంచరించే వాడే భిక్షువు. ఇద్దరు కలిస్తే జంట, ముగ్గురయితే గ్రామము, అంతకన్న ఎక్కువైతే నగరము అని భావించాలి. మిథున, గ్రామ, నగరములు చేసే సన్యాసి, స్వధర్మము నుంచి దిగజారుతున్నాడని తెలుసుకోవాలి. అలాంటి వారికి ఉపయోగం లేని లోకాభిరామాయణం పెరుగుతుంది. ఒకరికి ఇద్దరయితే స్నేహము, లోభత్వము, మాత్సర్యము పెరుగుతాయి. పరస్పర సంబంధం వల్ల ధ్యాననిష్ఠ తగ్గుతుంది. రాగద్వేషాలు పెరుగుతాయి. అందుచేత ఒంటరిగా ఉండి, కోరికలను త్యజించాలి. మాట్లాడేటప్పుడు ప్రతి వాక్యానికి 'నారాయణ' అనే పదం వాడాలి. సర్వకాల సర్వావస్థల యందు త్రికరణ శుద్ధిగా పరమాత్మ చింతన చెయ్యాలి. బ్రహ్మను గురించే మాట్లాడాలి. ఉపనిషత్తులు పఠించాలి. ఆత్మనిష్ఠ కోసం ధ్యానము చెయ్యాలి. ఆసనాలు వెయ్యాలి. మరణము, జీవితము వేటినీ గొప్పగా చెప్పరాదు. ఈ రెండిటినీ అభినందించకుండా, ఆయువు ఉన్నంతవరకు, రాజాజ్ఞ కోసం నిరీక్షించే సేవకుడిలాగా, ఎదురు చూడాలి.

**భిక్షువు :** నాలుక ఉండి లేనివాడుగ, పుంసత్వము ఉండి నపుంసకుడుగ, కాళ్ళు ఉండి కుంటివాడుగ, కళ్ళు ఉండి గ్రుడ్డివాడుగ, చెవులు ఉండి చెవిటివాడుగ, సర్వజ్ఞుడైఉండి ఏమీతెలియనివాడుగ ఉండాలి. ఈ ఆరు లక్షణాలు గలవాడే భిక్షువు. అతనికి ఏ బంధాలు ఉండవు. భిక్షువుకు ఆరురకాల ధర్మాలున్నాయి. అవి

**1. అజిహ్వుడు :** తినేటప్పుడు ఇష్టము, అనిష్టము లేనివాడు.

**2. షండుడు :** పసిపిల్లకాని, యవ్వనవతిగాని, వృద్ధురాలుగాని అందరినీ ఒకేలాగా చూసేవాడు.

**3. పంగువు :** కాళ్ళను అదుపులో ఉంచుకునే వాడు. భిక్షాటనకు మాత్రమే తిరిగేవాడు.

**4. అంధుడు :** నుంచున్నా, నడుస్తున్నా అతని దృష్టి నాలుగు కాడిమానులు కన్న ఎక్కువ (యాభై అడుగులు) ప్రసరించనివాడు. నేత్రాలను నియంత్రించి, నిరంతరము బ్రహ్మ దృష్టిలో ఉండేవాడు.

**5. బధిరుడు :** శ్రవణేంద్రియాన్ని అదుపులో ఉంచుకున్నవాడు. స్తుతినిందలను సమానంగా భావించేవాడు.

**6. ముగ్ధుడు :** సర్వేంద్రియాలను జయించినవాడు. ఎటువంటి ఆకర్షణలకు లొంగనివాడు. లోకవ్యవహారాలతో సంబంధం లేనివాడు. ఈ విధంగా అన్ని ఇంద్రియాలు ఉండి లేనివాడు లాగా, సర్వజ్ఞుడై ఉండి పిచ్చివాడిలాగా తిరిగేవాడు భిక్షువు అనబడతాడు. అంతేకాదు 1. నటులను, నాట్యాలను చూడటం 2. జూదము ఆడటం, 3. కామవాంఛ గల కాంతలతో స్నేహము 4. భక్ష్యాలు 5. భోజ్యాలు 6. రజస్వలా స్త్రీ దర్శనము. ఇవి పూర్తి బంధనాలు కాబట్టి యతి వీటిని చెయ్యరాదు. రాగము, ద్వేషము, మదము, మోహము, ద్రోహము వీటిని మనసులోకి రానుకూడా రానీయరాదు. 1. మంచము 2. తెల్లని వస్త్రము 3. శృంగార కథాశ్రవణము 4. చంచలబుద్ధి 5. పగటి నిద్ర 6. దూరప్రయాణము. ఇవి యతీశ్వరుడికి పతన హేతువులు. నిరంతరము బ్రహ్మచింతన చేసేవాడు సుదూర యాత్రలు చెయ్యరాదు. ఉపనిషత్తులు ఎప్పుడూ చదువుతూ ఉండాలి. తీర్థయాత్రలు, ఉపవాస దీక్షలు, ధ్యానము విడిచి పెట్టాలి. కేవలము అధ్యయనశీలుడు, వ్యాఖ్యానపరాయణుడు

కారాదు. ఇవి శాస్త్రవాసనను పెంచుతాయి. పాపరహితము, కపటశూన్యము అయిన పరిశుద్ధ జీవనము గడపాలి. తాబేలు తన అవయవాలను అవసరమైనప్పుడు తనడిప్ప కింద దాచుకున్నట్లుగా, యతి తన అవయవాలను తన అధీనంలో ఉంచుకోవాలి. మనోవృత్తులను నశింపచెయ్యాలి. దేనియందు ఆసక్తి ఉండరాదు. అపరిగ్రహుడు కావాలి. సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతుడు కావాలి. అహంకార మమకారాలు లేకుండా ఏకాంత వాసియైన యతీశ్వరుడు సర్వబంధనముల నుంచి విముక్తుడవుతున్నాడు.

వైరాగ్యము గలవాడు బ్రహ్మచారిగాని, గృహస్థుగాని, వానప్రస్తుడు గాని ఎవరైనా సన్యసించవచ్చు. మూడు ఆశ్రమాలు పూర్తిచేసి తీసుకునేది క్రమసన్యాసము అంటారు. కర్మని, ఇతర మంత్రాలని వదలి, మోక్షమంత్రాలతో సన్యాసం స్వీకరించాలి. పరమాత్మను మాత్రమే ధ్యానం చెయ్యాలి.

**శిఖయజ్ఞోపవీతములు :** సన్యాసం స్వీకరించాలంటే శిఖ, యజ్ఞోపవీతాలను తీసెయ్యాలి. అక్షర పరబ్రహ్మమే సూత్రము. కాబట్టి అక్షరపరబ్రహ్మ అనే సూత్రాన్నే ధరించాలి. అన్నింటి యందు అంతర్లీనంగా ఉండి సర్వాన్నీ చూస్తుంటుంది కాబట్టి సర్వాంతర్యామియే సూత్రము. సూత్రము అంటే పరమపదమే. ఈ విషయం తెలిసినవాడే జ్ఞానసంపన్నుడు. సూత్రంతో మణులను మాలగా కట్టినట్లు, పరమాత్మ వల్ల సర్వభూతాలు మాలగా కూర్చబడినాయి. అటువంటి పరమాత్మసూత్రాన్ని ధరించిన యోగియే యోగవిదుడు. అటువంటి సూత్రాన్ని ధరించి, బాహ్యసూత్రాన్ని వదిలెయ్యాలి. ఎవరు పరమాత్మ భావాన్ని సూత్రంగా ధరిస్తారో, వారే చైతన్యవంతులు. అటువంటి సూత్రాన్ని ధరించిన వారు ఎంగిలిభోజనము చేసినా తప్పులేదు. అశుచి కాదు. జ్ఞానియైన వాడికి బ్రహ్మసూత్రము అంతర్గతంగా ఉంటుంది. అటువంటి జ్ఞానియే సూత్రవిదుడు. అతడే యథార్థ యజ్ఞోపవీతధారి. జ్ఞానయజ్ఞోపవీతం ధరించిన వారికి జ్ఞానమే శిఖ, జ్ఞానమే అనుష్ఠానము. జ్ఞానమే పరమాత్మ. అగ్నికి ఏ రకంగా జ్వాల (శిఖ) ఉన్నదో అలాగే జ్ఞానికి జ్ఞానమే శిఖ. అటువంటి జ్ఞానియే శిఖి. అతడే విద్యావేత్త. బాహ్యశిఖ, శిఖ అనిపించుకోదు. అది జుట్టు మాత్రమే. వైదిక కర్మానుష్ఠానం చేసే వారికి మాత్రమే బాహ్యసూత్రము కావాలి. బాహ్యసూత్రము కేవలము వైదిక ప్రక్రియ. ఎవరికైతే జ్ఞానమే శిఖగా, యజ్ఞోపవీతంగా ఉంటుందో, అతడే సకల బ్రాహ్మణ ధర్మాలు తెలిసినవాడు.

**ముక్తికి అర్హత :** సర్వజ్ఞుడయిన విజ్ఞాని సన్యసించి, ద్వంద్వముల వల్ల వచ్చే కష్టాలు భరించగలిగినట్లైతే ఏకవస్త్రము ధరించవచ్చు. అటువంటి వాడు శిరోముండనం చేయించుకుని, అపరిగ్రహవ్రతము ఆచరించాలి. ఒకవేళ అతనికి తీవ్రమైన వైరాగ్యం ఉన్నట్లైతే, సర్వద్వంద్వాలను సహించాలి. అప్పుడే పుట్టిన పిల్లవాడు లాగా బట్టలు కూడా లేకుండా ఉండాలి. జగత్తంతా మిధ్యగా భావించి భార్య, పుత్రులు, మిత్రులు మొదలైన బంధనాలు వదిలెయ్యాలి. సర్వకర్మలు, కౌపీనము, నింద, అహంకారము, దంభము, సుఖదుఃఖాలు, కామక్రోధాలు అన్నీ వదిలెయ్యాలి. శరీరాన్ని శవముగా భావించాలి. పరబ్రహ్మ స్వరూపమయిన స్వస్వరూపాన్నే లోపల, బయట అంతటా భావించాలి. ఎవరికీ నమస్కారము చెయ్యరాదు. అగ్నికార్యముగాని, ఆశీర్వాదముగాని, నిందాస్తుతులుగాని చెయ్యరాదు. యాదృచ్ఛికంగా ప్రాప్తించిన వాటితో తృప్తి చెందాలి. బంగారాన్ని ముట్టుకోరాదు. అటువంటి సన్యాసికి ఆవాహన విసర్జన, మంత్రామంత్రములు, ధ్యానోపాసనలు, లక్ష్యాలక్ష్యములు, భేదాభేదభావములు, స్వదేశ విదేశాలు అనేవి ఏవీ ఉండవు. ఏ ప్రదేశంలోనూ స్థిరంగా ఉండరాదు. జీర్ణగృహాలు, పాడుపడ్డ దేవాలయాలు, పర్ణశాలలు, కుమ్మరి గృహాలు, యాగశాలలు, హోమకుండాల దగ్గర, నదీతీరాలు, ఇసుకతెన్నెలు, భూగృహాలు, కొండగుహలు, చెట్టుతొర్రలు, అడవులు, సముద్రతీరాల యందు విహరించాలి. సంవర్తకుడు, దత్తాత్రేయుడులాగా మారువేషాలలో తిరగాలి. సర్వజ్ఞుడై కూడా పిచ్చివాడిలాగా ఉండాలి. సదా సత్యాన్వేషణలోనే తిరుగుతుండాలి. జీవించటం కోసం మాత్రమే తినాలి. అన్నింటి యందు సమభావం కలిగి పుణ్యాపాపాలకు దూరంగా ఉండాలి. పరిపూర్ణ బ్రహ్మానందబోధ స్వరూపుడై **"అహంబ్రహ్మాస్మి"** అనే బ్రహ్మప్రణవాన్ని జపిస్తూ భ్రమర కీటక న్యాయానుసారము మూడు శరీరాలను త్యజించి, సన్యాసదీక్షలో ఈ శరీరాన్ని త్యజించాలి. ఇటువంటి వాడే సన్యాసి. పరివ్రాజకుడు, అతడే మోక్షానికి అర్హుడు.

ఉపనిషత్తులో ఇంకా అనేక విషయాలు చెప్పబడ్డాయి. కాని ఇంతవరకు చెప్పినవి సన్యాసికి ఉండవలసిన లక్షణాలు. ఈ లక్షణాలు గలవాడే సన్యాసం స్వీకరించాలి. అటువంటి వాడే ముక్తికి అర్హుడు. ఈ లక్షణాలు లేనివాడు సన్యసించినట్లైతే అది సన్యాసము అనే పదానికే విఘాతము కలిగిస్తుంది. సన్యాసం ఒకరిచ్చేది, ఇంకొకరు పుచ్చుకునేది కాదు. ఎవరికి వారు జ్ఞానవైరాగ్యాలు వృద్ధి చేసుకోవాలి.

# 8. సుఖదుఃఖాలు

సుఖదుఃఖాలు, పాపపుణ్యాలు, మానావమానాలు, అహంకారమమకారాలు ఇలాంటి వాటిని ద్వంద్వములు అంటారు. ఒక్కొక్క పదంలో రెండు రెండు ఉంటాయన్న మాట. సుఖము దుఃఖము, పాపము, పుణ్యము ఇలా. వీటన్నింటినీ మానవుడు తన అజ్ఞానంతో సృష్టించుకుంటున్నాడు. ఇలాగే బంధాలు కూడా అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, తల్లిదండ్రులు, పిల్లాపాపలు వీటన్నింటినీ బాగా సృష్టించుకుని సంసారము అనే ఊబిలో అంతకంతకు కూరుకుపోతున్నాడు. అలా కూరుకుపోతూ అందులో నుంచి బయటకు వచ్చే మార్గం లేక, దరిచేరే ఉపాయం తెలియక సంసార సాగరంలో పడి మునుగుతూ తేలుతూ ఉన్నాడు. ఇక్కడ సంసార సాగరంలో మునిగిపోవటం అంటే – కష్టాలలో కూరుకుపోవటం. తేలటం అంటే – సంసారంలో సుఖాలను అనుభవించటం– ఇక్కడ సుఖము అనేది శాశ్వతమైనది కాదు. క్షణికమైనది. అనుభవించేటంత వరకు మాత్రమే ఉంటుంది. ఆ తరువాత అనేక రకాలైన బాధలకు దారి తీస్తుంది. ఈ కారణం చేతనే మానవుడు ఎప్పుడూ శాశ్వతమైన సుఖం కోసమే ప్రాకులాడాలి.

అసలు సుఖమంటే ఏమిటి ? దుఃఖమంటే ఏమిటి ? ఈ విషయాలన్నీ 'త్రిపురారహస్యము' అనే గ్రంథంలో వివరించబడ్డాయి. దశార్ణ దేశానికి రాజు ముక్తాచూడుడు. అతని కుమారుడు హేమచూడుడు. ఒకసారి హేమచూడుడు వేటకు వెళ్ళి విధివశాత్తు ఒంటరిగా ఒక ముని ఆశ్రమం చేరి, అక్కడ మునికుమార్తెను ఇష్టపడి ముని అనుమతితో వివాహం చేసుకుంటాడు. ఆ ముని కుమార్తె పేరు హేమలేఖ. ఆ పిల్లకు లౌకిక విషయాలకన్న పారమార్థికమైన విషయాల మీదనే దృష్టి ఎక్కువ. భర్తతోపాటు కాపరానికి వచ్చినా కూడా, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగా ఉండేది. ఒకరోజున హేమలేఖ తోటలో విహరిస్తూ ఒకచోట కూర్చుని ఏదో ఆలోచిస్తుంటుంది. ఆ సమయంలో హేమచూడుడు వెనకగా వచ్చి ఆమెను గట్టిగా కౌగిలించుకున్నాడు. అసలు తనభర్త వచ్చాడనే విషయమే ఆమెకు తెలియదు. కొన్ని క్షణాల తరువాత ఆమె ఈ లోకంలోకి వచ్చి "నాథా! ఎంత సేపైంది నువ్వు వచ్చి" అని అడుగుతుంది.

రాకుమారుడు చాలా అందగాడు. హేమలేఖ కూడా అందాలరాశి. కోరుకున్న సుందరాంగితో పగలు రాత్రి తేడా లేకుండా సుఖాలు అనుభవిస్తున్నాడు. కాని హేమలేఖ మాత్రం ఈ సుఖాల యందు ఆసక్తి పెద్దగా చూపకుండా ఉదాసీనంగా ఉంటోంది. ఇక ఉండబట్టలేక రాకుమారుడు “ఓ ప్రేయసీ ! నువ్వు చాలా అందగత్తెవు. నేను ఇష్టపడి నిన్ను కావాలని వివాహం చేసుకున్నాను. నీయందు చాలా అనురాగంతో ఉన్నాను. నువ్వు అలా కనిపించటం లేదు. ఈ భోగాల మీద నీకెందుకు ఆసక్తి లేదు? ఎందుకు ఉదాసీనంగా ఉంటున్నావు? నీకు ఆసక్తి లేకపోతే నాకు మాత్రం సుఖం ఎలా ఉంటుంది? నేను నీమీద కోరికతో ఉన్నాను. నువ్వేమో పరధ్యానంలో ఉన్నావు. ఎన్నిసార్లు పిలిచినా పలకవు. నేను నిన్ను కౌగిలించుకున్నప్పటికీ ఆ విషయం చాలాసేపటిదాకా నీకు తెలియటంలేదు. ఆ తరువాత నేను ఎప్పుడు వచ్చాను అని అడుగుతున్నావు. అందమైన వస్తువులు చూసినా, వాటిమీద నీకు ఆసక్తి ఉండటం లేదు. నేనెప్పుడు వచ్చినా నువ్వు సుఖాలమీద ఇష్టం లేనట్లుగా ఉంటున్నావు. ఇంక నాకు సుఖమెలా ఉంటుంది. కొయ్యబొమ్మతో సుఖించలేను కదా ? నీకేమయింది? నీ కోరికలు తీర్చటంకన్నా నాకు వేరే పనిలేదు. నా ప్రాణాలకన్నా ఎక్కువగా నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు ఎందుకు ఇలా ఉంటున్నావో చెప్పవలసింది” అని అడిగాడు. ఆ మాటలు విన్న హేమలేఖ తన భర్తకు జ్ఞానబోధ చెయ్యాలనుకుని చెప్పటం ప్రారంభించింది. “నాథా ! నీ యందు నాకు విరక్తి లేదు. ఈ లోకంలో ఏది ప్రియము ? ఏది అప్రియము ? ఈ విషయాన్ని గురించే ఆలోచిస్తున్నాను. అయినా అది నాకు తెలియటం లేదు. కాబట్టి ప్రియమేదో, అప్రియమేదో నాకు వివరించవలసింది” అన్నది.

ఆ మాటలు విన్న హేమచూడుడు పెద్దగా నవ్వి “స్త్రీలు మూఢచిత్తులనే విషయం నిన్ను చూసిన తరువాతనే తెలుస్తోంది. ప్రియము, అప్రియము అనే పదాలకు అర్థం మానవులకే కాదు. పశుపక్ష్యాదులకు కూడా తెలుసు. ఈ విషయం తెలుసు కాబట్టే జీవులన్నీ ప్రియమైన విషయాలను ఆచరిస్తున్నాయి. అప్రియమైన వాటిని వదిలేస్తున్నాయి. ఇందులో పెద్దగా ఆలోచించాల్సింది ఏమీ లేదు. ఏది సుఖాన్ని ఇస్తుందో అది ప్రియము. దేనివల్ల దుఃఖము కలుగుతుందో అది అప్రియము” అన్నాడు. ఆ మాటలు విన్న హేమలేఖ “రాజా ! సుఖం కలుగచేసేది ప్రియము,

దుఃఖం కలిగించేది అప్రియము అన్నావు. అయితే దేశకాలమాన పరిస్థితులను బట్టి ఒకే వస్తువు సుఖాన్ని, దుఃఖాన్ని కూడా కలిగిస్తుంది. ఉదాహరణకు నిప్పు చలికాలంలో ప్రియమైనది. వేసవి కాలంలో అప్రియమైనది. అలాగే భోగభాగ్యాలు, భార్య పిల్లలు ఉంటేసుఖము లేకపోతేదుఃఖము అంటావా? మరి నీ తండ్రికి ఇవన్నీ ఉన్నాయి. కాని నిరంతరము ఏదో ఒక విషయాన్ని గురించి ఆలోచిస్తూనే ఉంటాడు. భోగభాగ్యాలు లేని వారందరూ ఈ రకంగా బాధపడటం లేదు. స్వర్గాధిపతియైన ఇంద్రుని కన్నా కూడా, బిచ్చగాడు చాలా సుఖంగా ఉన్నాడు. దొరికింది తిని, చెరువులో నీరు త్రాగి, చెట్టు క్రింద పడుకుని హాయిగా నిద్రపోతున్నాడు. ఈ సుఖం దేవేంద్రుడికి లేదు. అల్పమైన భోగాల వల్ల దుఃఖమే కలుగుతుంది. దుఃఖంతో కలిసి ఉన్న సుఖము నిజమైన సుఖం కాదు. దుఃఖము రెండు రకాలు.

1. అంతరము – కోరికల వల్ల కలిగేది
2. బాహ్యము – శరీరంలోని ధాతులోపం వల్ల కలిగేది

ఈ రెండింటిలోనూ మానసిక దుఃఖమే ఎక్కువ కష్టాన్ని కలిగిస్తుంది. జగత్తును పీడిస్తున్నది ఇదే. కోరికఅనేది దుఃఖముఅనే వృక్షానికి మూలబీజం. కోరికలు లేకపోతే దుఃఖముఉండదు. స్వర్గంలో సకలభోగాలు అనుభవిస్తున్న దేవతలకన్న ఎన్నో రెట్లు భోగాలనుభవిస్తున్న ఇంద్రుణ్ణి చూడు. అహల్యమీద కోరికతో పోయి శాపం కొనితెచ్చుకున్నాడు. కాబట్టి కోరికలు తీరినందువల్ల సుఖమే కాదు దుఃఖం కూడా వస్తుంది. రాజా ! రతిక్రీడవల్ల సుఖం కలుగుతుంది అనుకుంటున్నావు. క్రీడానంతరము అలసట కలుగుతోంది కదా ? క్రీడానంతరము బరువు మోసిన పశువుకు కలిగే బడలికమాటేమిటి ? సౌందర్యాన్ని చూసినందువల్ల సుఖం కలుగుతుంది అంటావా ? ఈ సుఖం కేవలం అభిమానం వల్ల కలిగేదే. సౌందర్యవతి అయిన స్త్రీని చూసినప్పుడు యవ్వనంలో ఉన్నవాడు పొందే ఆనందం, ఒక బాలుడు గాని, యతీశ్వరుడు గాని పొందరు. ఎందుకని? ఈ సుఖము అనేది వారి మనసుకు సంబంధించినది. దీనికి ఉదాహరణగా ఒక కథ చెపుతాను విను.

పూర్వకాలంలో ఒక రాకుమారుడు ఉండేవాడు. అతను చాలా అందగాడు. అపరమన్మథుడు. అతని భార్య కూడా మిక్కిలి సౌందర్యవతి. వారిద్దరూ రతీమన్మథుల లాగా ఉండేవారు. రాకుమారుడికి భార్యపట్ల అమితమైన ప్రేమ. ప్రతిరోజూ రాత్రిపూట

భోజనం చేసిన తరువాత రాకుమారుడు మధువు సేవించి భార్య దగ్గరకు వెళ్ళేవాడు. అక్కడ వారు ఆనందపుఅంచులదాకా విహరించేవారు. అతని భార్య మనసు మాత్రం ఒక సేవకుని యందు లగ్నమైంది. అతడు చాలా కురూపి. రాకుమారుడికి మధువు అందిస్తుంటాడు. ఒకరోజున సేవకుడు మధువు అందిస్తున్నాడు. రాకుమారుడు త్రాగుతున్నాడు. ఇంతలో ఏదో ఒక అవసరమైన పనిపడి సేవకుడు బయటకు వెళ్ళాడు. రాకుమారుడు కూడా అన్యమనస్కంగా మధ్యలోనే, మధువు పూర్తిగా త్రాగకుండానే శయ్యామందిరానికి వెళ్ళాడు. అక్కడ తన భార్యతో స్వర్గసుఖాలు అనుభవించాడు. ఆ తరువాత అలసిపోయిన భార్య ముఖం ఎలా ఉంటుందో చూడాలనిపించింది. దీపపు వెలుగులో ఆమె ముఖాన్ని చూశాడు. అంతే అవాక్కై పోయాడు. శయ్యమీద ఉన్నది తన భార్య కాదు. తన దగ్గర పనిచేసే కురూపి అయిన దాసి. ఇంతవరకు నేను సుఖించింది ఈ దాసితోనా ? ఈ కురూపితోనా ? తలచుకుంటేనే వళ్ళు జలదరిస్తున్నది. అని వెంటనే ఎడమచేత్తో ఆమె జుట్టు పట్టుకుని, కుడిచేత్తో కత్తి తీసుకుని "నా భార్య ఎక్కడున్నది? నువ్వెందుకున్నావిక్కడ?" చెప్పమన్నాడు. దాసి ప్రాణభయంతో విలవిలలాడిపోయింది. చెబితే వాళ్ళుచంపేస్తారు అన్నది. చెప్పకపోతే నేను చంపేస్తాను. నా భార్య ఎక్కడున్నదో చెప్పు అన్నాడు రాకుమారుడు. నాకు ప్రాణదానం చేస్తే చెబుతానన్నది దాసి. అలాగే నన్నాడు రాకుమారుడు. అప్పుడు దాసి రాకుమారుని వెంట పెట్టుకుని రాణిగారి మందిరానికి తీసుకువెళ్ళింది. అక్కడ శయ్యామందిరంలో రాణి ఇంకొక పురుషుడితో సుఖాలు అనుభవిస్తోంది ఆ పురుషుడు ఎవరో కాదు. ఇంతవరకు తనకు మధువు అందించిన సేవకుడు. బహుకురూపి. హతాసుడైనాడు రాకుమారుడు. తాను రాకుమారుడు. అమితమైన అందగాడు అలాంటి తననుకాదని కురూపియైన సేవకునితో తన భార్య సుఖిస్తున్నది. చేతిలోని కత్తి జారిపోయింది, దాసి జుట్టు వదిలేశాడు. విచారంలో మునిగిపోయాడు.

ఈ కథ చెప్పి, రాజా ! అంతవరకు ప్రతిరోజూ రాకుమారుడు ఆ దాసితోనే సుఖాలు పొందుతున్నాడు. ఇప్పుడు ఆవిడ దాసి అని తెలిసేసరికి, ఆవిడ ముఖం చూసేసరికి, ఒళ్ళు జలదరించింది. అసహ్యం వేసింది. అలాగే రాణి అందమైన రాకుమారుణ్ణి కాదని సేవకుడితో సుఖిస్తోంది. ఇప్పుడు చెప్పు మహారాజా ! క్షణం

క్రితం వరకు సుఖం అనిపించినది, మరుక్షణంలో ఎందుకు అసహ్యమనిపించింది? ఓ రాకుమారా ! ఇక్కడ ఆనందము, సుఖము అనేవి కేవలము మనసులో నుంచి పుట్టినవేనయ్యా ! అని చెప్పింది హేమలేఖ.

ఇంతవరకు చెప్పినదాని సారాంశం చూడండి. సుఖము, దుఃఖము అనేవి విడిగా ఎక్కడా లేవు. అవి పూర్తిగా మనసుకు సంబంధించినవి. ఇది సుఖంగా ఉన్నది అనుకుంటే సుఖంగా ఉంటుంది. లేకపోతే లేదు. **యామతిసాగతిః** ఎలా భావన చేస్తే అలాగే ఉంటుంది. సర్వసుఖాలు అనుభవిస్తున్నా, మనసు ప్రశాంతంగా లేకపోతే సుఖం ఉండదు. మనసు గనక శాంతంగా ఉంటే బిచ్చగాడు కూడా చెట్టు నీడన హాయిగా విశ్రమిస్తాడు. సుఖదుఃఖాలకు కారణం మనస్సే. నేను నాది అనే అహంకార మమకారాలు ఉన్నంత వరకు మనసుకు ప్రశాంతత ఉండదు. వాటిని గనక వదిలేస్తే అంతా శాంతే. అంతా సుఖమే. రాగద్వేషాలను వదలగలిగిన వాడు పరమసుఖాన్ని పొందుతాడు.



# 9. బంధమోక్షాలు

బంధము అంటే అడ్డంకి, కట్టుతాడు అని అర్థం. ఎవరైనా ఒక మనిషిని త్రాళ్ళతో కట్టేశాము అనుకోండి. అప్పుడు అతడు అక్కడ నుంచి కదల్లేడు. ఎవరైనా వచ్చి ఆకట్లు విప్పితేకాని అక్కడ నుంచి కదిలి బయటకి వెళ్ళలేడు. ఏదైనా ఒక వాహనం వేగంగా పోతోంది. దాన్ని నిరోధించటానికి త్రోవకి అడ్డంగా రాళ్ళు పెట్టటము, చెట్లు మొదలైనవి పడెయ్యటము, గోతులు తవ్వటం చేస్తుంటారు. దీనివల్ల ఆవాహనం ముందుకు పోలేదు. రాళ్ళు, చెట్లు, గోతులే దానికి అడ్డంకి. ఇలాగే మానవుడు పురుషార్థాల సాధన కోసం ప్రయత్నిస్తుంటాడు. పురుషార్థాలలో చివరది మోక్షము. మిగిలినవి అంటే ధర్మార్థకామాలు మోక్షసాధకు మాత్రమే ఉపయోగిస్తాయి. అలాగే ఉపయోగించాలి కూడా. ఐతే, మానవుడు ఆధ్యాత్మికంగా పురోభివృద్ధి చెందకుండా, మోక్షమార్గం వైపునడవకుండా కొన్ని అడ్డంకులు ఎదురవుతూ ఉంటాయి. వాటినే 'బంధనాలు' అంటారు. అవే బంధాలు. భౌతికమైన బంధనాలు. ఇవి ఎలా వస్తాయి? అంటే ఇది చాలా చిన్న విషయం. బంధానికి మోక్షానికి ఒక్కటే అక్షరం తేడా. 'మమ' అంటే బంధము 'నమమ' అంటే మోక్షము. బంధనాలు అంటే ఇక్కడ త్రాళ్ళు, రాళ్ళు, చెట్లు కావు. నేను నాది అనే అహంకార మమకారాలు. ఇవే ఇక్కడ రాళ్ళు, త్రాళ్ళు. వీటివల్లనే మానవుడు ఆధ్యాత్మికంగా పురోభివృద్ధి పొందలేకపోతున్నాడు.

మానవుడు తన అజ్ఞానం వల్ల ఆత్మను అనాత్మగా భావిస్తాడు. అసలు ఆత్మ అంటే ఏమిటి ? అనాత్మ అంటే ఏమిటి ? ముందుగా ఆత్మని గురించి చూద్దాం. "దేన్ని గురించి తెలుసుకున్నంత మాత్రం చేత మానవుడు బంధనాల నుండి విడివడి మోక్షం పొందుతాడో – అదే ఆత్మ" దేనిని గురించి తెలుసుకున్నందువల్ల సర్వమూ తెలుస్తుందో – అదే ఆత్మ. మరి అనాత్మ అంటే ఏమిటి ? శరీరము, ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సు, అహంకారము మొదలైనవి, వీటి పరిణామాలు, ఇంద్రియ భోగ వస్తువులు, వాటి సుఖాలు, పంచభూతాలు, పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఆవరించి ఉన్న ఈ జగత్తు. ఇవన్నీ కలిసి అనాత్మ అనబడతాయి. మహత్తు నుంచి స్థూలశరీరందాకా, అన్నీ మాయవల్ల ఏర్పడ్డవే. మాయవల్ల కల్పించబడ్డవే. ఇవన్నీ

మాయారూపమే. అంతా అనాత్మే అంటే ఆత్మకానిదే. మాయకూడా అనాత్మే. ఇదంతా అనిత్యమైనది. అశాశ్వతమైనది. మరుమరీచికలు. ఎడారిలో ఎండమావి లాంటివి. ఇవన్నీ అంటే ఈ దేహము, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, పంచభూతాలు, తన్మాత్రలు, మనస్సు, అంతఃకరణ, కొండలు, పర్వతాలు, నదులు, ఎడారులు, అడవులు, సముద్రాలు కనిపిస్తున్న ప్రతిదీ, దృశ్యమానమైన ఈ జగత్తంతా అశాశ్వతమైనదే. అదంతా అనాత్మయే. ఉన్నది లేనట్లుగా కన్పించటం మాయ. లేనిది ఉన్నట్లుగా కన్పించటం భ్రమ. ఎడారిలో ఎండమావులు భ్రమాజన్యమైనవే. అలాంటిదే ఈ జగత్తు కూడా. అందుకే ఇదంతా అనాత్మ. మానవుడు తన అజ్ఞానం వల్ల ఆత్మను అనాత్మగా, అనాత్మను ఆత్మగా భావిస్తాడు. అశాశ్వతమైన ఈ జగత్తు ఈ దేహము, ఇంద్రియాలు. ఇవన్నీ శాశ్వతము అనుకుంటాడు. ఇక్కడ రెండు రకాల దోషాలున్నాయి. 1. అగ్రాహ్యము 2. అన్యధాగ్రాహ్యము ఈ రెండు కారణాల వల్ల జగత్తులో మానవుడు తప్పులు చేస్తున్నాడు. అగ్రాహ్యము అంటే ఉన్న దాన్ని సరిగా తెలుసుకోలేకపోవటము. అన్యధాగ్రాహ్యము అంటే ఉన్నదాన్ని, ఇంకొకటిగా భావించటము. ఉదాహరణకి చీకట్లో ఒక బండరాయిని చూశాడు. అది రాయి అని గ్రహించలేక పోయాడు. పైగా తన అజ్ఞానం కారణంగా ఎవరో ఒక దొంగ అని ఊహించుకున్నాడు. కాబట్టి చీకట్లో రాయిని చూసి దొంగ అనుకున్నాడు. భయపడ్డాడు. కేకలు వేశాడు. అందర్నీ ప్రోగు చేశాడు. దీనంతటికీ కారణము పైన చెప్పిన రెండు దోషాలే. ఈ దోషాల వల్లనే సంసారసాగరంలో కూరుకు పోతున్నాడు. ఈ అజ్ఞానం వల్లనే మలమూత్రాలతో నిండి, రక్తమాంసాలతో కూడిన స్త్రీ యొక్క దేహం చాలా అందంగా కనిపిస్తోంది. దానివల్ల ఆమె యందు అనురాగము, కామము పెరుగుతున్నాయి. వాటి కారణంగా సంసార బంధనాలలో ఇంకా ఇంకా కూరుకుపోతున్నాడు. జుగుప్సాకరమైన స్థూలదేహాన్ని చూసి అదే జీవితపరమార్థం అని భ్రమిస్తున్నాడు. అదే బంధము. అశాశ్వతమైన ఈ దేహమే ఆత్మ అని భావిస్తున్నాడు. బృహదారణ్యకంలో చెప్పినట్లుగా దేహమే ఆత్మ అని భావన చేసేవారు దైత్యులు. అజ్ఞానులు. ఈ దేహం శాశ్వతం కాదని తెలిసినా, జగత్తు అశాశ్వతమని తెలిసినా, తన కంటి ముందే అయిన వాళ్ళంతా మరణించినా, కట్టడాలు కూలిపోయినా, రాజ్యాలు నాశనమై పోయినా, ఆ భ్రమలో నుంచి బయటకు రాలేడు.

తాతలు, ముత్తాతలు తండ్రులు అంతా మరణించారు. రేపో మాపో తను కూడా పోతాడు. అయినప్పటికి దేహము అశాశ్వతము అని నమ్మలేడు. దీనికి కారణం అనాదిగా వస్తున్న అజ్ఞానం. అదే మాయ. జగత్తులో రాగమే పెద్ద పాశం. యమపాశం కన్నా బలమైనది. భగవంతుడి కరుణకు పాత్రుడయితే మార్కండేయుడి లాగా యమపాశాన్ని కూడా తప్పించుకోవచ్చు. కాని రాగము అనే పాశం నుంచి మాత్రం తప్పుకోవటం సాధ్యం కాదు. మునీశ్వరులు, ఋషీశ్వరులు అందరూ ఈ పాశానికి బద్ధులే. అందుకే రాగమే బంధము, మానవుడు ఈ కోరికలు తీర్చుకోవటానికే కర్మలు చేస్తాడు. కర్మశేషం అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తాడు. ఇలా జనన మరణాలను కొని తెచ్చుకుంటున్నాడు. శరీరంతో తాదాత్మ్యం చెందుతున్నాడు. నేను అంటే ఈ దేహమే అని భావిస్తున్నాడు. అతని దృష్టిలో దేహమే ఆత్మ. అనేక రకాలయిన భోగవస్తువులతో ఈ శరీరాన్ని పెంచి పోషిస్తున్నాడు. దాని ఫలితంగా పట్టుపురుగు దారాలతో గూడును అల్లి, అందులో తన శరీరాన్నే బంధించినట్లుగా తాను చేసే కర్మఫలితాల వల్ల బంధనాలలో కూరుకుపోతున్నాడు. పూర్తిగా అజ్ఞానంతో ఆవరించబడినవాడు ఏది మంచో, ఏది చెడో నిర్ణయించుకోలేక పోతున్నాడు. కంటికి ఎదురుగా ఉన్న దాన్ని చూసి కూడా పొరపాటు పడుతున్నాడు. త్రాడును చూసి పాము అనుకుంటున్నాడు. ఇలా పొరపడటం వల్ల, తప్పు అభిప్రాయాల వల్ల, అనేక ప్రమాదాలకు, హైరాణకు తాను గురి అవుతున్నాడు, ఇతరులను గురి చేస్తున్నాడు. కష్టాలకు లోనౌతున్నాడు. తమోగుణ ప్రధానమైన ఆవరణశక్తి మనస్సును ఆవరించి ఉన్నది. రాహువు సూర్యుని ఆవరించినట్లుగా అఖండము, అనంతము, నిత్యము అద్వయము అయిన ఆత్మను ఆవరించి ఉంటోంది. దానివల్ల ఆత్మని గురించి తెలియనివాడు అనాత్మ అయిన దేహమే తాను అని భావిస్తాడు. దేహంతో తాదాత్మ్యం చెందుతాడు. ఈ సమయంలో రజోగుణం నుంచి పుట్టిన విక్షేపశక్తి కామము, క్రోధము అనే గుణాలతో మానవుణ్ణి గట్టిగా బంధిస్తుంది. ఎప్పుడయితే కామక్రోధాది గుణాలు విజృంభించాయో, అప్పుడు అతడికి ఉన్న ఆత్మజ్ఞానం పూర్తిగా నాశనమయిపోతుంది. ఆ సమయంలో బుద్ధియొక్క వృత్తులనీ ఆత్మలక్షణాలే అనుకుంటాడు. విషయభోగాలే జీవిత పరమావధి అనుకుంటాడు. విషయభోగాలతో నిండిన సంసారసాగరంలో పడి మునుగుతూ, తేలుతూ ఉంటాడు. ఇక్కడ మునగటం

అంటే–కష్టాలతో బాధ పడటం. తేలటము అంటే – లౌకికమైన సుఖాలు అనుభవించటం. దుఃఖాలు అనుభవిస్తున్నప్పటికీ కూడా సుఖాల కోసం ప్రాకులాడతాడు. ఈ సుఖం శాశ్వతం కాదని తెలుసుకోలేడు. ఆకాశంలో ప్రకాశిస్తున్న సూర్యునివేడికి నేలమీద ఉన్న నీరు ఆవిరై, మేఘాల రూపంలో ఆకాశం చేరి, తనకు ఆ రూపాన్నిచ్చిన సూర్యుణ్ణే కప్పి వేస్తుంది. అలాగే, ఆత్మ నుంచి వ్యక్తమయిన అహంకారము ఆత్మను కప్పివేస్తూ, పూర్తిగా తానే వ్యక్తమవుతుంది.

ఇక్కడ ముఖ్యమైన శక్తులు రెండున్నాయి. 1. ఆవరణశక్తి 2. విక్షేపశక్తి. ఆవరణశక్తి అంటే – ఆవరించి ఉండే శక్తి. విక్షేపము అంటే – కదలిక, అస్థిరము. ఈ రెండు శక్తుల వల్లనే మానవుడు బంధనాలలో చిక్కుకుంటాడు. ఆవరణశక్తి తమోగుణం. విక్షేపశక్తి రజోగుణం. ఈ శక్తులకు లోనైనప్పుడు దేహమే సత్యము, నిత్యము అని నమ్ముతాడు. స్థూలసూక్ష్మ కర్మలు చేస్తాడు. బంధనాలలో చిక్కుకుంటాడు. దీనివల్ల జనన మరణాల చక్రంలోపడి నిరంతరము గమ్యం లేని ప్రయాణం సాగిస్తుంటాడు.

ఐతే ఈ బంధం ఎలా పని చేస్తుంది ? అంటే సంసారమనే వృక్షానికి అజ్ఞానమే – బీజం, తాదాత్మ్యం – మొలక, కోరికలు – చిగుళ్ళు, కర్మలు – నీరు, శరీరమే – మ్రాను, ప్రాణాలు – కొమ్మలు, ఇంద్రియాలు – రెమ్మలు, భోగవిషయాలు – పూలు, కర్మలవల్ల జనించే కష్టసుఖాలే – ఫలాలు. ఈ చెట్టుమీద నివశిస్తున్న పక్షే – జీవుడు. చెట్టుమీద ఒక చోటి నుంచి ఇంకోచోటికి గెంతుతూ ఉంటాడు. కర్మఫలాలు అనుభవిస్తూ ఉంటాడు. ముండకోపనిషత్తులో సంసారమనే వృక్షం మీద రెండు పక్షులు కూర్చొని ఉన్నాయి. అందులో ఒకటి కాయలు, పళ్ళు తింటోంది. రెండవది దిక్కులు చూస్తోంది. పరమాత్మ కర్మచెయ్యడు కాబట్టి. దానికి తినటానికి కర్మ ఫలాలు రావు. అందుకే పరమేశ్వరుడు ఏ ఫలితాన్ని ఆశించడు. అతడు తినటానికి అంటే అనుభవించటానికి ఏవీ లేవు. ఆ పక్షి దిక్కులు చూస్తుంటుంది. అజ్ఞాని అయిన మానవుడే కర్మ చేస్తాడు. అజ్ఞానంవల్ల తనకు తానే కారణంగా ఈ అనాత్మ బంధము ఏర్పడుతుంది. దీని కారణంగానే మానవుడు బంధాలలో కూరుకు పోతున్నాడు. అజ్ఞానం నుంచే ఈ అనాత్మ బంధము ఏర్పడుతుంది. గతంలో చెప్పినట్లుగా దీనికి ఆది అనేది లేదు. అనాదియైనది. దీనివల్లనే మానవుడు జనన మరణాలు, రోగాలు,

రొష్టులు, బాధలు వీటితో కూడిన దుఃఖాన్ని పొందుతున్నాడు. అనాత్మని ఆత్మగా భావించటం వల్లనే అనిత్యము నిత్యమయింది. ఫలితంగా దుఃఖం మొదలైంది. అజ్ఞానానికి కారణం అజ్ఞానమే. దీనికి వేరే కారణం లేదు. వేరే మూలం లేదు. గుహలో ఉన్న చీకటి గుహవల్లనే ఏర్పడింది. అలాగే అజ్ఞానం కూడా. ఈ రకంగానే మానవుడికి బంధనాలు ఏర్పడుతున్నాయి.

ఇప్పుడు మోక్షాన్ని చూద్దాం. అసలు మోక్షము అంటే ఏమిటి? అదే ముక్తి, పరమపదము, సాయుజ్యము, జీవాత్మ పరమాత్మల ఏకీభావము. అసలు ముక్తి అంటే - విముక్తి. లౌకిక బంధనాల నుంచి విముక్తి. నేను నాది అనే అహంకార మమకారాల నుంచి విముక్తి. అరిషడ్వర్గాల నుంచి విముక్తి. తాపత్రయాల నుంచి విముక్తి. ద్వైతభావం నుంచి విముక్తి. ద్వంద్వాల నుంచి విముక్తి. ఈ జగత్తులో ఉన్నది ఒక్కటే. అదే నేను. నేను తప్ప ఈ జగత్తులో ఇంకా ఏదీ లేదు అనే భావన. జీవాత్మ పరమాత్మ రెండూ వేరు కాదు. రెండూ ఒక్కటే. అనే అద్వైత భావన. ఆకాశం నిర్మలమైనది. అది నీలంగా ఉండదు. ఆకాశానికి రంగు లేదు. కాని ఉన్నట్లు కనిపిస్తుంది. అలాగే నిస్సంగము, నిష్క్రియము, నిరాకారము అయిన ఆత్మలో కూడా వస్తుమయ ప్రపంచం లేదు. అది కేవల భ్రమ, ఈ భ్రమ వల్లనే ఆకాశంలో రంగులు కనిపిస్తున్నట్లే పరమాత్మలో ఈ జగత్తు కూడ కనిపిస్తున్నది. ఆత్మ అనేది సాక్షి మాత్రమే. ఆత్మయొక్క జీవత్వమనేది బుద్ధివలన కలిగే మిధ్యాభ్రమ. జీవత్వము అనేది స్వాభావికంగానే మిధ్య. కాబట్టే భ్రమ తొలగిపోగానే ఇది కూడా అంతరిస్తుంది. అజ్ఞానంవల్ల భ్రమ కలుగుతుంది. ఆ భ్రమ వల్ల జీవత్వభ్రాంతి కలుగుతుంది. ఈ భ్రాంతి ఆ భ్రమ ఉన్నంతవరకే ఉంటుంది. ఆ భ్రమ ఉన్నంతవరకే త్రాడు పాముగా, ముత్యపుచిప్ప వెండిపాత్రగా కనిపిస్తుంది. భ్రమ తొలగిపోగానే ఇక్కడ పాము, అక్కడ వెండి పాత్ర రెండూ అదృశ్యమై పోతాయి. అలాగే ఆ భ్రమ ఉన్నంతవరకే జీవత్వ భ్రాంతి కలుగుతుంది.

అవిద్య, అజ్ఞానము అనాదియైనవి. అయినప్పటికీ, మెలకువ రాగానే కల కరిగిపోయినట్లుగా, విద్య ఉదయించగానే అవిద్య పటాపంచలవుతుంది. ఎప్పుడైతే ఈ అవిద్య లేదా మాయ తొలగిపోయిందో, అప్పుడు భగవత్సాక్షాత్కారము కలుగుతుంది. గతంలో మాయని గురించి చెప్పుకున్నాం. మాయ రెండు రకాలు.

1. విద్యామాయ 2. అవిద్యామాయ. విద్యామాయ భగవంతుడి సన్నిధికి తీసుకు పోతుంది. ఇది మళ్ళీ రెండు రకాలు 1. వివేకము 2. వైరాగ్యము. దీన్ని ఆశ్రయించిన వారు భగవంతుని శరణు పొందుతారు. అవిద్యామాయ కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అని ఆరు రకాలు. ఇవి మానవుడి అధఃపతనానికి కారణమవుతాయి. విద్యామాయ ప్రకాశించగానే అవిద్య తొలగిపోతుంది. వెలుతురు ప్రసరించగానే చీకటి పోయినట్లుగా విద్యాప్రకాశము కలుగగానే అవిద్య అదృశ్యమై పోతుంది. దాంతో దృశ్యమానమైన జగత్తు కూడా అంతరిస్తుంది. కాబట్టి అవిద్యకు అంతమున్నది. బుద్ధివలన కలిగే మిథ్యా భ్రమవల్లనే, ఆత్మలో జీవత్వం కనిపిస్తోంది. ఈ జీవభావం కూడా నిజం కాదు. ఆత్మ జీవత్వం కన్న వేరుగా ఉంటుంది. ఆత్మకు, బుద్ధికీ ఉన్న సంబంధం మిథ్యాజ్ఞానం మాత్రమే. సమ్యక్‌జ్ఞానం లభించినప్పుడు సత్యం తెలిసినప్పుడు అవిద్య నాశనమవుతుంది. సమ్యక్‌జ్ఞానము అంటే జీవ బ్రహ్మల ఐక్యత. సమ్యక్‌జ్ఞానం కలగాలంటే ఆత్మానాత్మ వివేకం పూర్తిగా కలగాలి.

అనాత్మ భావన చాలా బలమైనది. అది అస్త్రాల వలన గాని, శస్త్రాల వలన గాని, గాలి, నీరు, నిప్పుల వలన గాని, కర్మలవల్లగాని ఛేదించబడదు. బాగా పదును పెట్టిన జ్ఞానఖడ్గం వల్లనే ఇది ఛేదించబడుతుంది. శృతులందు, స్వధర్మము నందు నిష్ఠ కలిగినవారు, సత్శీలులైన వారు, నియమనిష్ఠలతో కాలం గడిపేవారు సాధువర్తనులు. వీరిఆత్మ నిర్మలంగా ఉంటుంది. నిర్మలమైన అద్దంలో ప్రతిబింబం కనిపించినట్లుగా, నిర్మలమైన ఆత్మలో పరమేశ్వరుడు సాక్షాత్కరిస్తాడు. అటువంటి వారికే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. దీనివల్ల సంసారమనే వృక్షం సమూలంగా నాశనమవుతుంది. కర్మలుచేస్తే ఉపయోగంలేదు అనుకుంటారు. కాని కర్మలు చెయ్యటం వల్ల వాసనాక్షయమవుతుంది. మనస్సులో అశాంతి ఉండదు. నీటిలో పుట్టిన నాచు నీటిని కప్పివేస్తుంది. అలాగే ఆత్మతో నిర్మించబడిన పంచకోశాలు ఆత్మను కప్పివేస్తాయి. నాచును తొలగిస్తే మంచి నీరు లభిస్తుంది. అలాగే పంచకోశాలు ఆత్మ కాదు అని నిశ్చయిస్తే, చైతన్యరూపమయిన పరమసత్యం స్ఫురిస్తుంది. బంధనాల నుంచి విముక్తులు కావాలంటే వివేకంతో వ్యవహరించాలి. ఏది ఆత్మో, ఏది అనాత్మో తెలుసుకోవాలి. అప్పుడు మాత్రమే సచ్చిదానంద

స్వరూపాన్ని గుర్తించగలుగుతాడు. ఈ రకంగా సాధకుడు తనలో ఉన్న ఆత్మే జగత్తంతా నిండి ఉన్నది అని భావించగలుగుతాడు.

మురికినీటిలో ఉన్న మురికిని తొలగిస్తే, ఆ నీరు స్వచ్ఛం అవుతుంది. అలాగే ఆత్మను ఆవరించి ఉన్న దోషాలను నిర్మూలిస్తే, ఆత్మ స్ఫుటంగా ప్రకాశిస్తుంది. అనాత్మ గనక అంతరించినట్లైతే, ఆత్మస్ఫుటంగా కనిపిస్తుంది.

ఈ జగత్తులో ఆత్మ తప్ప వేరే ఏదీ లేదు. చూసేదీ, చూడబడేదీ అన్నీ ఆత్మే. ఈ ఆత్మ తనకు తానే సాక్షి. తనకు తానే తెలియబడుతోంది. అందుకనే ఆత్మే పరబ్రహ్మ. ఇంక రెండవది ఏదీ లేదు. ఆత్మ చరాచర జగత్తంతా ఆవరించి ఉన్నది. అన్నింటికీ అంతర్యామిగా ఉన్నది. కంటికి చూసే శక్తి నిచ్చేది ఆత్మ. చెవికి వినే శక్తినిచ్చేది ఆత్మ. మనసుకు ఆలోచించే శక్తినిచ్చేది ఆత్మ. అన్నింటికీ ఆధారమైనది. అటువంటి ఆత్మను ఇంద్రియాల ద్వారా తెలిసికోవటం జరగదు. ఆత్మ జ్ఞానులకు దగ్గరగా ఉంటుంది. అజ్ఞానులకు దూరంగా ఉంటుంది. అన్నింటియందు అంతర్యామిగా ఉంటుంది. అన్నింటినీ శాసిస్తుంటుంది. కాని కంటికి కనిపిపించదు. చెవికి వినిపించదు. ఆత్మను గురించి ఆత్మద్వారా మాత్రమే తెలుసుకోవాలి. ఈ జగత్తంతా ఆత్మస్వరూపమే అని గుర్తించాలి.

సృష్టికాలంలో, మానవుడిని సృష్టించిన తరువాత, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, నవరంధ్రాలతో కూడిన ఈ దేహములో నేను ప్రవేశించాలి అనుకుంది పరమేశ్వర తత్త్వం. అలా ప్రవేశించటానికి రెండు మార్గాలున్నాయి. 1. పైనుంచి 2. క్రింద నుంచి. అయితే క్రింద నించి ప్రవేశించటం సేవకా లక్షణము కాబట్టి, పైనుంచి బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించింది. అలా ప్రవేశించి, దశేంద్రియాలతోను, నవరంధ్రాలతోను శారీరకమైన, లౌకికమైన సుఖాలు అనుభవిస్తూ, అజ్ఞానం ఆవరించి, వచ్చిన త్రోవ మరచిపోయి పంజరంలో బంధించబడిన పక్షిలాగా, బయటకు వెళ్ళే మార్గం తెలియక కొట్టుమిట్టాడుతోంది. జ్ఞానియైన సాధకుని ప్రాణాలు అంత్యకాలంలో ఉత్క్రమించవు. ఉత్క్రమించటము అంటే నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం గుండా బయటకి పోవటం. మరి ఎలా బయటకి పోతాయి? బ్రహ్మరంధ్రం ద్వారా అతని ప్రాణాలు పోతాయి. అప్పుడు

అతని ఆత్మ ఉత్తరాయణమార్గం గుండా ప్రయాణించి బ్రహ్మలోకం చేరి, కల్పాంతాన కర్మబ్రహ్మతో కలిసి పరమాత్మలో లీనమవుతుంది. గాలిలో గాలిలాగా, నీటిలో నీరులాగా, పాలలో పాలులాగా జీవాత్మ పరమాత్మలో కలుస్తుంది. ఘటాకాశం మహదాకాశంలో లీనమైనట్లుగా జీవాత్మ పరమాత్మలు ఏకీభావం పోందుతాయి. ఇదే మోక్షము.

మోక్షము పొందిన వాడికి పునర్జన్మ అనేది ఉండదు. ఎందుకంటే జీవి ఈ లోకంలో జన్మించాలంటే అతడికి కర్మ శేషం ఉండాలి. ముముక్షువైన వాడు కర్మలు చెయ్యడు. ఎప్పుడైతే ఆత్మ జ్ఞానం కలిగిందో, అప్పుడు అతడి సంచితకర్మ పూర్తిగా నాశనమవుతుంది. ప్రారబ్ధకర్మని ఈ దేహంతో అనుభవించాడు. ఆగామికర్మ చెయ్యడు. కాబట్టి అతడికి కర్మశేషం ఉండదు. ఈ కారణంచేతనే జ్ఞానియైన వాని ఆత్మ పరమాత్మలో లీనమవుతుంది. అతడికి పునర్జన్మ ఉండదు.



# 10. జగత్కారణం మాయ

అనాదియైనది, అంతము గలది, ప్రమాణాలకు, అప్రమాణాలకు సాధారణమైనది, సత్తు కాదు, అసత్తు కాదు, సదసత్తు అంతకన్నా కాదు. స్వయంగా అధికమైనది. నిరూపించటానికి వీలైన లక్షణాలు లేనిది మాయ. వికారాలకు తల్లియై, శాశ్వతమైన భగవదాజ్ఞా రూపమైనది మాయ. ఈ మాయవల్లనే జగత్తులో అనేక పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. మాయ వల్లనే ఈ జగన్నిర్మాణం జరుగుతోంది. త్రికాలజ్ఞానులైన మహర్షులు ధ్యానయోగం ద్వారా జగత్కారణాన్ని అన్వేషించాలని నిశ్చయించి, ఎంతో శ్రమపడి, తమ స్థూల సూక్ష్మశరీరాల చేత ఆవరింపబడి ఉన్నట్టి స్వప్రకాశమైన చిదాత్మ రూపంలో ప్రత్యగ్భిన్నమైన పరబ్రహ్మ యొక్క మాయాశక్తిని జగత్కారణంగా కనుక్కొన్నారు. శ్వేతాశ్వరోపనిషత్తులో చెప్పినట్లుగా ఆ మాయ ఒకచోట ఇచ్ఛాశక్తిగా, ఇంకొక చోట జ్ఞానశక్తిగా, వేరొకచోట క్రియాశక్తిగా ఉంటుంది. ఈ మాయని గురించి యోగవాసిష్టంలో కూడా చెప్పబడింది. అక్కడ వసిష్ఠుడు శ్రీరాముడితో "రామా ! పరమాత్మ మాయాశక్తితో కలిసినప్పుడు. సాకారాన్ని పొందుతాడు. మాయాశక్తి ప్రకటం కానంతవరకు దృశ్యమానమైన జగత్తు కనిపించదు. అవ్యక్తంగా బ్రహ్మలోనే ఉంటుంది. కాబట్టి దేవమానవ తిర్యగాది సమస్త శరీరాల్లోనూ ఆ బ్రహ్మయొక్క చేతనాశక్తే కనిపిస్తుంది. వాయువులో-కదిలే శక్తి, రాయిలో-దృఢత్వం, నీటిలో - ద్రవశక్తి, అగ్నిలో - దాహకశక్తి, ఆకాశంలో-శూన్యము, నాశనమయ్యే వస్తువులలో-నాశనం చేయగలిగే శక్తి, గ్రుడ్డులో - మహాసర్పం దాగి ఉన్నట్లే, ఆత్మలో ఈ నామరూపాత్మకమైన జగత్తు దాగి ఉన్నది. వ్యక్తం కాని స్థితిలో ఉంటుంది. పూలు, ఆకులు, కాయలు, కొమ్మలు, రెమ్మలతో కూడిన మహావృక్షం చిన్నబీజంలో దాగి ఉన్నట్లే, దృశ్యమానమైన చరాచర జగత్తంతా, కనిపించని విధంగా బ్రహ్మలో దాగి ఉంది. ఈ శక్తులు ఉండి కూడా ఎందుకు వ్యక్తం కావు ? అంటే దేశకాలమాన పరిస్థితులను బట్టి ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క శక్తి బయటకు వస్తుంది. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క శక్తి వ్యక్తమవుతుంది. భూమిలో ఉన్న విత్తనాలు దేశకాలాల ననుసరించి, గాలి, నీరు పీల్చుకుని మొలకలెత్తుతాయి. అన్ని శక్తులు ఒకేసారి ఉత్పన్నం కావు. ఓ రామా ! సర్వత్ర గతిశీలమై, సర్వదా ప్రకాశమానమై, దేశకాల పరిచ్ఛేద రహితమైన ఆత్మ మహత్స్వరూపం గలది. అటువంటి ఆత్మ మాయాశక్తిని ధరించినప్పుడు దాన్ని 'మనస్సు' అంటారు. ముందుగా

మననశక్తిని పొందింది కాబట్టి మనస్సు అనబడుతోంది. ఆ తరువాత బంధమోక్షాలకు సంబంధించిన కల్పనలు అన్నీ జరుగుతున్నాయి. 'బంధన' అనే దానిలోనే పర్వతాలు, కొండలు, సముద్రాలు, నదులు, అడవులతో కూడిన ఈ జగత్తంతా చెప్పబడుతోంది. ఇలా జగత్తంతా యదార్థంగా కనిపిస్తుంది. పిల్లలకు కథ చెబుతున్నప్పుడు అందులోని విషయాలు వారికి యదార్థంగా అనిపిస్తాయి. అలాగే అజ్ఞానులకు ఈ జగత్తంతా యదార్థంగా కనిపిస్తుంది. రామా ! ఒక చిన్న కథ చెబుతాను విను. పూర్వ కాలంలో ఒక దేశంలో అసత్యనగరము అనే పేరు గల పట్టణమున్నది. దాన్ని అదృశ్యుడనే రాజు పాలిస్తున్నాడు. అతనికి ముగ్గురు కుమారులు. అందులో ఇద్దరు ఇంకా పుట్టలేదు. ఒకడు తల్లి గర్భంలో ప్రవేశించను కూడా లేదు. ఆ ముగ్గురు రాకుమారులూ మూడు కాలాలతోనూ నిమిత్తం లేకుండా అసత్యనగరంలో తిరుగుతున్నారు. అలా పోతూ పోతూ ఆకాశంలో పండ్లతో నిండి ఉన్న చెట్లను చూశారు. ఆ పండ్లు తింటూ ఆ రాకుమారులు భవిష్యనగరంలో వేటాడుతూ సుఖంగా ఉన్నారు" రామా! ఈ కథను వింటున్న రాకుమారులు అమాయకంగా దాన్ని నిజమని నమ్ముతున్నారు. ఈ కథలో పిల్లలు లాగానే, ఈ జగత్తు సత్యము అని అజ్ఞానులు భావిస్తారు. అంటూ వసిష్ట మహర్షి మాయాశక్తిని గురించి రాముడికి వివరించాడు.

మాయాశక్తి అనేది జగత్తుకన్న, బ్రహ్మకన్న భిన్నమైనది. దాన్ని నిరూపించటం చాలా కష్టం. విస్ఫోటాన్ని బట్టి, నిప్పు కణాలను బట్టి, అగ్నియొక్క శక్తి మనకు తెలుస్తుంది. అంటే కార్య కారణాల ద్వారా తెలుస్తుందన్న మాట. కాని మాయాశక్తి కార్యకారణాలు రెండింటికీ విలక్షణమైనది.

ఇక్కడ ఒక చిన్న ఉదాహరణని చూద్దాం. ఒక కుండ. ఇది పొట్టిగా, లావుగా, పెద్ద పొట్ట, మూతి కలిగి ఉంటుంది. తన్మాత్రలతో కూడిన మట్టి దీనికి ఆశ్రయం. కాని ఘటంలోని శక్తి, ఘటంకన్న, మృత్తిక కన్న వేరైనది. ఘటంలో పృథివి మొదలైన పంచభూతాలకు ఉండే కార్యగుణాలు ఉండవు. తన్మాత్రల రూపంలో ఆశ్రయానికి ఉండే ధర్మాలు ఉండవు. అందుకే ఈ ఘటము విలక్షణమైనది. అచింత్యము, అనిర్వచనీయమైనది. ఈ శక్తి కుండ తయారవక ముందు మట్టిలో దాగి ఉంది. అలా దాగి ఉన్న ఆ శక్తి కులాలుడు, దండం, సారె మొదలైన వాటి సాయంతో కుండగా మారుతోంది. కుమ్మరివాడు తయారుచెయ్యక మందు ఇది కుండ కాదు వట్టి మట్టి. అతను తయారుచేసిన తరువాత కుండ అయింది. అయితే ఘటమనేది

మృత్తికకన్న వేరైనది కాదు. ముందు మట్టి రూపంలో అవ్యక్తంగా ఉండి, శక్తి అని పిలువబడుతుంది. వ్యక్తం కాగానే అది ఘటము అవుతుంది. అలాగే గారడీ వాడి దగ్గర మాయ కూడా, మంత్ర ప్రయోగానికి ముందు అవ్యక్తంగా ఉంటుంది. తరువాత గంధర్వ నగరాల రూపంలో వ్యక్తమవుతుంది. ఇదే విధంగా మాయ కూడా ముందు అవ్యక్తంగా ఉండి తరువాత వ్యక్తమవుతుంది. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే శక్తికి కార్యమైన ఘటం అనిత్యం. శక్తికి ఆధారమైన మృత్తిక నిత్యం. నోటితో ఉచ్చరించటానికి, పేరు చెప్పటానికి వీలయిన ఘటము కేవలము వికారము. అందుకే ఇది అసత్యం. ఆ వికారానికి కారణమైన మృత్తిక మాత్రం సత్యం. కంటికి కనిపించేది అంటే వ్యక్తము ఘటము, అవ్యక్తము మాయాశక్తి. ఈ రెండింటికీ అంటే వ్యక్తావ్యక్తాలకు ఆధారం మృత్తిక. వ్యక్తము, అవ్యక్తము, ఆధారము అనే ఈ మూడింటిలోను, మొదటి రెండు వ్యక్తము, అవ్యక్తము కాలభేదం వల్ల ఒకసారి కార్యము, ఒకసారి శక్తి అంటే ఒకప్పుడు వ్యక్తమైతే ఇంకొకప్పుడు అవ్యక్తము అవుతాయి. అందుచేతనే వీటిని మిధ్య అంటారు. ఈ రెండూ అంటే కార్యము, శక్తి అనేవి అతీత వర్తమాన కాలాలకు చెందినవిగా ఉంటాయి. ఈ రెండింటికీ ఆధారమైన మూడవ పదార్థం మృత్తిక మూడు కాలాలందు స్థిరంగా ఉంటుంది. అందుకే దాన్ని సత్యము అంటారు.

వికారము అనేది మిధ్య. వ్యక్తమయ్యే ఘటము స్వరూపరీత్యా మిధ్య. అయినా కంటికి కనిపిస్తుంది. దీనికి ఉత్పత్తి నాశనము ఉన్నాయి. ఇలా వికారము మిధ్య అనటానికి మూడు లక్షణాలు ఉన్నాయి. 1. వ్యక్త పదార్థాలు స్వరూపరీత్యా మిధ్య అయినప్పటికీ భాసమానమవటం 2. ఉత్పత్తి, నాశనము కలిగి ఉండటము. 3. ఉత్పత్తి అయిన తరువాత ఇంకొక పేరుతో పిలువబడటము. ఒకవేళ కంటికి కనిపించే ఈ ఆకారం (కుండ) నాశనమై పోయినప్పటికీ దాని పేరు మాత్రం వాక్కు రూపంలో మిగిలే ఉంటుంది. అప్పుడు ఆ వస్తువు పేరుతో మాత్రమే నిరూపించదగినదిగా ఉంటుంది. అంటే నామాత్మకంగా ఉంటుంది. కుండ కనిపించకుండా పోయినా, దాని పేరు మాత్రం మిగిలే ఉంటుంది. ఇలా వ్యక్తవస్తువులు అంటే కంటికి కనిపించే వస్తువులు 1. భాసించటం 2. నాశనము కావటము 3. పేరుతో మిగిలి ఉండటము అనేవి ఆ వస్తువు మిధ్య అనటానికి లక్షణాలు.

కంటికి కనిపించే ఆకారం-కుండ. ఇది గుండ్రంగా, లావుగా, పొట్టిగా ఉంటుంది. ఆకారం ఉన్నది. దీనికి నాశన స్వభావం ఉంది. ఈ కారణంచేతనే

మృత్తికలాగా ఇది సత్యంకాదు. కేవలం నామమాత్రంగా మిగిలేది. కుండగా ఉన్నప్పుడు గాని, అది తయారుకాక ముందు గాని, నాశనమయిన తరువాత గాని దాని యథార్థస్వరూపము మట్టే. దానికి వికారము, నాశనము లేవు. అందుకే మృత్తిక అంటే మట్టి సత్యము, పారమార్థికము. ఇది త్రికాలలోను ఉంటుంది కాబట్టి ఆత్మలాగా సత్యమైనది. ఇక్కడ చిన్నఅనుమానం వస్తుంది. వ్యక్తమైన ఘటము వికారము. అందుకే అది మిథ్య. దీనికి కారణం మట్టి అని తెలియగానే, ఆ అర్థం ఎందుకు నివృత్తి కావటం లేదు ? ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే? నివృత్తి కావలసినది ఘటకార్యం సత్యమనేబుద్ధి. అంతే తప్ప ఘటం కనిపించకుండా పోవటం కాదు. ఇదంతా భ్రమవల్ల జరుగుతుంది. రజ్జుసర్ప భ్రాంతి, శుక్తికారజిత భ్రాంతి కూడా ఇలాంటివే. అసలు భ్రమ, భ్రాంతి అంటే ఏమిటి ? భ్రాంతి అంటే తప్పుడుఅభిప్రాయము, పొరపాటుపడటము. భ్రమ అంటే భిన్నంగా గ్రహించటము. మిథ్య అంటే - అసత్యము, మోసము, తప్పు. మాయ అంటే - దంభము, వంచన, మోసము, గారడీవిద్య, అసత్యము కపటోపాయము, అవిద్య అని అర్థం.

భ్రమ అంటే వస్తువు రూపాన్ని, లక్షణాన్ని యథార్థంకన్న వేరుగా గ్రహించటం. భ్రమ రెండు రకాలుగా ఉంటుంది. 1. సంవాది భ్రమ 2. అసంవాది భ్రమ. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ చూడండి. ఒక భవనంలో రెండు గదులలోంచి గొప్ప కాంతి కిరణాలు విడివిడిగా ప్రసరిస్తున్నాయి. అవి మణిప్రభలలా ఉన్నాయి. వాటిని ఇద్దరు వ్యక్తులు చూశారు. ఆ గదులలో మణులుఉన్నాయి అనిభావించి, వాటికోసం పరుగులుతీశారు. అంటే ఇద్దరూ అవి మణులుఅనిభ్రమించి వాటికోసం పరుగెత్తారు. అందులో ఒకడికి నిజంగానే ఆగదిలో మణిదొరికింది. అతడిది సంవాది భ్రమ. రెండో వాడు వెళ్ళిన గదిలో మణిలేదు దీపంమాత్రమే ఉంది. అతడిది అసంవాది భ్రమ. అంటే మణిని మణిగా భావించటం సంవాది భ్రమ. దీపాన్ని మణిగా భావించటం అసంవాది భ్రమ. సంవాది భ్రమ మళ్ళీ మూడు రకాలుగా ఉంటుంది.

1. ప్రత్యక్ష సంవాది భ్రమ - ఇందాక ఉదాహరణలో మణిని చూసి మణి అని భావించటం.

2. అనుమాన సంవాది భ్రమ - ఒకచోట నీటి ఆవిరి వస్తోంది. దాన్ని చూసి పొగ అని అక్కడ నిప్పు ఉంటుంది అని భావించి, అక్కడికి వెళ్ళిన వాడికి విధి వశాత్తు అక్కడ అగ్ని లభించింది. ఇది అనుమాన సంవాది భ్రమ.

3. ఆగమ సంవాది భ్రమ – చేసిన పాపాలు పోవటానికి గంగాజలంలో స్నానం చెయ్యాలి అనుకున్నాడు. కాని గోదావరి జలాన్ని గంగాజలం అనుకుని స్నానం చేశాడు. అయితే గంగకున్న పవిత్రత గోదావరికి కూడా ఉంది కాబట్టి అతనికి పాపప్రక్షాళనం జరిగింది. ఇది ఆగమ సంవాది భ్రమ.

అజామిళుడు, శశిపాలుడు లాంటివారు శ్రీమన్నారాయణుని కుమారునిగా, శత్రువుగా భావించి, ఆయన్నే స్మరిస్తూ ప్రాణాలు వదిలి స్వర్గం చేరారు. ఇది కూడా ఆగమ సంవాది భ్రమే. ఏది ఏమైనా భ్రమ అనేది మిధ్యాజ్ఞానం. కాబట్టి పనికి రాదు.

భ్రమ అనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. నిరుపాధిక భ్రమ 2. సోపాధిక భ్రమ. కేవలం జ్ఞానం ఉత్పన్నమయ్యే భ్రమను నిరుపాధికభ్రమ అంటారు. దర్పణంలోని ప్రతిబింబానికి సంబంధించిన భ్రమ, అజ్ఞానంవల్ల కలిగే భ్రమ కాబట్టి దీన్ని సోపాధిక భ్రమ అంటారు. నిరుపాధిక భ్రమలో అధిష్ఠానానికి సంబంధించిన జ్ఞానంవల్ల కార్యంతో పాటు అజ్ఞానం కూడా నశిస్తుంది. జ్ఞానం కలగటంతోనే కల్పితరూపం ఉండకపోవటమనేది నిరుపాధికభ్రమ లక్షణం. కాని సోపాధిక భ్రమలో, ఆవరణ సహితంగా అజ్ఞానావరణము నశిస్తుంది. అజ్ఞానము నశిస్తుంది. కాని అజ్ఞానానికి ఉపాధి రూపమైన ప్రతిబంధ కారణంగా విక్షేపరూపమయిన కార్యంతో పాటు స్వరూపం యొక్క అభావం జరగదు. కాబట్టి అధిష్ఠానం మిగలకపోవటం, ఆరోపిత స్వరూపం ఉండకపోవటం జ్ఞానానికి లక్షణం కాదు. మిధ్యాత్వ నిశ్చయ రూపమైన జ్ఞానమే దాని లక్షణం.

నీటిలో తలక్రిందులుగా కనిపించే వ్యక్తి ఎక్కడా ఉండడు. ఒడ్డున ఉన్నవాడు జ్ఞాని కాని, అజ్ఞాని కాని, అది నీడ మాత్రమే అని తెలుసుకుంటాడు. అంతే గాని అది నిజమని నమ్మడు. అలాగే ఆత్మజ్ఞానం కలిగిన తరువాత, జ్ఞాని ఈ జగత్తు మిధ్య అని భావించినా, జగత్తు యొక్క ప్రతీతి మాత్రం జరుగుతూనే ఉంటుంది. అయితే ఈ ప్రతీతి ఇంద్రియాల వల్ల కలిగిన భ్రాంతి అని తెలుసుకుని పట్టించుకోడు. జగత్తు సత్యము అని భావించే వాడు చేసే ఏ పనీ జ్ఞాని చెయ్యడు. అద్వైతుల దృష్టిలో ఆత్మ తప్ప మిగిలినవన్నీ మిధ్య. ఆత్మ తప్ప సమస్తము మిధ్య అని తెలుసు కోవటమే పురుషార్థము. ఇంతవరకు ఘటమనేది మృత్తిక యొక్క వివర్తము అని తెలియకపోవటం వల్ల, ఘటము సత్యము అనుకున్నాడు. ఎప్పుడైతే ఘటము మృత్తిక

యొక్క వివర్తమని తెలిసిందో అప్పుడు ఘటము శాశ్వతము కాదు సత్యం కాదు అని తెలుసుకుంటాడు. వివర్తము అంటే వస్తువు తన పూర్వ అవస్థను వదలకుండా వేరొక అవస్థకు సంబంధించిన ప్రతీతి కలిగి ఉండటము. రజ్జుసర్పభ్రాంతి ఇలాంటిదే. పాలు పేరుగుగామారటం పరిణామవాదం. పాలు తన రూపాన్ని వదిలి ఇంకొక రూపం ధరిస్తున్నాయి. కాని కుండ, బంగారుఆభరణాలు వీటిలో మట్టి, బంగారము మార్పు లేకుండానే ఉంటాయి. ఘటము అనేది మృత్తిక యొక్క వివర్తనము. అది పరిణామం కాదు.

ఈ రకంగా చూసినట్లైతే ఈ జగత్తంతా మాయ. అంటే ఇదంతా అసత్యము, గారడీ విద్య లాంటిది. మన అజ్ఞానంవల్లనే జగత్తు దృశ్యమానంగా కనిపిస్తోంది. నృసింహతాపినీ ఉపనిషత్తులో జగత్తుకు ఉపాదాన కారణమైన మాయ తమోరూపము గలది. అజ్ఞానరూపం గలది అని చెబుతారు. దీనికి అనుభవాన్నే ప్రమాణంగా స్వీకరించారు. **'తదే తజ్జడం మోహాత్మకమ్'** అంటోంది వేదం. దీన్ని బట్టి మాయ అనేది జడం. ఆవరణ రూపం కలది. మాయ అనంతమైనది. చిద్రూపం కాని ఘటాదుల యొక్క స్వరూపం జడం. అటువంటి ఏ జడమందు ప్రవేశించి బుద్ధి మూఢమై పోతుందో – దాన్ని లౌకికులు 'మోహము' అంటారు. ఈ విధంగా జడము మోహము అయిన మాయయొక్క అనుభవం అందరికీ తెలుసు. అయితే మాయను సత్తు అని గాని అసత్తు అని గాని చెప్పలేము. అది అనిర్వచనీయము. మాయ అందరికీ ప్రతీతమవుతుంది. కాబట్టి అసత్తు కాదు. ఆత్మతప్ప మిగిలినవన్నీ నిషేధింపబడుతున్నాయి కాబట్టి మాయ సత్తుకాదు. రెండూ కలసిన ఉభయ రూపం అనటానికి లేదు. ఎందుకంటే చీకటి, వెలుతురు రెండూ కలిసి ఒకేచోట ఉండవు. జ్ఞానం కలగగానే ఈ మాయ పటాపంచలై పోతుంది. మాయ 1. శ్రుతిజన్యము 2. యుక్తిజన్యము 3. లౌకికజన్యము అయిన అనుభవాలవల్ల తెలుస్తుంది. శ్రుతిజ్ఞానంవల్ల – తుచ్ఛమని, యుక్తివల్ల – అనిర్వచనీయమని, లౌకికానుభవం వల్ల – వాస్తవికమని తెలుస్తుంది. అంటే శ్రుతిజన్యజ్ఞానం వల్ల – అసద్రూపమని, యుక్తిజన్యజ్ఞానం వల్ల – అనిర్వచనీయమని, లౌకికజ్ఞానం వల్ల – సద్రూపమని తెలుస్తుంది. చిత్రపటం (ప్లెక్సీ బ్యానరు)లో లాగా మాయలో సత్, అసత్ రూపాలు రెండూ కనిపిస్తాయి. మన దగ్గర పెద్దచిత్రపటం ఉంది. దాన్ని పూర్తిగా తెరిస్తే,

అందులో ఉన్న బొమ్మలన్నీ కనిపిస్తాయి. చుట్టేస్తే మాయమై పోతాయి. అలాగే మాయ కూడా ఒకసారి సత్తుగా, ఒకసారి అసత్తుగా ఉంటుంది. చిద్రూపమైన ప్రకాశంలేనిదే మాయవ్యక్తం కాదు. కాబట్టి మాయ అస్వతంత్రమైనది. అలాగే చిద్రూపమైన ఆత్మను సంగదోషంవల్ల వికారిగా చేస్తుంది. కాబట్టి సర్వస్వతంత్రమైనది. అంతేకాదు జీవ, ఈశ్వర విభాగంకూడా ఈమాయవల్లనే జరుగుతోంది. ఈ మాయ కూటస్థము (చలనము లేనిది) అయిన ఆత్మను ప్రపంచమయం చేస్తోంది. నృసింహ ఉత్తరతాపినీ ఉపనిషత్తులో "మాయ అనేది చిదాభాస రూపంతో జీవుడు, ఈశ్వరుడు అనే విభాగం చేస్తోంది. రెండూ వేరు వేరని చూపుతోంది. శుద్ధ సత్త్వప్రధానమైన మాయలో అభావరూపుడైన ఈశ్వరుణ్ణి, మలిన సత్త్వప్రధానమైన అవిద్యలో జీవాత్మను నిర్మిస్తోంది. ఈ రకంగా జీవ ఈశ్వర విభాగము మాయవల్లనే జరుగుతోంది." అని చెప్పబడింది. కూటస్థస్వరూపానికి హానికలగకుండానే జగన్నిర్మాణం చేస్తోంది. ఎటువంటి కష్టమైన పనైనా, అసాధ్యమైన పనైనా చేసేసామర్థ్యం మాయకు ఉన్నది. ఆ శక్తి మాయకు ఎలా వచ్చింది ? అంటే జలానికి ద్రవ్యత్వం, అగ్నికి వేడిలాగా అసాధ్యమైనపనులు చేయగలగటం మాయకు స్వాభావికము.

ఈ విధంగా మాయ అసాధ్యమైన పనులు చేస్తూ, ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లుగా భ్రమింపచేస్తుంది. దృశ్యమానమైన ఈ జగత్తంతా మాయచే సృష్టించబడిందే. మాయ రెండు రకాలుగా ఉంటుంది. 1. విద్యామాయ 2. అవిద్యామాయ. విద్యామాయ భగవంతుని సన్నిధికి తీసుకుపోతుంది. అది వివేకము, వైరాగ్యము అని రెండు రకాలు. అవిద్యామాయ ఆరురకాలుగా అరిషడ్వర్గాల రూపంలో కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలుగా ఉంటుంది. దీనివల్ల మానవుడు సంసారంలో బందీఅవుతాడు. విద్యామాయ నాశ్రయించినవాడు పరమేశ్వరుని సన్నిధికి పోతాడు.

విద్యామాయ వ్యక్తంకాగానే అవిద్యామాయ తొలగిపోతుంది. మాయని గురించిన జ్ఞానం కలగటంతోనే మానవుడికి మాయని గురించిన ఆశ్చర్యం నివృత్తి అవుతుంది. మాయ అనేతెర తొలగిపోయే వరకు పరమేశ్వర సాక్షాత్కారం జరగదు.



## 11. అజ్ఞానం

అనాదిగా మానవుడు అజ్ఞానంలో పడికొట్టు మిట్టాడుతున్నాడు. ఈ అజ్ఞానం వల్ల సంసారమనే సాగరంలో పడి మునుగుతూ, తేలుతూ కుడితి తొట్టిలో పడ్డ ఎలుకలాగా, అందులో నుంచి బయటకు రాలేక సతమతమవుతున్నాడు. ఈ విషయం అందరికీ తెలిసిందే. అయితే అసలు అజ్ఞానము అంటే ఏమిటి ? అజ్ఞానము అంటే తెలివి లేకపోవటం, బుద్ధి లేనితనం, ఎరుక లేకపోవటం, అవిద్య, మాయ, జ్ఞానం లేకపోవటం. మానవుడు తను చూస్తున్న విషయాలలో, వస్తువులలో ఏది సత్యమైనదో తెలుసుకోలేకపోవటం. ఈ జగత్తులో సత్యము, నిత్యము, శాశ్వతమైన దేదో తెలుసుకోలేక పోవటమే అజ్ఞానము. దృశ్యమానమైన జగత్తులో, కంటికి కనిపించేదంతా శాశ్వతం కాదు. దృశ్యమానమైనదంతా నశించేదే. రూపం కలిగినది, నామం కలిగినది అంతా నశించేదే. ఈ విషయం తెలుసుకోలేక ఈ జగత్తు శాశ్వతము అనుకుంటున్నాడు. తన ముత్తాతలు, తాతలు, తండ్రులు అందరూ గతించారు. నేడో, రేపో, తానుకూడా మరణిస్తాడు. అయినప్పటికీ అది నిజమని నమ్మడు. అనేకమంది రాజులు, చక్రవర్తులు ఈ ధరామండలాన్ని పాలించారు. వారంతా గతించారు. వారిలో ఏ ఒక్కరూ లేరు. అయినా తన జీవితం మీద అత్యంతమైన ప్రేమ. రాజులు పోయారు, రాజ్యాలు పోయాయి. వారు కట్టిన భవనాలన్నీ కుప్ప కూలిపోయినాయి. అయినా సిరిసంపదల మీద ఆశ. ఈ దేహము అశాశ్వతమైనది. మహా అయితే వంద సంవత్సరాలుంటుంది. ఆ తరువాత మట్టిలో కలిసిపోతుంది. తనకు ఆ విషయం తెలుసు. అయినా దేహంమీద మమకారం "నేను అంటే దేహమే" అనే భ్రాంతి. ఇదే అజ్ఞానము, అవిద్య, మాయ. దీనికి కారణం మానవుడు తనను తాను తెలుసుకోలేకపోవటం.

గాలి బుడగలాంటిది జీవితం. ఇది క్షణభంగురం. ఇక యవ్వనం సంగతి చెప్పనే అవసరం లేదు. అటువంటి ఈ దేహాన్ని, మలమూత్రాలు, రక్తమాంసాలు, ఎముకలు, నరాలు మొదలైన అసహ్యకరమైన పదార్థాలతో కూడిన ఈ దేహాన్ని చూసి చాలా అందమైనదిగా భావన చేస్తాడు. కడుజాగ్రత్తగా దాన్ని పోషిస్తాడు. అజ్ఞానము అనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. అగ్రహణం 2. అన్యథాగ్రహణం. ఏదైనా వస్తువును చూసినప్పుడు దానియొక్క స్థితిని సరిగా గ్రహించలేకపోవటాన్నే

'అగ్రహణము' అంటారు. త్రాడును త్రాడుగా గుర్తించకపోవటం. ఆ వస్తువును ఇంకొకటిగా భావించటాన్నే అన్యథా గ్రహణము అంటారు. త్రాడును చూసి పాము అనుకోవటం. ఒక త్రాడు నేలమీద పడుతుంది. మసకచీకట్లో ఆ త్రాడును చూసి పాము అనుకున్నాడు. భయంతో కేకలు వేశాడు. ఇక్కడ త్రాడును త్రాడు అని గుర్తించకపోవటం అగ్రహణం. అది పాము అని భ్రమపడటం అన్యథా గ్రహణం. ఇలా భావన చేసేటప్పుడు అది తనకు హాని చేస్తుందనో, దానివల్ల తనకు లాభం ఉంటుందనో అనుకుంటాడు. మసకచీకట్లో త్రాడును చూసి పాము అనుకుని భయపడతాడు. అంతేకాని పామును చూసి త్రాడు అనుకోడు. అలాగే సముద్రం మీద తేలియాడుతున్న ముత్యపు చిప్పను చూసి వెండిపాత్ర అని, స్థాణువును చూసి దొంగవాడని భ్రమ చెందుతాడు. ఈ విధంగా సత్యాన్ని గ్రహించలేకపోవటమే అజ్ఞానం. ఈ అజ్ఞానము లేదా అవిద్య అనేది నిన్ననో, మొన్ననో వచ్చింది కాదు. అనాదిగా ఉన్నది. అందుకే ఈ అజ్ఞానము అనేది అనాదియైనది అంటున్నాం. దీనివల్లనే మానవుడు సంసారమనే సాగరంలో పడి మునుగుతూ తేలుతూ సతమత మవుతున్నాడు. అశాశ్వతమైన ఈ దేహమే శాశ్వతము అనుకుంటున్నాడు. ఆ దేహాన్ని సుఖపెట్టటానికి అనేక కర్మలు చేస్తున్నాడు. తత్ఫలితంగా అనేక జన్మలు ఎత్తుతూ గానుగకు కట్టిన ఎద్దులాగా సంసార సాగరంలో పడి కొట్టుమిట్టాడుతున్నాడు. ఈ ఊబిలో నుంచి బయటపడాలని అందరికీ ఉంటుంది. కాని పట్టుదల కొద్దిమందికే ఉంటుంది. అటువంటి వారు ముందుగా సద్గురువును ఆశ్రయించాలి.

**అజ్ఞాన తిమిరాంధస్య । జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షురున్మీలితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

అజ్ఞానము అనే కారుచీకటిని పారద్రోలి, జ్ఞానజ్యోతులను వెలిగించే గురువుకు నమస్కారము.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం, గగనసదృశం, తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥

బ్రహ్మానందమే స్వరూపంగా గలవాడు, శ్రేష్ఠమైన సుఖాన్ని ఇచ్చేవాడు, జ్ఞాన స్వరూపుడు, ద్వంద్వాలకు అతీతుడు, ఆకాశ సమానుడు, తత్త్వమసి మొదలైన మహావాక్యాలను వివరించి అద్వైతాన్ని బోధించేవాడు, అన్నింటికీ సాక్షియైనవాడు, గుణాతీతుడు అయిన గురువుకు నమస్కారము.

గురువు యొక్క మహాత్మ్యాన్ని 275 శ్లోకాలు గల 'గురుగీత'లో వివరించటం జరిగింది. అటువంటి సద్గురువును ఆశ్రయించాలి. అలాంటి గురువు ఎలా దొరుకుతాడు? లోకంలో కనిపించేవారందరూ గురువులే. వీరందరూ మనకు ఏదో ఒక సందేశాన్ని ఇస్తూనే ఉంటారు. వాటిని జాగ్రత్తగా గ్రహించాలి. దత్త చరిత్రలో దత్తాత్రేయుడు తనకు 24 మంది గురువులున్నారు అని చెబుతాడు. మన కర్మ పరిపక్వమైన తరువాత, అసలైన గురువే మనకోసం ఎదురు చూస్తుంటాడు. శంకర భగవత్పాదులకు గోవిందపాదాచార్యునిలాగా. అంతవరకు మిగిలిన వారి దగ్గర సందేశాలు తీసుకుంటూ ముందుకు వెడుతుండాలి.

చతుర్విధ పురుషార్థాలలో ఆఖరుదైన **'మోక్షమే'** అసలైన పురుషార్థం. ఆ మోక్షసాధనకే మిగిలిన ధర్మార్థ కామాలు ఉపకరించాలి. మోక్షము అంటే ముక్తి. లౌకిక బంధనాల నుంచి విముక్తి. మమ అంటే బంధము నమమ అంటే మోక్షం. 'అజ్ఞానం'లో 'అ' అనే అక్షరాన్ని చెరిపేస్తే, మిగిలినదేది? జ్ఞానమే, ఎప్పుడైతే 'మమ' అనే పదానికి 'న' అనే అక్షరం ముందు చేర్చావో, అప్పుడు అజ్ఞానంలో 'అ' అనే అక్షరం మాయమై పోతుంది. మిగిలేది జ్ఞానము, పొందేది మోక్షం. సాధకుడు సద్గురువును ఆశ్రయించి, ఈ చరాచర జగత్తులో పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశము, నేను కాదు, ఈ దేహము, నేను కాదు. నేను చిద్రూపమైన సాక్షి చైతన్యాన్ని. బ్రహ్మక్షత్రియాది వర్ణాలు నాకు లేవు. ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలు ఏవీ నాకు లేవు. సర్వానికీ నేనే ఏకైక సాక్షిని. నాకు కర్తృత్వము లేదు. భోక్తృత్వము లేదు. ఈ జగత్తులో నేను తప్ప ఇంకెవరూ లేరు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని ఈ రకంగా త్రికరణ శుద్ధిగా భావన చెయ్యాలి.

**ముక్తాభిమానీ ముక్తోహి బద్ధోబద్ధాభిమాన్యపి ।**

తనను ముక్తునిగా భావించేవాడు ముక్తుడే అవుతాడు. బద్ధుడుగా భావించేవాడు బద్ధుడవుతాడు. **'యద్భావంతద్భవతి'** కైవల్యోపనిషత్తులో చెప్పినట్లుగాః

**అపాణిపాదోహ మచిన్త్యశక్తిః । పశ్యామ్యచక్షుః సశృణో మ్యకర్ణః ।**

**అహం విజానామి వివిక్తరూపో । నచాస్తి వేత్తా మమ చిత్సదాహమ్ ॥**

ఆ పరమేశ్వర స్వరూపానికి కాళ్ళు చేతులు మొదలైన అవయవాలు ఏవీలేవు. కాని కళ్ళు లేకుండానే చూస్తుంది. చెవులు లేకుండానే వింటుంది. అవయవాలు లేకుండానే ఆయా పనులు చేస్తుంది. ఆ పరమేశ్వరుడికి అన్నీ తెలుసు. అందరూ తెలుసు. కాని ఆయనను తెలుసుకున్న వారెవరూ లేరు. నిత్యశుద్ధ బుద్ధ జ్ఞాన స్వరూపమే ఆ పరమేశ్వరుడు.

**న భూమిరాపో న చ వహ్నిరస్తి న చానిలోమేస్తి నచాంబరంచ**

**ఏవం విదిత్వా పరమాత్మరూపం గుహాశయం నిష్కలమద్వితీయం ।**

**సమస్త సాక్షిం సదసద్విహీనం ప్రయాతి శుద్ధం పరమాత్మ రూపమ్ ॥**

పృథివి మొదలైన పంచభూతాలు నేను కాను. నేను సర్వసాక్షియైన చిన్మాత్రను అని భావన చేసినవాడికి పునర్జన్మ ఉండదు.



# 12. ఆత్మానాత్మ వివేకము

నిత్యము సత్యమైనది ఆత్మ. ఆది మధ్యాంతములు లేనిది ఆత్మ. సృష్టికి ఆధారమైనది ఆత్మ. సృష్టికి మూలకారణమైనది ఆత్మ. సత్‌చిత్ ఆనందమయమైనది ఆత్మ. సృష్టి ప్రారంభానికి ముందు, ప్రళయం తరువాత కూడా ఉండేది ఆత్మ. వికారాలు లేనిది ఆత్మ. అందరిలోను, అన్నింటిలోనూ అంతర్లీనంగా ఉండేది ఆత్మ. స్వయంప్రకాశమైన చైతన్యరూపమే ఆత్మ. అదే పరబ్రహ్మస్వరూపం. ఈ జగత్తులోఉన్నదంతా పరమేశ్వర స్వరూపమే. మరి అనాత్మ అంటే ఆత్మ కానిదంతా అనాత్మే. అనిత్యమైనది. అసత్యమైనది. ఆది మధ్య అంతము గలది, వికారాలు గలది, జడమైనది, అనాత్మ. ఈజగత్తులో శరీరము, ఇంద్రియాలు, మనస్సు, ప్రాణాలు, భోగ్యవస్తువులు, సమస్త భోగాలు, పృథివ్యాది పంచభూతాలు, తన్మాత్రలు అన్నీ అనాత్మే. దృశ్యమానమైన జగత్తంతా అనాత్మే. పధ్నాలుగు లోకాలు, అడవులు, ఎడారులు, కొండలు, బండలు, నదులు, సముద్రాలు, రాజ్యాలు, నగరాలు, పట్టణాలు, రాజులు అంతా అనాత్మే. స్తంభం నుంచి మహత్తత్వముదాకా అంతా అనాత్మే. మాయ కూడా అనాత్మ వస్తువే. ఆత్మ తప్ప మిగిలినదంతా అనాత్మే.

అజ్ఞానము లేదా అవిద్య వల్ల ఆత్మ అనాత్మగాను, అనాత్మ ఆత్మగాను కనిపిస్తుంది. బ్రహ్మ సత్యం జగన్మిధ్య. ఈ జగత్తులో సత్యము నిత్యము శాశ్వతమైనది. పరబ్రహ్మ ఒక్కటే. మిగిలిన జగత్తంతా మిథ్య. దృశ్యమానమైన జగత్తంతా మిథ్య. ఈ విషయం అందరికీ తెలుసు. లోకంలో పుట్టిన ప్రతిజీవి మరణిస్తుంది. ప్రతి జీవికి షడ్విధవికారాలున్నాయి. పుట్టుక, నాశనము అనేవి ప్రకృతి ధర్మాలు. రాజులు, రాజ్యాలు, అడవులు, కొండలు, ఎడారులు ఏవీ శాశ్వతంకాదు. నీ ముత్తాతలు, తాతలు, తండ్రులు అందరూ మరణించారు. రేపు నువ్వుకూడా అంతే. కట్టిన కట్టడాలన్నీ కూలిపోయినాయి. దేశాలు, రాజ్యాలు నాశనమయి పోయినాయి. కాబట్టి లోకంలో శాశ్వతమైనది ఏదీలేదు. ఎవరూ లేరు. మన కోరికలు తీరటానికి దేవతలను పూజిస్తుంటాము. ఆ దేవతలు కూడా శాశ్వతం కాదు. హిరణ్యకశ్యపుడు మొదలైన రాక్షసులు తమకు మృత్యువు లేకుండా వరంకావాలి అని బ్రహ్మనడిగారు. అది మాత్రం తనవల్ల కాదన్నాడు బ్రహ్మ. ఎందుచేత? ఇక్కడ బ్రహ్మకూడా శాశ్వతం కాదు. బ్రహ్మకల్పం పూర్తవగానే, ఆయున కూడా వెళ్ళిపోతాడు. ఇక్కడ బ్రహ్మ అంటే

– కర్మ బ్రహ్మ, చతుర్ముఖుడు. త్రిమూర్తులలో ఒకడు. కాబట్టి సృష్టికర్త అయిన బ్రహ్మ కూడా శాశ్వతం కాదు. పంచభూతాలు శాశ్వతం కాదు. ప్రళయ కాలంలో భూమి – జలంలో, జలం – అగ్నిలో, అగ్ని – వాయువులో, వాయువు – ఆకాశంలో, ఆకాశం – మాయలో లీనమైపోతాయి. సృష్టిలో మొదటగా వచ్చింది అవ్యక్తము. పరమేశ్వర స్వరూపం నుంచి మొదటగా బయటకు వచ్చింది సత్త్వగుణం. అదే అవ్యక్తము, మాయ. ఈమాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. చరాచర జగత్తుకు కారణం మాయ. అయితే ఈ మాయకూడా శాశ్వతం కాదు. ఇదంతా మాయ అని తెలియగానే మాయ పటాపంచలై పోతుంది. జ్ఞానం రాగానే మాయ నాశనమై పోతుంది. ఈ సృష్టిలో శాశ్వతంగా ఉండేది ఏదీలేదు. కాకపోతే కాలభేదం. అంతే. ఇటువంటి జగత్తులో మానవుడు అశాశ్వతమైన వాటిని శాశ్వతమనుకుంటున్నాడు. అనాత్మ వస్తువులను చూసి అవే ఆత్మ అనుకుంటున్నాడు. బృహదారణ్యకోపనిషత్తులో ప్రజాపతి పరబ్రహ్మని గురించి ఒక ప్రకటన చేశాడు. ఆ ప్రకటన విని దేవతలరాజైన ఇంద్రుడు, రాక్షసరాజైన విరోచనుడు బ్రహ్మదగ్గరకు వచ్చి ఆత్మతత్త్వాన్ని చెప్పమని అడిగారు. అయితే బ్రహ్మ చెప్పిన దాన్ని తన అజ్ఞానంతో తప్పుగా అర్థం చేసుకున్నాడు విరోచనుడు. 'దేహమే ఆత్మ' అని నిశ్చయించుకున్నాడు. ఇలాగే లోకంలో అనేకమంది దేహమే ఆత్మ. నేను అంటే ఈ శరీరమే. అని భావిస్తుంటారు. ఇక్కడ నేను అంటే అశాశ్వతమైన దేహం కాదు. దేహం వేరు ఆత్మ వేరు. గృహస్తుకు గృహంలాగా, ఆత్మకు ఈ శరీరము ఆలవాలమై ఉన్నది. ఆయువు తీరగానే ఈ దేహాన్ని వదలి, ఇంకొక దేహాన్ని ఆశ్రయిస్తుంది ఆత్మ. ఈ దేహం మాత్రం నశించిపోతుంది. పాంచభౌతికమైన దేహం పంచభూతాలలో కలిసిపోతుంది. జగత్తంతా నాశనమై పోయినా మిగిలేది ఒక్కటే. అదే ఆత్మ. మానవుడు ఏది ఆత్మో, ఏది అనాత్మో తెలుసుకోలేక అనేక కష్టాలు పడుతున్నాడు. దుఃఖ నివృత్తి కావాలంటే సత్యం తెలుసుకోవాలి. ఆత్మ అనాత్మల మధ్యగల తేడా గ్రహించాలి. అనాత్మ వస్తువుల్ని వదలి వెయ్యాలి. ఆత్మ అనాత్మల బంధం అంత తేలికగా పోయేది కాదు. అస్త్రాలవల్ల గాని, శస్త్రాలవల్లగాని, కర్మలవల్ల గాని, శాస్త్రపరిజ్ఞానంవల్ల గాని ఈ బంధం తెగదు. మనోబుద్ధులతో పదును పెట్టబడిన జ్ఞానఖడ్గంతోమాత్రమే ఇది నాశనమవుతుంది.

వేదాలు శాస్త్రాలు వల్లె వేయటము, యజ్ఞయాగాది కర్మల నాచరించటం వల్ల ఫలితంరాదు అనే వాదన తప్పు. ఈ కర్మలు ఆచరించటంవల్ల మనసు నిర్మల

మవుతుంది. నిర్మలమైన అద్దంలో ప్రతిబింబం స్వచ్ఛంగా కనిపించినట్లుగా, నిర్మలమైన మనసులో ఆత్మసాక్షాత్కారం జరుగుతుంది. ఈ రకమైన ప్రత్యక్షజ్ఞానం వల్ల సంసారబంధనాలు విడివడతాయి. శరీరంలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములు అనే పంచకోశాలున్నాయి. ఇవన్నీ అనాత్మ. వీటిలో ఏదీ ఆత్మకాదు. నీటిని నాచు కప్పివేసినట్లుగా, ఈ పంచకోశాలు ఆత్మను కప్పి వేస్తున్నాయి. దాహం వేసినవాడు చెరువు దగ్గరకు వెళ్ళాడు. చెరువులో మంచి తియ్యని నీరుంది. కాని చెరువంతా నాచుతో కప్పబడి ఉంది. ఆ నాచును గనక తొలగిస్తే మంచి నీరు లభిస్తుంది. దాహం తీరుతుంది. నీటినుంచే పుట్టిన నాచు నీరుకాదు. అలాగే ఆత్మ నుంచి పుట్టిన పంచకోశాలు ఆత్మకావు. పంచకోశాలను నిరశించినప్పుడు, స్వయంజ్యోతిగా ప్రకాశించే, నిత్యానందమయమైన ఆత్మ ప్రకాశిస్తుంది. ఆత్మసాక్షాత్కారం జరుగుతుంది. బంధమోక్షాలను గురించి గతంలో చెప్పుకున్నాం. నాది అనుకుంటే బంధం. నాది కాదు అనుకుంటే మోక్షం. మానవుడు సంసార సాగరంలో పడి కొట్టుమిట్టాడటానికి కారణం ఈ బంధనాలే. నేను నాది అనే అహంకార మమకారాల వల్లనే ఈ బంధనాలు ఏర్పడుతున్నాయి. వీటిని గనక త్రెంచుకోగలిగితే, మానవుడు అమరుడవుతాడు. అందుకని మోక్షగాములైనవారు ఏది ఆత్మ ? ఏది అనాత్మ? అనే విషయాన్ని క్షుణ్ణంగా తెలుసుకుని, అనాత్మ వస్తువులను పరిత్యజించాలి. అలా పరిత్యజించినవాడు సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మ తానే అని గుర్తించగలుగుతాడు. గడ్డిలో 'ముంజిగడ్డి' అని ఒక రకమైన గడ్డి ఉంది. దాంతో తాడు తయారుచేసి వివాహ ఉపనయన సమయాల్లో వాడతారు. ఉపనయనంలో ఆ త్రాడును వటువు నడుముకు కడతారు. వివాహ సమయంలో వధువు నడుముకు ముంజిగడ్డిత్రాడు కడతారు. ఆ గడ్డిలోని ప్రత్యేకత ఏమంటే అది పొరలు పొరలుగా ఉంటుంది. అంటే దాన్ని నిలువునా లాగితే నూలు పోగులులాగా, గడ్డిపోగులు వస్తాయి. ఈ పోగులు ఏవీ ఆ గడ్డికన్న వేరైనవి కావు. సముద్రంలో అలలు, కెరటాలు, నీరు, నీటి బుడగలు ఇవేవీ సముద్రం కన్నా వేరైనవి కావు. అలాగే ఈ జగత్తులో కనిపించేవేవీ కూడా ఆత్మకన్న వేరైనవి కావు. ఈ విషయాన్ని గుర్తించగలిగిన వాడు అనాత్మ వస్తువులను వదలి తానే ఆత్మస్వరూప మని గుర్తించి ముక్తి పొందుతాడు.

# 13. ధారణ, ధ్యానము, సమాధి

**ధారణ :** శరీరానికి బయట గాని, లోపలగాని ఏదైనా ఒక ప్రదేశంలో సాధకుడు తన చిత్తాన్ని నిలపటాన్నే 'ధారణ' అంటారు. ధారణను గురించి శంకర భగవత్పాదులవారు తమ 'అపరోక్షానుభూతి'లోని 122వ శ్లోకంలో "మనసు వెళ్ళిన చోటల్లా బ్రహ్మసాక్షాత్కారం పొందుతూ, మనస్సును స్థిరంగా ఉంచుకోవటమే ధారణ" అంటారు. శరీరం బయట అంటే, ఏదైనా ఒక ప్రదేశం మీద గాని, వస్తువు మీద గాని చిత్తాన్ని నిలపటం. ఒక వస్తువు అంటే దేవతామూర్తి మీద గాని, మరేదైనా వస్తువు గాని. అదే ఒక ప్రదేశం మీద అంటే గోడమీద చిన్న బిందువు ఏర్పాటు చేసి దాన్నే చూడటం. దానిమీద చిత్తాన్ని నిలపటం. ఇక శరీరంలోపల అంటే షట్చక్రాలలోను ఏదైనా ఒకచక్రంమీద, బ్రహ్మరంధ్రం, సుషుమ్ననాడి వీటిలో ఏదైనా ఒకదానిమీద చిత్తాన్ని నిలపటం. ఈ రకంగా ఒకపదార్థంమీద గాని, వస్తువు మీద గాని చిత్తాన్ని నిలపటమే ధారణ అనబడుతుంది. ఇది ఏకాగ్రదృష్టి. ఈస్థితిలో చిత్తం తనకు కావలసినవిషయం తప్ప, ప్రక్కనే ఉన్నప్పటికీ ఇతర విషయాలను గ్రహించదు. ఇంద్రియాలన్నీ, విషయాల నుండి వెనుకకు మళ్ళినాయి. అందుచేత విషయాలను గ్రహించవు. 'ప్రత్యాహారం' గనక జరక్కపోతే ధారణ జరగదు. ప్రత్యాహారం అంటే ప్రపంచంలోని సమస్త వస్తువులందు ఆత్మ భావాన్ని పొంది, మనస్సును ఆ పరమచేతనంలో ముంచి వెయ్యటం. ఇంద్రియాలు తమ బాహ్య వృత్తులన్నీ మరల్చి, చిత్తంలో లీనం చెయ్యటం కోసం చేసే అభ్యాసమే ప్రత్యాహారము. మనసు ఎక్కడికి వెడితే, అక్కడ బ్రహ్మసాక్షాత్కారం పొందుతూ, మనసును స్థిరంగాఉంచుకోవటమే 'ధారణ'. అంటే దేనిమీద ధారణ జరిగినా, అక్కడ పరబ్రహ్మ సాక్షాత్కారం జరుగుతుంది. ఇది రాజయోగ సంబంధము.

**ధ్యానము :** ఏ ప్రదేశంలో చిత్తాన్నిలగ్నంచేశామో, దానియందే జ్ఞానివృత్తి అఖండ ధారావాహిక రూపంలో సాగినప్పుడు దాన్ని ధ్యానమంటారు అంటాడు పతంజలి మహర్షి. ధ్యానము అనేది ధారణవల్ల తేలికగా సిద్ధిస్తుంది. ఇతర విషయాల మీదకు పోకుండాఉన్న జ్ఞానవృత్తి మన ధ్యేయం వైపుకు తైలధారగా సాగుతుంది. ధ్యేయంమీద

చిత్తాన్నిలగ్నంచెయ్యటమే ధారణ. చిత్తాన్ని ధ్యేయం వైపుకు సాగనీయటం ధ్యానం. ధ్యానం చేసేటప్పుడు ఏకాగ్రమైన చిత్తం ధ్యేయవస్తువు మీదనే లగ్నమయిఉండాలి. అంటే మధ్యలో ఇతర విషయాలను గురించిన ఆలోచనలు రాకూడదు.

శంకరులు ఈ ధ్యానాన్ని వివరిస్తూ "అహంబ్రహ్మాస్మి" నేనే పరబ్రహ్మను అనే సద్వృత్తితో, పరమానందాన్ని కలిగించే నిరాలంబస్థితి. దేనిమీద ఆధారపడకుండా ఉండే స్థితిని ధ్యానము" అన్నారు. అయితే ధ్యానానికి ప్రధానమైన లక్షణాలు రెండు.

1. నేనే బ్రహ్మననే భావన 2. నిరాలంబ స్థితి

ఏదైనా ఒక విషయం లేదా వస్తువుమీద మనసును నిలిపిఉంచవచ్చు. అది ధ్యానం కాదు. పరబ్రహ్మని లక్ష్యంగా చేసుకుని, ఆయనమీదనే మనసునిలపాలి. శరీరంలోని కన్ను, కాలువంటి బాహ్యేంద్రియాలు వాటి ఇష్టప్రకారము చలించకూడదు. వాటిని కట్టడి చెయ్యాలి. శరీరం కదలకుండా నిశ్చలంగా ఉండాలి. మనస్సులో అనేక రకాలైన ఆలోచనలు వస్తాయి. వాటిని పూర్తిగా వదిలెయ్యాలి. పరబ్రహ్మతో ఏకీభావం పొందాలి. అంటే మనస్సును పూర్తిగా పరబ్రహ్మమీదనే లగ్నంచెయ్యాలి. అప్పుడు మాత్రమే సాధకుడు తనలక్ష్యాన్ని నెరవేర్చగలుగుతాడు. ధ్యానంలో ఉన్నప్పుడు ఇతరవిషయాలచింతన ఏ మాత్రం పనికిరాదు. అనాత్మ వస్తువుల్ని గురించి చింతన వదిలెయ్యాలి. విజ్ఞానమయకోశంలో ఉండేఆత్మ సర్వదా స్వయంగా ప్రకాశిస్తుంది. అనాత్మకన్న విలక్షణంగా. ఉన్న ఈఆత్మనే ధ్యానంలో లక్ష్యంగా తీసుకోవాలి. అప్పుడు మిగిలిన ఆలోచనలను పూర్తిగా త్యజించి, పరమేశ్వర స్వరూపాన్ని మాత్రమే ధ్యానించాలి. ఇక్కడ చాలాముఖ్యమైనవిషయం ఏమంటే, ధ్యానంలో మిగిలిన విషయాలేవీ మధ్యలోకి రాకూడదు. అహం మొదలైన వాటిని పూర్తిగా వదిలేసి, ధ్యేయ వస్తువునందు మాత్రమే దృష్టినిలపాలి. అప్పుడే సాధకుడు చేసేధ్యానం ఫలిస్తుంది.

**సమాధి :** ధ్యానంలో ఉన్నప్పుడు కేవలము ధ్యేయాన్ని మాత్రమే చూస్తూ, నేను ధ్యానం చేస్తున్నాననే భావన కూడా మరిచిపోవాలి. ఆ స్థితిలో చిత్తం తన స్వరూపస్థితి పొందుతుంది. దాన్నే 'సమాధి' అంటారు. ధ్యానానికి అంతిమఘట్టం సమాధి. యోగానికి పరమావస్థ ఈ సమాధి. సమాధి స్థితిచేరటమనేది అంత తేలిక కాదు.

గతజన్మల పుణ్యం, గురుకృప. వీటివల్లనే సమాధి స్థితి లభిస్తుంది. "మనసును దేహం నుంచి వేరు చేసి, పరమాత్మతో అనుసంధానం చేయటమే సమాధి"

దశేంద్రియాలను వదిలేసి, ఏ రకమైన బంధము లేనట్టి స్థితే సమాధి.

సమాధి రెండు రకాలుగా ఉంటుంది. 1. సవికల్పసమాధి 2. నిర్వికల్పసమాధి. సవికల్పసమాధిలో, ఆ స్థితికి చేరిన తరువాత కూడా మనసులో సంకల్ప వికల్పాలు కలుగుతాయి. అంటే ఇతర విషయాలు కూడా తెలుస్తాయన్నమాట. నిర్వికల్ప సమాధిలో మనసు కూడా పని చెయ్యదు. 'సుమన' అంటే మనసు పనిచేసే స్థితి. ఉన్మన అంటే మనసుకూడా పనిచెయ్యని స్థితి. సమాధిస్థితికి కావలసినది ఇదే.

**సమాధి స్వభావము :** నిర్వికల్పసమాధిలో అద్వైతాత్మను దర్శించినప్పుడు హృదయంలోఉన్న అజ్ఞానగ్రంథులు పూర్తిగా నాశనంఅవుతాయి. వేదాంత పరిభాషలో వ్యక్తిత్వబంధాలను గ్రంథులు అంటారు. అవిద్యవల్ల కోరికలు పుడతాయి. ఈ కోరికలు బుద్ధిలో అలజడిని రేపుతాయి. ఈ కోరికలు సాధించటానికి కర్మలు ఆచరించటం జరుగుతుంది. అజ్ఞానంవల్ల బుద్ధిలో కలిగేకోరికలు, మనస్సులో అశాంతి, శారీరకమైన కోరికలు ఇవన్నీ కార్యకారణ సంబంధము అంటారు ఇదే సంసార బంధనము. సాధకుడు ప్రయత్నంతో తన మనస్సును శాంతం గావించి, తన సహజ స్వరూపమయిన ఆత్మానుభవం పొందినప్పుడు అవిద్య, కోరికలు, కర్మలు అనే ఈ మూడు గ్రంథులు విడివడతాయి. అవి నాశనం అవుతాయి. బుద్ధిలో సహజంగా కొన్ని దోషాలుంటాయి. వాటివల్ల అద్వితీయమైన పరమాత్మలో నువ్వు, నేను, అది, ఇది అనే కల్పనలు జరుగుతాయి. ఇదంతాఊహే. సమాధిలో బ్రహ్మ యొక్క సత్యస్వరూపాన్ని చూడగలిగితే ఈ కల్పనలు, భేదభావాలు పూర్తిగా నశిస్తాయి. పరమశాంతంతో, ఇంద్రియ నిగ్రహంతో ఇంద్రియ భోగవస్తువుల నుంచి పూర్తిగా దృష్టి మరల్చాలి. సహనంతో సమాధికోసం దృఢంగా ప్రయత్నించాలి. అప్పుడు తనలోని ఆత్మే సర్వత్రాఉండటాన్ని గ్రహించగలుగుతాడు. ఇప్పుడు అవిద్య నుంచి ఉత్పన్నమయ్యే వికల్పాలను కూడా నశింపచేస్తే, బ్రహ్మభావంలో నివశిస్తాడు. బాహ్యప్రపంచాన్ని, ఇంద్రియాలను, మనస్సును, బుద్ధిని, జీవభావాన్ని కూడా ఆత్మలో లీనం చేసి, సమాధిలో స్థితుడైన వాడు, జనన మరణాలతో కూడిన సంసారబంధనాల నుండి విముక్తుడవుతాడు. అంతేకాని శాస్త్రపాండిత్యంతో చిలకపలుకులు పలికేవారు ముక్తిని పొందలేరు. ఆత్మ ఒక్కటే. కాని అనేకంగా కనిపిస్తుంది. దీనికి కారణము

ఉపాధి భేదము. ఈ ఉపాధులను గనక విడదీసి చూడగలిగితే ఆత్మ కేవలముగ కనిపిస్తుంది. కాబట్టి విద్వాంసుడు ఈ ఉపాధులను లయంచెయ్యటానికి సదా నిర్వికల్పసమాధిని అభ్యసించాలి. కీటకము నిత్యము భ్రమరాన్ని ధ్యానించటం వల్ల, తాను భ్రమరత్వాన్ని పొందుతుంది. అలాగే ఆత్మను గురించి నిరంతర చింతన చేయటంవల్ల సాధకుడుకూడా ఆత్మస్వరూపుడవుతాడు. పరమాత్మతత్త్వం అత్యంత సూక్ష్మమైనది. బాహ్యంగాఉన్న మనస్సుతో దీన్ని చేరలేము. అత్యంత శుద్ధమైన బుద్ధితో, అతిసూక్ష్మమైన మనోవృత్తులతో, సమాధిస్థితిలో మాత్రమే దీన్ని తెలుసుకోగలరు. బంగారాన్ని పుటంవేసి కాల్చినకొద్దీ, దాని వన్నె పెరుగుతుంది. అలాగే ధ్యానంవల్ల మనస్సులో సత్త్వరజస్తమో గుణాలు నశించగా బ్రహ్మత్వం ప్రకాశిస్తుంది. నిరంతరమైన అభ్యాసంవల్ల శుద్ధమైనమనస్సు బ్రహ్మలో ఐక్యమైనప్పుడు, సవికల్ప సమాధి కాస్తా నిర్వికల్పసమాధి అవుతుంది. నిర్వికల్పసమాధిలో పరబ్రహ్మ తప్ప ఇంకేమీ కనిపించదు. ఆ స్థితి అద్వితీయమైన బ్రహ్మానుభవాన్ని కలగచేస్తుంది. ఈసమాధివల్ల కోరికలు నశిస్తాయి. కర్మలు అంతరిస్తాయి. అప్పుడు అంతరంగంలోని బాహ్యాభ్యంతరాళాల్లో అప్రయత్నంగా స్వరూపం మాత్రమే స్ఫురిస్తుంది. శ్రవణం కన్న మననం-వందరెట్లు ఉత్తమం. మననం కన్న ధ్యానం - లక్షరెట్లు ఉత్తమం. ధ్యానం కన్న నిర్వికల్ప సమాధి - కోటి రెట్లు ఉత్తమం. ఇది అన్నింటికన్న పవిత్రమైనది. అనంతమైనది. నిర్వికల్ప సమాధిలో మాత్రమే బ్రహ్మతత్త్వం స్ఫుటంగా తెలుస్తుంది. మిగిలిన స్థితులలో మనసు చరిస్తూ ఉంటుంది. అందువల్ల అప్పుడు మిశ్రమ భావాలు గోచరిస్తాయి. కాబట్టి శాంతమైన మనస్సుతో, ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సును పరమాత్మ యందు లగ్నంచెయ్యాలి. అప్పుడు పరతత్త్వంలోని ఏకత్వాన్ని దర్శించగలుగుతారు.

1. వాక్కుని అదుపులో పెట్టుకోవటం. 2. అపరిగ్రహము 3. ఎవరినుంచీ దేన్నీ ఆశించక పోవటము 4. కర్మబంధనాల నుండి విడివడటము 5. ఏకాంత జీవనము. ఇవి యోగసాధనకు మార్గాలు. ఏకాంతవాసం ఇంద్రియ నిగ్రహానికి సాయపడుతుంది. ఇంద్రియనిగ్రహం ద్వారా మనోనిగ్రహం కలుగుతుంది. మనోనిగ్రహంవల్ల అహంకారనాశనం కలుగుతుంది. దీనివల్ల యోగి ఆనంద రసానుభూతిని పొంది బ్రాహ్మీస్థితిని పొందుతాడు. అందుకే సాధకుడు చిత్తాన్ని నిరోధించాలి. వాక్కును - మనస్సులోను, మనస్సును-బుద్ధిలోను, బుద్ధిని-సాక్షిలోను, సాక్షిని - ఆత్మలోను లీనం చేసినవాడు నిర్వికల్ప స్థితిలో పరమశాంతాన్ని

పొందుతాడు. దేహము, ప్రాణము, ఇంద్రియాలు, బుద్ధి మొదలైన ఉపాధులలో, దేనితో మనస్సు కలిసిఉంటుందో, దానితోనే యోగి కూడా కలిసిపోయి అదే విధంగా మారినట్లుగా ఉంటాడు. దాన్ని గనక నివారించగలిగితే సాధకుడు అన్నింటి నుంచీ సులభంగా విడివడి సదానంద రసానుభవంలో స్థితుడవుతాడు.

**సమాధికి మార్గము :** సమాధి అంటే నిర్వికల్పసమాధి అనే గుర్తుంచుకోవాలి. అటువంటిస్థితి చేరటానికి ఏకైకమార్గం వైరాగ్యం. అంటే లౌకిక సుఖాలపట్ల విముఖత. బాహ్యప్రపంచంలోని వస్తువులనువదలటం తేలిక. కాని వస్తువుల మీద ఆశనువదలాలి. వస్తువులమీద కోరికలనువదలాలి. ముముక్షువు ఈ పని చాలా తేలికగా చెయ్యగలుగుతాడు. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమంటే, విరక్తుడయిన వాడు మాత్రమే అహంకార మమకారాలు త్యజించగలుగుతాడు. అటువంటివాడు మాత్రమే బ్రహ్మనిష్ఠను పొందగలడు. వైరాగ్యము, వివేకంతో నిండిన జ్ఞానము ఇవి రెండూ పక్షికి ఉన్న రెండు రెక్కల లాంటివి. ఒక రెక్కతో పక్షి ఎగరలేదు. అలాగే సాధకుడు కూడా వైరాగ్యము, వివేకపూరిత జ్ఞానము ఈ రెండూ ఉంటేనే లక్ష్యాన్ని చేరగలడు. ఇక్కడ ఇంకోవిషయం ఏమంటే అత్యంత వైరాగ్యం గలవాడు మాత్రమే సమాధిస్థితిని చేరి అనుభవాన్ని పొందగలడు. సమాధిస్థితి పొందిన వాడికే సత్యదర్శనమవుతుంది. సత్యదర్శనం పొందినవాడు మాత్రమే సంసార బంధనాల నుంచి విముక్తుడవుతాడు. ఇలా బంధనాల నుంచి విముక్తిపొందిన వాడే ముక్తుడు. అతడు మాత్రమే బ్రహ్మానందాన్ని పొందగలుగుతాడు. ఇంద్రియ నిగ్రహం ఉన్నట్లైతే, వైరాగ్యాన్ని మించినఆనందం ఇంకొకటి ఉండదు. దానితో పాటుగా స్పష్టమైన ఆత్మానుభవం గనక ఉన్నట్లైతే బాహ్యాభ్యంతరాలలో అతడు చక్రవర్తిలాగా ఉంటాడు. సంపూర్ణమైన ముక్తికి ఇదే ముఖద్వారం. కాబట్టి సాధకుడు పరిపూర్ణమైన వైరాగ్యాన్ని కలిగి ఉండాలి. మనస్సును నిత్యమూ ఆత్మధ్యానంలోనే ఉంచాలి. ఈ లోకంలో మానవులని ప్రలోభపెట్టే విషయవాంఛలన్నీ విషంలాంటివి. అవి మృత్యువుతో సమానమైనవి. కాబట్టి ముముక్షువైన వాడు కులము, జాతి, మతము లాంటి సంకుచిత భావాలను త్యజించాలి. స్వార్థపూరిత కర్మలను పరిత్యజించాలి. "నేను అంటే దేహం కాదు. నేను అంటే ఆత్మ." అనే భావనను నిశ్చయం చేసుకోవాలి. అప్పుడుమాత్రమే 'అహంబ్రహ్మాస్మి' అనే విషయం పూర్తిగా బోధపడి లక్ష్యంసిద్ధిస్తుంది.

## 14. తత్త్వవేత్త

తత్త్వాన్ని తెలుసుకున్నవాడు తత్త్వవేత్త. అతడే మహాజ్ఞాని. బ్రహ్మవేత్త. దేహమే నేను అని భావన చెయ్యటమే అజ్ఞానం. దేహమువేరు నేనువేరు. నేనుఅంటే త్వగాదిధాతువులలో కూడిన, అశాశ్వతమైన ఈదేహంకాదు. నేనుఅంటేఆత్మ. పరమేశ్వరుడికి నాకు తేడాలేదు. చరాచర జగత్తులో ఉన్నది నేనొక్కడినే. నాకన్న వేరైనది ఏదీలేదు అని భావనచెయ్యటమే జ్ఞానము. తత్త్వవేత్త తనకున్న జ్ఞానంతో మహదానందాన్ని పొందుతాడు. ఈ ఆనందం నాలుగు రకాలుగా ఉంటుంది.

1. దుఃఖాభావము 2. కామానాస్తి 3. కృతకృత్య భావన 4. ప్రాప్యప్రాప్తభావన. ఈ రకమైనభావనలతో జ్ఞాని ఆనందడోలికలలో తేలియాడుతుంటాడు. వీటిని 'జ్ఞానానందము' అనే అధ్యాయంలో వివరించాం.

తత్త్వజ్ఞానం పొందిన జ్ఞానికి 'జిజ్ఞాస' అనేది ఉండదు. అందుచేత ప్రవృత్తి మార్గంలో అతడికి అపేక్ష ఉండదు. ఇంకా పొందవలసినజ్ఞానము ఉండదు కాబట్టి, నివృత్తికి అవసరమయ్యే ఇతరసాధనాల అవసరంఉండదు. పొందిన జ్ఞానం స్థిరంగా ఉండటానికి నివృత్తి రూపమైన ఏ సాధనము అవసరంలేదు. అవిద్యవల్ల కాని, దాని కార్యరూపమైన ద్వైతజ్ఞానంవల్ల గాని ఇతర జ్ఞానానికి హాని ఏ మాత్రం కలగదు. తత్త్వజ్ఞానం వల్ల అతనికి ముందే ద్వైతము, అవిద్య పూర్తిగా నశించినాయి. నాశనమైన ఇంద్రియాల ద్వారా ద్వైత జగత్తును ఎంతగా చూసినా నష్టంలేదు. అందువల్ల అతని జ్ఞానం ఏమీనష్టంకాదు. ఇక్కడ చిన్న ఉదాహరణ చూడండి. ఎలుక బ్రతికుండగా పిల్లినిచంపలేదు. చచ్చిన ఎలుక పిల్లిని ఎలాగూ చంపలేదు. ఇక్కడ నాశనమైన ఇంద్రియాలు చచ్చిన ఎలుక లాంటివి. తత్త్వజ్ఞానం లోగడ విజృంభించిన అవిద్యతో యుద్ధం చేసి దాన్ని జయించింది. ఆ యుద్ధంలో అవిద్య నశించిపోయింది. అలా నశించిపోయిన అవిద్య మళ్ళీ రాలేదు కదా ! చచ్చిపోయిన శత్రువు వల్ల భయం లేదు.

అజ్ఞానికి యజ్ఞయాగాది కర్మలయందు, శ్రవణమననాదుల యందు ఉండే ఆసక్తి మంచిదే. అతడు స్వర్గంకోసం ప్రయత్నిస్తున్నాడు.

**జ్ఞానభూమికలు :** జ్ఞానికి అలాంటి కోరికలుండవు. జ్ఞాని కర్మిష్ఠుల మధ్యన ఉంటే, వారు చేసే కర్మలన్నీ తానూ చెయ్యవలసిందే. కర్మకాండలు చేసే వారిని నిందించకూడదు. ఒకవేళ జ్ఞాని తత్త్వజిజ్ఞాసువుల మధ్యనఉంటే, వారు చేసే పనులలోఉన్న తప్పులుచూపి వారిని సరైన మార్గంలో నడిపించాలి. తాను మాత్రం ఆ కర్మలను వదిలెయ్యాలి. విద్వాంసుడు అజ్ఞానులచే పొగడబడినా, నిందించబడినా తానుమాత్రం ఆ పని చెయ్యడు. వారికి ఆత్మజ్ఞానం కలిగించటానికే ప్రయత్నిస్తాడు. తాను ఏపనిచేస్తే అజ్ఞానులకు ఆత్మజ్ఞానం కలుగుతుందో, ఆ పనులే చెయ్యాలి. **అజ్ఞానులను జ్ఞానులుగా చెయ్యటం తప్ప, జ్ఞానికి వేరేపని ఏదీఉండదు** బ్రహ్మవేత్త శరీరం ఉండి కూడా లేనివాడు. విభజించటానికి వీలులేనివాడు. కాని అన్నిచోట్ల ఉంటాడు. సదాఅనంతుడు. ప్రియాప్రియములయందు, శుభాశుభాలయందు నిర్లిప్తంగాఉంటాడు. సూర్యకాంతిఉన్నప్పటికీ, చీకటిని కల్పించుకుని బాధ పడుతున్నట్లుగా, వస్తులక్షణాలు తెలియకుండా భ్రాంతిలోఉండి జనులు బాధ పడుతున్నారు. బ్రహ్మవేత్త అయినవాడు శరీరబంధనాల నుండి విముక్తి పొందుతున్నాడు. పాముకుబుసాన్ని విడిచినట్లుగా జ్ఞానిదేహభ్రాంతిని వదిలి పెడతాడు. గంగాప్రవాహం ఎత్తుపల్లాలను సరిచేసినట్లుగా ప్రాణవాయువు శరీరమంతా సంచరిస్తుంది. ఈ శరీరం ప్రారబ్ధం వల్ల కర్మఫలమనుభవించటానికి వచ్చింది. లక్ష్యా లక్ష్యాలను వదిలి కేవలము ఆత్మరూపుడైన బ్రహ్మవిదుడు స్వయంగా పరబ్రహ్మమే అవుతాడు. అతడు జీవించి ఉన్నప్పుడే సర్వదా విముక్తుడు, కృతార్థుడు. ఉపాధినశించటం వల్ల సద్రూప అధ్యయమగు పరబ్రహ్మ. నటుడు ఆడవేషం వేసుకున్నా వేసుకోకపోయినా పురుషుడే అయినట్లుగా బ్రహ్మవేత్త ఎల్లప్పుడూ బ్రహ్మమే అవుతాడు. కుండపగిలిపోతే, అందులోని ఘటాకాశంకూడా మహదాకాశమే అవుతుంది. అలాగే ఉపాధినశించినప్పుడు బ్రహ్మవేత్త స్వయంగా బ్రహ్మమే అవుతాడు. తన ఆత్మను పాలలోపాలుకలిసినట్లుగా, నూనెలోనూనెకలిసినట్లుగా, గాలిలో కలిసినట్లుగా, తన ఆత్మను పరమాత్మలోలీనంచేసి సుఖిస్తున్నాడు. ఈ రకంగా అఖండమైన ఆత్మానందంఅనుభవిస్తూ, విదేహముక్తినిపొందినజ్ఞాని మళ్ళీ జన్మించడు. అతడు కేవలము బ్రహ్మభావన పొందుతాడు.

ఆత్మజ్ఞాన సంపన్నుడు ముముక్షువు. అతడు ఇరవై ఒక్క తరాలను తరింప చేస్తాడు. బ్రహ్మజ్ఞానంచేత నూటఒక్కతరాలను తరింపచేస్తాడని సుబాలోపనిషత్తు, పైంగలోపనిషత్తు చెబుతున్నాయి. ఈ శరీరమేరథము. ఆ రథంలో కూచునే రథికుడు-జీవాత్మ. ఆ రథానికి సారథి. బుద్ధి. మనసు-పగ్గము, ఇంద్రియాలే - అశ్వాలు విషయాలే - మార్గాలు. ఆత్మేంద్రియ మనోయుక్తుడైన ఆ పరమేశ్వరుడే - భోక్త, అతడే ప్రత్యగాత్మ. అతడు హృదయమందు ఉంటాడు. ఆత్మవేత్త ప్రారబ్ధం ఉన్నంతవరకు తామరాకుమీద నీటిబొట్టులాగా, కర్మలుచేస్తూకూడా, వాటి ఫలితాన్ని పొందకుండా ఉంటాడు. జీవన్ముక్తుడైన దేహి, ఆకాశంలో చంద్రునిలాగా అంతటా సంచరిస్తాడు. ప్రపంచంలో ఎక్కడైనా తిరుగుతాడు. అతడు తనఇంట్లో గాని, ఏదైనా క్షేత్రంలో గాని శరీరాన్నివదిలి పరమపదముచేరతాడు.

జ్ఞానియైనవాడు మహత్పదాన్ని తెలుసుకుని చెట్టుమొదట్లో, లేదా చెట్టుతొర్రలో కూచోవాలి. మాసినగుడ్డలు ధరించి, ఏకాకియై, సమాధిలోఉండి, ఆత్మనుకోరేవాడై ఆప్తకాముడు, నిష్కాముడు, జీర్ణకాముడు అయిఉంటాడు. ఏనుగుయందు, సింహమందు, దోమయందు, ముంగిసయందు, పామునందు, యక్ష రాక్షసగరుడ గంధర్వులందు మృత్యువుయొక్క రూపము తెలుసుకున్నవాడు దేనికీ భయపడడు. అతడు వృక్షంలాగా ఉంటాడు. నరకబడుతున్నప్పటికీ కోపగించడు. ఆకాశంలాగా ఉంటాడు కొట్టినా కోపించడు. సత్యముతో ఉంటాడు ఈ ఆత్మ సత్యరూపము. అన్ని గంధాలకు హృదయం - భూమి. అన్ని శబ్దాలకీ హృదయం - ఆకాశం. గీతములన్నింటికీ హృదయం - అవ్యక్తం. సత్త్వములన్నింటికీ హృదయం - మృత్యువు. మృత్యువు పరుడైనదేవునియందు ఏకీభవిస్తుంది. ఆ పైన సత్తు లేదు. అసత్తులేదు. సదసత్తు అంతకన్నలేదు.

మానవుడు విగతజీవుడైన తరువాత అతనిదేహాన్ని పాతిపెడతారు. లేదా తగలబెడతారు. కాని బ్రహ్మవేత్తకు మాత్రమే 'ప్రవ్రజనదీక్ష' తగినది. ప్రవ్రజనదీక్ష అంటే సన్యాసము. గృహస్థాశ్రమంలో ఉన్న భార్యాపుత్రులను వదలిపెట్టేయ్యటము. ఇతరులకు ఆదీక్ష పనికిరాదు. బ్రహ్మవేత్త మరణించినప్పుడు సామాన్యంగా ఉండే అశౌచము, పిండోదకాలు, శ్రాద్ధకర్మలు ఏవీఉండవు. దహించినదానికి ఇంకా దహనంతో పనిఉండదు. పక్వమైనదానికి పచనంతోపనిలేదు. జ్ఞానాగ్నిలో కర్మంతా

దహనమైపోయింది కాబట్టి, మళ్ళీవేరుగా అతడికి కర్మకాండ అవసరంలేదు. అతని ఆత్మ అజ్ఞానం నుంచి విడివడింది. అతని దేహము జ్ఞానాగ్నిలో గతంలోనే దగ్ధమైంది. అందుచేతనే అతనికి శ్రాద్ధకర్మలు ఏవీ ఉండవు. ఉపాధి ఉన్నంతవరకు సద్గురువుకు సేవచెయ్యాలి. ఒకవేళ గురువు గనక గృహస్తుఅయితే అతని పుత్రులను కూడాసేవించాలి. శుద్ధమనస్సు, చిద్రూపముగలిగి సహిష్ణుడైన బ్రహ్మనిష్టుడు "పరమాత్మను నేను" అనే జ్ఞానం కలుగగా, దానివల్ల విజ్ఞానంకలిగి, జ్ఞేయమైన పరమాత్మను మనసులోదర్శించి, శాంతిపొందగా, అప్పుడు అతడు మనస్సు, బుద్ధి కూడా నశించినటువంటివాడై పరబ్రహ్మఅవుతాడు.

అమృతం త్రాగిన వాడికి పాలతో పనిఉండదు. అలాగే జ్ఞానామృతంతో సంతృప్తుడయిన జ్ఞానికి కర్తవ్యము ఏమీ ఉండదు. ఆత్మజ్ఞానం కలవాడే తత్త్వవేత్త. అతడు దూరంగా ఉన్నప్పటికీ నిజంగా దూరంగాఉండడు. శరీరంలో ఉన్నప్పటికీ, శరీరాన్నివేరుగా శవంలాచూస్తున్నవాడై, సర్వసన్యాసిగా ఉంటాడు. హృదయాన్ని నిర్మలంచేసుకుని, పరమాత్మనుధ్యానించి, "ఆ పరమాత్మను నేనే" అని తెలిసి, జీవుడు పరమానందంపొందాలి. నీటిలోనీరులా, పాలలోపాలులాగా జీవాత్మ పరమాత్మలు ఏకీభావంచెందుతాయి. జీవాత్మపరమాత్మల మధ్యన తేడాలేదు.

దేహంలో జ్ఞానదీపము ప్రకాశించగా, బుద్ధి అఖండాకార రూపమవుతుంది. అప్పుడు విద్వాంసుడు బ్రహ్మజ్ఞానమనే అగ్నితో కర్మబంధనాలను దహించివేస్తాడు. బ్రహ్మవేత్త అద్వైతరూపుడైన పరమేశ్వరునిలో ఆత్మైక్యముపొంది పరమాత్మలో లీనమవుతాడు. ఆ స్థితిలో ఆత్మకు ఉపాధిఏదీఉండదు. ఆకాశంలాగా ఆత్మసూక్ష్మరూపం గలది. వాయువులాగా కంటికి కనిపంచదు. బ్రహ్మవేత్త ఎక్కడ మరణించినా, అక్కడే సర్వగతమైన ఆకాశంలాగా లయంపొందుతున్నాడు.

ధ్యానయోగము చాలా గొప్పది. వేలసంవత్సరాలు ఒంటికాలిమీద నుంచుని తపస్సు చేసినా, ధ్యానయోగంలో పదహారవంతుకు కూడా సమానం కాదు. మానవుడు ఎన్నివేల సంవత్సరాలుశ్రమించినా శాస్త్రాలసారాన్ని గ్రహించలేడు. అక్షరపరబ్రహ్మను తెలుసుకోవాలి. జీవితంక్షణభంగురము. శాస్త్రపరిజ్ఞానము వదిలి, సత్యమైన పరబ్రహ్మను ఉపాసించాలి. బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోలేనంత వరకు కర్మలు, శౌచము, జపము, యజ్ఞము, తీర్థయాత్రలు చేస్తుండాలి. మహాత్ములకు 'అహంబ్రహ్మాస్మి' అనే

భావమే మోక్షహేతువు. బంధానికి మోక్షానికి కేవలము ఒక అక్షరమే తేడా. మమ అంటే బంధం. నమమ అంటే మోక్షం. ఉన్మనస్థితి పొందితే ద్వైతభావన కలగదు. ఆస్థితిలో జీవుడికి పరమానందం కలుగుతుంది. మనసు ఏ ప్రదేశానికి పోతుందో, అక్కడే పరమపదము ప్రాప్తిస్తుంది. పరబ్రహ్మ సర్వత్రావ్యాపించిఉంది. ఈ జగత్తులో బ్రహ్మకానివస్తువు ఏదీలేదు. ఆకాశాన్ని ముష్టిఘాతాలతో ముక్కలు చెయ్యవచ్చు. బాగా ఆకలిగా ఉన్నవాడు ఆకలి రాకుండా చేసుకోవచ్చు. అసాధ్యమైనవి సాధ్యం చెయ్యచ్చు. కాని నేనుబ్రహ్మనుకాను అని భావించేవాడు మాత్రం మోక్షంపొందలేడు. అయితే అసలు జ్ఞానముఎలావస్తుంది? అంటే జ్ఞాన భూమికలకు సంబంధించిన జ్ఞానమే యథార్థ జ్ఞానము. ఈ జ్ఞానభూమికలు ఏడురకాలు. ఈ సప్తభూమికల పరంగా ఉన్నదే మోక్షము. అవి 1. శుభేచ్ఛ 2. విచారణ 3. తనుమానసి 4. సత్వాపత్తి 5. అసంసక్తి 6. పదార్థ భావన 7. తుర్యగ. ఈ భూమికలను ఆచరించిన వారికి మోక్షం సిద్ధిస్తుంది. మోక్షస్థితిలో ఉన్నవాడు మళ్ళీ దుఃఖాన్ని పొందడు. వాటిని వివరంగా చూద్దాం.

**1. శుభేచ్ఛ:** ఇది ముందుగా మానవుడిలో కలిగే మార్పు అతనిలో ఉత్పన్నమయ్యే కోరిక. యథార్థజ్ఞానం తెలుసుకోలేకపోయాననే బాధ. దాన్ని తెలుసుకోవాలనే కోరిక, ఇప్పటిదాకా మూర్ఖుడిలా ఉన్నాను, కాలమంతా వృధా చేశాను, ఇక మీదటైనా శాస్త్రాధ్యయనం చేసి, సజ్జనసాంగత్యము ఆచరించి యథార్థజ్ఞానాన్ని తెలుసుకోవాలని కోరే వైరాగ్యసహితవాంఛనే 'శుభేచ్ఛ' అంటారు.

**2. విచారణ :** సజ్జనసాంగత్యము, శాస్త్రాధ్యయనము చేసిన తరువాత ఆ విషయాలను మనసుకు పట్టించుకుని నిరంతరము వాటిని గురించే ఆలోచిస్తుంటాడు. ఈరకంగా కొంతవరకు వైరాగ్యముపొంది, వీటివల్ల అంటే శాస్త్రాధ్యయనము, సజ్జన సాంగత్యము, వైరాగ్యము వల్ల ఏర్పడే సదాచార ప్రవృత్తినే విచారణ అంటారు. ఇదే ఆత్మవిచారణ. తనను గురించి తాను తెలుసుకోవటానికిచేసే ప్రయత్నము.

**3. తనుమానసి :** ఈ రకంగా మోక్షగామి అయినవాడు శుభేచ్ఛ చేత, విచారణ చేత, స్వరూపాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నం చేస్తూ, అందులోని భాగంగా ఇంద్రియ వాంఛలను వదిలేస్తాడు. ఆహారనిద్రా మైథునాల మీద కోరికను చంపుకుని, ఇంద్రియాలను శుష్కింప చేస్తాడు. ఇటువంటిస్థితినే తనుమానసి అంటారు.

**4. సత్త్వాపత్తి :** ఈ మూడు భూమికలను అభ్యాసం చెయ్యటంవల్ల చిత్తములో వైరాగ్యం ఏర్పడుతుంది. ఆ తరువాత శుద్ధసత్త్వస్థితిని పొంది, అంటే కేవలము సత్త్వగుణం మాత్రమే కలిగి, ఆత్మయందు నిలకడ పొందుతుంది. మానవుడి ధ్యాస అంతా ఆత్మమీదనే ఉంటుంది. అలాంటి స్థితినే సత్త్వాపత్తి అంటారు.

**5. అసంసక్తి :** ఈ నాలుగు భూమికలను అభ్యాసం చెయ్యటంవల్ల సత్త్వగుణ ప్రధానుడై, విషయవాసనలు లేకుండా పూర్తిగా మనసును ఆత్మయందే లయం చేసే స్థితి.

**6. పదార్థభావన :** ఈ ఐదు భూమికలను అభ్యాసం చెయ్యటంవల్ల, బాహ్యాభ్యంతర పదార్థ భావశూన్యుడై అంటే తనకు మించినది లోపల గాని, వెలుపల గాని మరొకటి లేదని నిశ్చయించుకున్నవాడై, తనయొక్క ఆత్మలో దృఢమైన స్థితిని అనుభవిస్తూ, ఇతరులతో ప్రయత్నపూర్వకంగా అవబోధనము చేయబడేస్థితి. అంటే ఈ జగత్తంతా పరమేశ్వరమయము. శరీరంలోపల గాని, బయట గాని ఆ పరమేశ్వరునికి మించినది ఏదీలేదు అని భావిస్తూ ఆత్మస్థితిని పొంది, ఇతరులు ఏదైనా అడిగితే సమాధానం చెప్పే స్థితి.

**7. తుర్యగ :** ఈ ఆరు భూమికలను నిరంతరము అభ్యాసం చెయ్యటంవల్ల భేదభావం పూర్తిగా నశించిపోతుంది. ఆ సమయంలో అనుభవించే ఆత్మానందాన్నే 'తుర్యగ' అంటారు. అదే తురీయస్థితి లేదా తురీయావస్థ.

జ్ఞానులు నాలుగు రకాలుగా ఉంటారు.

**1. బ్రహ్మవిదుడు :** సత్త్వాపత్తి అనే నాల్గవ భూమికలో ఉంటాడు.

**2. బ్రహ్మవిద్వరుడు :** అసంసక్తి అనే ఐదవ భూమికలో ఉంటాడు.

**3. బ్రహ్మవిద్వరీయుడు :** పదార్థ భావన అనే ఆరవ భూమికలో ఉంటాడు.

**4. బ్రహ్మవిద్వరిష్టుడు :** తుర్యగ అనే ఏడవ భూమికలో ఉంటాడు అంటే అతడు ఎల్లవేళలయందు తురీయస్థితిలో సమాధిలోనేఉంటాడు. ఇతడు జీవన్ముక్తుడు. అన్నపానాదులు తీసుకోడు. బలవంతంగా తినిపించాలి. లోకానికి ఏమీ చేయడు. ఒంటిమీద స్పృహఉండదు.

ఈ జ్ఞానులలో బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు మాత్రం కొంతవరకు దేహజ్ఞానం కలిగి ఉంటారు. వారిసంస్కారాన్నిబట్టి పనిచేస్తారు. అటువంటి వారికి మనోనాశనమే ప్రధానము. మనోనాశనము రెండు రకాలు.

**1. స్వరూపనాశనము :** చిత్తముతో కూడా రూపాన్నినాశనం చెయ్యటం.

**2. అరూపనాశనము :** చిత్తము మాత్రమే నాశనంచెయ్యటం.

జీవన్ముక్తి లయందు తుర్యగ అనబడే తురీయావస్థ ఉంటుంది. ఈ అవస్థకు పైన తురీయాతీతావస్థ ఉంటుంది. అది విదేహముక్తికి సంబంధించినది. తురీయాతీతము అంటే తురీయము కూడా దాటినస్థితి. తురీయాతీతస్థితిని చేరినవారు సాక్షాత్తు పరమేశ్వరస్వరూపులవుతారు. మహాత్ములు, ఆత్మారాములు, మహాధన్యులు వీరిలో ఎవరు తుర్యగను చేరతారో, వారే పరమపదానికి అర్హులు. వారే విదేహముక్తి పొందుతారు. జీవన్ముక్తులు సుఖదుఃఖాలలో మునిగిపోరు, వారు చేయవలసిన పనులుమాత్రమే చేస్తారు. చేయవలసినది ఏదీ లేకపోతే, ఏమీ చెయ్యకుండా ఉండిపోతారు. ఇటువంటి సత్పురుషులు ప్రక్కన ఉన్నవారిచే బాధితులై, నిద్రనుంచి లేచినవారిలాగా పూర్వాచార క్రమాగతాలైన ఆచారాలను ఆచరిస్తూ ఉంటారు. బుద్ధిమంతులైన వారికి మాత్రమే ఈ ఏడు భూమికలు అర్థం అవుతాయి. జన్మాంతర పుణ్యంతో పశుపక్ష్యాదులు కూడా ఒకవేళ ఈ భూమికలను పొందితే ముక్తులవుతాయి.

జ్ఞానభూమికలలో సంచరించేవారు సశరీరులైనా, అశరీరులైనా ముక్తి పొందుతారు. ఇందులో సందేహం లేదు. హృదయగ్రంధి విచ్ఛేదనమే జ్ఞానము. సృష్టి స్థితి లయాలకు నాకు ఏ సంబంధం లేదు. జగత్తులో ఉన్నది ఒక్కటే. అదే పరబ్రహ్మ. అంతకు మించినది ఏదీలేదు. ఆపరబ్రహ్మమే నేను అనేస్థితిని పొందటమే ముక్తి. గ్రంధివిచ్ఛేదన రూపమయిన విముక్తి అంటే ఎండమావులలో నీరున్నదని భ్రమించినట్లుగా, మహదాది స్థూలభ్రాంతి, అమహదాది దేహభ్రాంతి మొదలైన అన్ని భ్రాంతులు నశించినస్థితి. ఈ జగత్తు కాని, దేహం కాని ఏవీ లేవు. అంతామిధ్య. అంతాభ్రాంతి. ఇటువంటి అన్ని భ్రాంతులు నశించినస్థితి. ఈ స్థితికి చేరినవారు అంటే అజ్ఞానము అనే సముద్రాన్ని దాటినవారు మాత్రమే పరమపదం చేరతారు. ఆ స్థితి పొందగోరే వారు మాత్రమే ఈ సప్తభూమికలలో ఉంటారు. ఈ

సప్తభూమికలకు లక్ష్యము పరబ్రహ్మపదము. నువ్వు, నేను, నీది, నాది, ఇతడు, అతడు అనేతేడా లేనిస్థితి. సంకల్పరూపజ్ఞానం కూడా లేనిస్థితి ఉన్నది లేదు అనే వృత్తులకు అగోచరమైనది. దృశ్యము, అదృశ్యము కానిది ఏదైతే ఉన్నదో, అదేమోక్షము. సర్వము శాంతించినటువంటిది, నిరాలంబమైనది, శాశ్వతమైనది, సత్యము నిత్యమైనది, అనాభాసమైనది, అనామకమైనది, కారణము లేనిది, అదే ముక్తి. అది ఈ జ్ఞాన భూమికలవల్లనే లభిస్తుంది.

**ప్రారబ్ధం :** కర్మ మూడు రకాలుగా ఉంటుంది అని గతంలో చెప్పుకున్నాం. 1. సంచితము 2. ప్రారబ్ధము 3. ఆగామి. చేసిన కర్మఫలితం పూర్తిగా మనమే అనుభవించాలి. అయితే ఏ జన్మలో చేసిన కర్మ ఆ జన్మలోనే అనుభవించటం జరగదు. కాబట్టి, ఆ కర్మఫలితాన్ని మరుజన్మలో అనుభవిస్తారు. ఈ రకంగా జన్మజన్మలలో చేసిన కర్మఫలితం అంతా ఒక చోట చేరుతుంది. దీన్నే సంచితకర్మ అంటారు. ఇది అనుభవించటంవల్ల క్షయంకాదు కేవలం జ్ఞానం చేత మాత్రమే క్షయమవుతుంది. అనుభవం చేత దీన్ని నాశనం చెయ్యాలనుకోవటం మూర్ఖత్వం. ఎందుకంటే కల్పాంతం అనుభవించినా సంచితకర్మ నాశనం కాదు. దీన్ని జ్ఞానంచేత మాత్రమే నాశనం చెయ్యాలి. జ్ఞాని ఈజన్మలో కర్మ చెయ్యడు. ఒకవేళ చేసినా నిష్కామ్యకర్మ చేస్తాడు. దానివల్ల ఫలం ఉండదు. అంటే ఆగామికర్మ ఉండదు. ఇక ప్రారబ్ధ కర్మ.

నిధి ధ్యాసలో నిష్ఠకలిగిన వాడికి కూడా బాహ్యంగా అన్నీ కనిపిస్తున్నట్లుగా అనిపిస్తుంది. దీన్నే ప్రారబ్ధము అంటోంది శ్రుతి. మానవుడికి సుఖము మొదలైన అనుభవాలున్నంత వరకూ ఈ ప్రారబ్ధము అనేది అంటిపెట్టుకునే ఉంటుంది. ఏదైనా ఒకఫలితాన్ని మనంఅనుభవిస్తున్నాము అంటే, దానికి ఒక కారణం, కర్మ ఉండే ఉంటుంది. కర్మ లేకుండా ఫలితము అనేది ఎప్పుడూ ఉండదు. నిద్రపోతున్న వాడు కలగంటాడు. మెలకువ రాగానే కలకరిగిపోతుంది. అలాగే 'అహంబ్రహ్మోస్మి' అనే అనుభవ జ్ఞానం కలగగానే కర్మ అంతా క్షయమై పోతుంది. కలలో కనిపించినవి పుణ్యమైనా పాపమైనా తేడాలేదు. మెలకువరాగానే ఏదీ ఉండదు. వాటివల్ల స్వర్గనరకాలు రావు. జ్ఞాని కర్మలుచెయ్యడు. వాటిపట్ల చాలా ఉదాసీనంగా ఉంటాడు. కుండలో ఆకాశం ఉంది. అందులో మద్యం పోసినందువల్ల ఆకాశానికి మద్యంవాసన

అంటదు. ఆకాశం కలుషితంకాదు. అలాగే ఆత్మకూడా తన చుట్టూఉన్న ఉపాధులవల్ల కలుషితంకాదు. ఇప్పుడు ప్రశ్న ఏమంటే జ్ఞానియైన వాడు ప్రారబ్ధాన్ని అనుభవించాలా అవసరం లేదా ? అని. ఈ జన్మ, జ్ఞానం కలగక ముందు వచ్చింది. కాబట్టి దానికి సంబంధించిన కర్మలన్నీ అనుభవించాల్సిందే. సంధించి విడిచినబాణం మధ్యలోఆగదు. ఆవును చూసి, పులి అని భావించి బాణం వేశాం. కాని అది ఆవుఅయినంత మాత్రం చేత వదలినబాణం మధ్యలోఆగదు. లక్ష్యాన్ని ఛేదించి తీరుతుంది. అలాగే ప్రారబ్ధంకూడా. ఈ ప్రారబ్ధం చాలాబలమైనది. ఎంతటివారైనా దీన్ని అనుభవించాల్సిందే. జ్ఞానంవల్ల సంచిత, ఆగామికర్మలు మాత్రమే నశిస్తాయి. ప్రారబ్ధం మాత్రం నాశనం కాదు. దీన్ని అనుభవించి తీరాల్సిందే అంటున్నాయి ఉపనిషత్తులు. కాని శంకరుల వారు మాత్రం అలా కాదు అంటారు. జ్ఞానం కలిగిన తరువాత, ఇక కర్మ అనేది ఉండదు అంతా క్షయమై పోతుంది. దానితోనే ప్రారబ్ధం కూడా నాశనమవుతుంది. మెలకువ వచ్చిన వాడికి స్వప్నంలో కనిపించిన వస్తువులతో సంబంధం ఉంటుంది అనేది ఎంత నిజమో, జ్ఞాని ప్రారబ్ధాన్ని అనుభవిస్తాడనటం కూడా అంతే నిజం అంటారు తమ వివేక చూడామణిలోని 455వ శ్లోకంలో. "స్వప్నం నుంచి మేలుకున్న వాడికి, స్వప్నంలో తన దేహం మీద తన వస్తువుల మీదా నేను నాది అనే భావాలుండవు. మెలకువ రాగానే అవన్నీ పోతాయి. అతడు మిథ్యా వస్తువులను సత్యమైనవిగా చెప్పాలనుకోడు. ఒకవేళ మిథ్యావస్తువులపై మమకారం కలిగి ఉంటే, అతడు నిద్రనుంచి మేల్కొనలేదని ఖచ్చితంగా చెప్పవచ్చు. అలాగే జ్ఞాని ఈ ప్రపంచమంతా కలలాగా చూస్తాడు. కర్మ అనేది శరీరానికి సంబంధించింది. కాబట్టి ప్రారబ్ధమనేది శరీరానికే కాని ఆత్మకు కాదు. ఆత్మకు జనన మరణాలు లేవు. అది నిత్యము శాశ్వతము. మరి దానితో తాదాత్మ్యము చెందిన వాడికి ప్రారబ్ధం ఎలా ఉంటుంది? శరీర తాదాత్మ్యత ఉన్నంతవరకు ప్రారబ్ధం ఉంటుంది. జ్ఞానము కలిగిన తరువాత, ఈ శరీరము, నాది కాదు. నేను అంటే ఆత్మ అని తెలిసిన తరువాత, ఇంకా ప్రారబ్ధం ఎక్కడుంటుంది? ప్రారబ్ధమనేది శరీరానికి సంబంధించినది అని చెప్పటం కూడా సరికాదు. ఎందుకంటే శరీరం అసత్యమైనది. అసత్యమైన దానికి జన్మ ఎలా ఉంటుంది? పుట్టని దానికి మరణం లేదు. అసత్యమైన దాన్ని ప్రారబ్ధం బాధించదు" అంటున్నారు. 446 నుంచి 464 వరకు ఉన్న శ్లోకాలలో

ఇక్కడ మనం కొన్ని విషయాలు గుర్తుంచుకోవాలి. ఎప్పుడయినా సరే కర్మ ఫలితాన్ని అనుభవించేది శరీరమే. ఆత్మకు దీనితో సంబంధం లేదు. అజ్ఞానంతో శరీరానికి తనకు సంబంధం ఉన్నదని అన్నింటికీ తానే కర్త భోక్తా కూడా అని భావిస్తుంది. జ్ఞానంకలుగగానే ఈ భావనలన్నీ పోతాయి. ప్రారబ్ధకర్మ ఫలితమే ఈ దేహము. కాబట్టి ఈ దేహము ఉన్నంతవరకు ప్రారబ్ధం అనుభవించాల్సిందే. అయితే జ్ఞాని తన దేహాన్ని శవంలాగా చూస్తాడు. అతనికీ దేహానికీ సంబంధం లేదు. కర్మవల్ల ఈ దేహం సుఖదుఃఖాలు అనుభవిస్తుంది. కాని వాటిని జ్ఞాని పట్టించుకోడు. ప్రారబ్ధమనేది కేవలం పార్థివ దేహానికే గాని, పారమార్థిక దేహానికి ఉండదు. అందుచేత జ్ఞాని ప్రారబ్ధాన్ని అనుభవించదు. చూసేవారికి మాత్రం అనుభవిస్తున్నట్లుగా కనిపిస్తాడు.



# 15. మహావాక్యాలు

ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని పొందటానికి అలౌకికమైన మార్గాన్ని చెప్పేదే వేదము. వేదము నాలుగు భాగాలుగా ఉంటుంది. 1. సంహిత 2. బ్రాహ్మణము 3. అరణ్యకము 4. ఉపనిషత్తు. వేదంలో చివరిభాగాన్నే ఉపనిషత్తు అంటారు. ఉపనిషత్తు అంటే జ్ఞానవిద్య. అదే మోక్షవిద్య. సాధకుడికి జన్మమృత్యుజరాదులు లేకుండా చేసేది. మోక్షమార్గాన్ని చూపేది. ఇది వేదానికి అంతమునందుంటుంది. కాబట్టి దీన్ని 'వేదాంతము' అని కూడా అంటారు. నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులున్నాయి. వాటిలో ముఖ్యమైనవి 108 అని ముక్తికోపనిషత్తులో చెప్పబడింది. వీటిలో పదిఉపనిషత్తులు చాలా ముఖ్యమైనవి అన్నారు శంకర భగవత్పాదులవారు అవి

**ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తిత్తిరి.**
**ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశః ॥**

ఐతరేయోపనిషత్తు - ఋగ్వేదంలోది
కఠ, తైత్తిరీయోపనిషత్తులు - కృష్ణయజుర్వేదంలోవి
ఈశావాశ్య, బృహదారణ్యకాలు - శుక్లయజుర్వేదంలోవి
కేన, ఛాందోగ్యోపనిషత్తులు - సామవేదంలోవి
ప్రశ్న, ముండక, మాండూక్యోపనిషత్తులు - అధర్వణ వేదంలోవి

ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ జన్మ మరణాలు లేకుండా చేసేది. బ్రహ్మపదార్థలాభం కలిగించేది.

ప్రతి ఉపనిషత్తులోను పరబ్రహ్మతత్వాన్నే వివరించటం జరిగింది. నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. ఆదిమధ్యాంతాలు లేనివాడు. శాశ్వతుడు. స్వతంత్రుడు. ధర్మాధర్మాలు లేనివాడు. పక్షపాతం లేనివాడు. నిమిత్తమాత్రుడు. ఆనందస్వరూపుడు. జీవుల కర్మననుసరించి వాటికి ఉత్తరజన్మలు ప్రసాదిస్తాడు. సృష్టి స్థితి లయాలకు కారణం అతడే. సర్వవ్యాపి. చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. ఈ విధంగా పరబ్రహ్మ తత్వాన్ని వివరించటంలో ఉపనిషత్తులు చాలావరకు సఫలీకృతం

చెందినాయి. అయితే ఈ ఉపనిషత్తులసారమంతా మహావాక్యాలలో ఉన్నది. మహావాక్యాలు నాలుగు. ఇవి నాలుగు వేదాలకు సంబంధించిన ఉపనిషత్తుల నుండి చెప్పబడ్డాయి. అవి

| | | |
|---|---|---|
| 1. ప్రజ్ఞానంబ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదం |
| 2. అహంబ్రహ్మాస్మి | బృహదారణ్యకం | శుక్లయజుర్వేదం |
| 3. తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదం |
| 4. అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదం |

**మహావాక్యాల అర్థము :** ఈ మహావాక్యాల ద్వారానే మోక్షగామి అయిన వాడికి జీవబ్రహ్మైక్యజ్ఞానం లభిస్తుంది. ముందుగా వీటి అర్థం ఏమిటో చూద్దాం. మొదటగా

**1. ప్రజ్ఞానంబ్రహ్మ :** ఇది ఋగ్వేదంలోని ఐతరేయోపనిషత్తులోది. ఇందులో రెండు శబ్దాలున్నాయి. 1. ప్రజ్ఞానము 2. బ్రహ్మ. ఏ పురుషుడు కళ్ళతో ఈ దృశ్యాన్ని చూస్తున్నాడో, చెవులతో శబ్దాలువింటున్నాడో, ముక్కుతో వాసనచూస్తున్నాడో, వాక్కుతో మాట్లాడుతున్నాడో, అక్షరాలు పలుకుతున్నాడో, నాలుకతో రుచి చూస్తున్నాడో, ఆ చైతన్య స్వరూపుడే 'ప్రజ్ఞానము' అనే శబ్దంతో చెప్పబడ్డాడు.

బ్రహ్మ, ఇంద్రుడు, దేవతలు, మానవులు, గుర్రాలు, ఆవులు మొదలైన వాటి అన్నింటియందూ ఉంటూ, ఈ జగత్తు యొక్క సృష్టి స్థితిలయాలకు కారణభూతమైనట్టి చైతన్యం ఒకటి ఉన్నది. ఆ చైతన్యమే బ్రహ్మము. ఆ ప్రజ్ఞాన స్వరూపమైన పరబ్రహ్మ నాలోనే ఉన్నది. జగత్తంతా వ్యాపించి ఉన్న ప్రజ్ఞానమే–బ్రహ్మ. అంటే **ఆత్మకి బ్రహ్మకీ భేదం లేదు.**

**2. అహంబ్రహ్మాస్మి :** ఇది బృహదారణ్యకోపనిషత్తులోది. ఆ ఉపనిషత్తు శుక్ల యజుర్వేదంలోది. ఇందులో మూడు పదాలున్నాయి. 1. అహం 2. బ్రహ్మ 3. అస్మి. దేశకాల వస్తువులచేత అపరిచ్ఛిన్నుడైన పరమాత్మ, బ్రహ్మవిద్యాధికారులైన వారి బుద్ధికి సాక్షిగా ప్రకాశిస్తూ, అహం అనే పదానికి లక్ష్యంగా ఉన్నాడు. అహం అంటే నేను అనే పదంచేత వ్యవహరించబడుతున్నాడు. స్వతహాగా పరిపూర్ణత్వం గలిగిన పరమాత్మ 'బ్రహ్మ' శబ్దంతో పిలువబడుతున్నాడు. ఇక్కడ 'అస్మి' అనేది క్రియాపదం. అహం, బ్రహ్మ అనే రెండు పదాలు ఒకటే అనే ఏకత్వాన్ని సూచిస్తోంది.

నేను, పరబ్రహ్మ రెండూ ఒకటే. అనే భావాన్ని చెబుతోంది. అస్మి అనే క్రియాపదం. ఈ రకంగా "నేనే పరబ్రహ్మని" అనే జీవబ్రహ్మైక్యాన్ని బోధిస్తున్నది. **జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే**

**3. తత్త్వమసి :** ఇది ఛాందోగ్యోపనిషత్తులోది. ఆ ఉపనిషత్తు సామవేదంలోది. ఇందులో మూడు పదాలున్నాయి. 1. తత్ 2. త్వమ్ 3. అసి. సృష్టికి పూర్వం ఈ జగత్తు సజాతీయ విజాతీయ భేదాలు లేనటువంటి, నామరూపాలు లేనటువంటి, సద్వస్తువుగా ఉండేది. నామరూపాలు లేనటువంటి అదే సద్వస్తువు సృష్టి తరువాత కాలంలో కూడా ప్రకాశిస్తోంది. ఇది తత్ అనే పదానికి అర్థం. శ్రవణమననాది సాధన సంపత్తి కలిగి, ఈ మహావాక్యం అర్థం తెలుసుకోగలిగిన ముముక్షువు యొక్క స్థూల సూక్ష్మ కారణ శరీరాలకు సాక్షిగా ఉంటూ, ఈ మూడింటికీ అతీతంగా ఉండే సద్రూపమే 'త్వమ్' అనబడుతుంది. ఇప్పుడు ఈ రెండు పదాలు ఒకే అర్థాన్ని చెబుతున్నాయి. కాబట్టి రెండూ ఒకటే అని చెబుతోంది అసి అనే పదం. **జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే** అని దీని అర్థం.

**4. అయమాత్మాబ్రహ్మ:** ఇది మాండూక్యోపనిషత్తులోది. ఆ ఉపనిషత్తు అధర్వ వేదానికి సంబంధించినది. ఇక్కడ మూడు పదాలు ఉన్నాయి. 1. అయం 2. ఆత్మ 3. బ్రహ్మ. అయం అనే పదంవల్ల స్వయంప్రకాశం కలిగిన ఆత్మ యొక్క నిత్యత్వము, సత్యము అని చెప్పబడుతోంది. ఆత్మశబ్దం అహంకారం, ప్రాణం, మనస్సు, ఇంద్రియాలు వీటన్నింటికీ అధిష్ఠానమైన సాక్షిని సూచిస్తోంది. బ్రహ్మశబ్దం దృశ్యమానమైన జగత్తుకంతటికీ అధిష్ఠానంగా ఉండేది, వాస్తవమైనది, సచ్చిదానంద స్వరూపం గలది, స్వయంప్రకాశం గలది అయిన పరమాత్మను సూచిస్తోంది. మొత్తం మీద శరీరానికి, అధిష్ఠానమైన ఆత్మకి, చైతన్యరూపం గల పరబ్రహ్మకు భేదంలేదు. ఈ రెండూ ఒక్కటే **జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే.**

మహావాక్యాలను షడంగాలతో ధ్యానంచెయ్యాలి. ఇదే పరమోత్తమమైన తత్త్వము. దీన్ని తెలుసుకున్నవాడు ముక్తిని పొందుతాడు. ఉపనిషత్తులన్నీ వేదసారము అలాగే, మహావాక్యాలు ఉపనిషత్తులసారము. మహావాక్యాలను ధ్యానం చేసేవారికి తీర్థాలు, జపాలు, క్షేత్రాలు అవసరం లేదు. మహావాక్యార్థాన్ని విచారణ చెయ్యటం వల్ల వందసంవత్సరాలు ఆయువు కలుగుతుంది. అటువంటి పూర్ణాయువు

షడంగాలతో కూడిన మహావాక్యాన్ని ఒక్కసారి జపంచేసినా కలుగుతుంది. ఈ వాక్యాలన్నింటిలోకి "తత్త్వమసి" అనే వాక్యానికి అర్థం కనక తెలుసుకున్నట్లైతే, మిగిలిన వాటికి అర్థం తేలికగా తెలుస్తుంది.

కార్యమైన అవిద్యోపాధిని ధరించిన వాడు జీవుడు. కారణమైన మాయను ఉపాధిగా గలవాడు ఈశ్వరుడు. కార్యకారణ ఉపాధులు రెండూ వదిలివేసినట్లైతై, సిద్ధించేది – పరిపూర్ణబోధ. అందుకే ఈ మహావాక్యాలను సద్గురువు ద్వారా పొందాలి. వీటిని ధ్యానం చేస్తే పరిపూర్ణ అఖండ జ్ఞానం కలుగుతుంది. ఆత్మజ్ఞానానికి భిన్నమైన లౌకిక విద్యలన్నీ నశిస్తాయి. బ్రహ్మవిద్యాపరిజ్ఞానము, బ్రహ్మప్రాప్తి కలుగుతాయి. మహావాక్యోపనిషత్తులో వీటిని వివరిస్తూ – మహావాక్యాలు సామాన్యుడికి చెప్పదగినవి కావు. సత్త్వగుణ సంపన్నుడు, అంతర్ముఖుడైనవాడు, గురుభక్తికలిగిన శిష్యునికి మాత్రమే వీటిని ఉపదేశించాలి. బంధానికి మోక్షానికి అవిద్య, విద్య అనేవి రెండు కళ్ళు. కాబట్టి ముముక్షువు అనాత్మపదార్థాన్ని వదిలేసి, బ్రహ్మపదార్థాన్ని మాత్రమే తీసుకుని, విదేహముక్తి పొందుతాడని చెప్పబడింది.

అవిద్యవల్ల కనిపించే ఈజగత్తు తమోదృష్టి గలది. బ్రహ్మ మొదలు స్తంభముదాకా శరీర సమూహమంతా మనస్సే. ఈ లోకం అంతంలేనిది. వేదాలలో చెప్పిన యజ్ఞయాగాది కర్మలయందు ప్రీతినికలిగిస్తుంది. ఆత్మ లోపలా బయట కూడా ప్రకాశించే విద్యాస్వరూపుడు. ప్రకాశిస్తున్న ఆదిత్యుడేబ్రహ్మ. ఈవిషయం తెలుసుకున్నవాడు అమృతస్వరూపుడు. మహావాక్యాలకు అర్థం తెలుసుకున్నవాడు పరంజ్యోతిసుడవుతాడు. ఆదిత్యరూపంలో ఉంటాడు. నేనే "శివార్కజ్యోతిసు" అని భావిస్తాడు. అదే ముక్తికిమార్గము. ఛాందోగ్యోపనిషత్తులో ఈ విషయమంతా ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు వివరిస్తాడు.

పైంగలోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు మహావాక్యాలను వివరిస్తూ నీవు బ్రహ్మము నేను బ్రహ్మను. ఈవిధంగా మహావాక్యాలు అనుసంధానం చెయ్యాలి. అంటూ తత్త్వమసి అనే మహావాక్యానికి అర్థంచెబుతాడు. మహావాక్యాలఅర్థం విచారణ చెయ్యటమే 'శ్రవణం'. విన్నదాన్ని అనుసంధానము చెయ్యటమే 'మననము'. శ్రవణ మననాలద్వారా సంశయాలు లేకుండా ఏకాగ్రతతో మనసునిలిపి ఉంచటమే నిధిధ్యానము. ధ్యాత, ధ్యానాలను వదలి, కుండలో ఉంచిన దీపంలాగా, నిశ్చలమైన

ఏకాగ్రచిత్తాన్ని కలిగిఉండటమే "సమాధి" అటువంటి సమాధిస్థితిలో సంచిత కర్మ అంతా నశించిపోతుంది. తరువాత అభ్యాసం వల్ల వేలకొలది అమృతధారలు వర్షిస్తాయి. అందుకే యోగవేత్తలు సమాధిని "ధర్మమేఘము" అంటారు. సమాధివల్ల అన్ని వాసనలు నశించిపోతాయి. సంచితకర్మ పూర్తిగా నశిస్తుంది. అపరోక్షజ్ఞానం కలిగి, సాధకుడు జీవన్ముక్తుడవుతాడు.

**మహావాక్యాల అనుసంధానము :** మహావాక్యాల అర్థం తెలుసుకున్న తరువాత వాటిని అనుసంధానంచెయ్యాలి. ఈవిషయమంతా "ఆత్మబోధోపనిషత్తు"లో చెప్పబడింది. మహావాక్యాలన్నింటికీ అర్థం ఒక్కటే.

| | |
|---|---|
| ప్రజ్ఞానంబ్రహ్మ | – జ్ఞానమే పరబ్రహ్మ |
| అహంబ్రహ్మాస్మి | – నేనే పరబ్రహ్మనై ఉన్నాను |
| అయమాత్మాబ్రహ్మ | – నా ఆత్మయే పరబ్రహ్మ |
| తత్త్వమసి | – జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే |

అనాత్మగా ఉన్న దేహాదులన్నింటియందు ఉన్నటువంటి 'అహం' 'మమ' అనే భావానికే 'అధ్యాసము' అనిపేరు. అధ్యాసము అంటే తప్పుగా తెలుసుకోవటము, మిధ్యాజ్ఞానము అని అర్థం. విద్వాంసుడు ఈమిధ్యా జ్ఞానాన్ని 'నిరస్త' రూపంలో బ్రహ్మనిష్ఠతో జయించాలి. నిరస్త అంటే తొలగించబడినది, వెళ్ళగొట్టబడినది అని అర్థం. అహంకార మమకారాలు మిథ్య కాబట్టి, ఆమిధ్యా జ్ఞానాన్ని బ్రహ్మజ్ఞానంతో జయించాలి. శరీరము, ఇంద్రియాలు వీటికన్న వేరైనదే ప్రత్యగాత్మ. అందుచేత ఈ ప్రత్యగాత్మ బుద్ధి మొదలైన వ్యాపారాలన్నింటినీ సాక్షిగాగ్రహించి, ఆప్రత్యగాత్మయే నేను అని తెలుసుకోవాలి. ఈదేహము ఇంద్రియాలేనేను అనేభ్రాంతిని వదిలెయ్యాలి. లోకానువర్తనము (లోకాన్ననుసరించటం) దేహానువర్తనము (దేహాన్ననుసరించటం) శాస్త్రానువర్తనము (శాస్త్రాననుసరించటం) వీటిని వదిలి, శరీరమేనేను అనే భ్రాంతిని పూర్తిగా వదిలివెయ్యాలి.

సాధకుడు ఎప్పుడూ స్వాత్మలోనే స్థితుడై ఉండాలి. ఆత్మలో నివసించే వారికి మనస్సు నిలిచిపోతుంది. ఈవిషయం యుక్తి, స్వానుభవము, శ్రుతులద్వారా తెలుసుకోవాలి. శబ్దాదులను గౌరవించరాదు. ఆత్మను విస్మరించరాదు. అముక్త మార్గంలో నిద్రించరాదు. లోకవ్యవహారాలలో చిక్కుకోరాదు. సర్వదా ఆత్మధ్యానం

మాత్రమే చెయ్యాలి. దీనివల్ల అనాత్మబహిష్కరింపబడుతుంది. తల్లిదండ్రుల మలినాలతో పుట్టి, మలమూత్రాలతో నిండిన ఈదేహము అపరిశుభ్రమైనది. అందుచేత, ఈ శరీరాన్ని తనకన్న వేరుగాచేసి, నేనేబ్రహ్మను అనిభావించి కృతకృత్యుడు కావాలి. జీవాత్మ పరమాత్మలు వేరు అనేది అజ్ఞానము. ఘటాకాశం మహదాకాశంలో లయమైనట్లుగా, జీవాత్మను అఖండ భావంతో పరమాత్మలో లయం చెయ్యాలి. అప్పుడు స్వయంప్రకాశంగా ఉన్నఆత్మ తానేఅవుతాడు. అందువల్ల తనచే, తననే తెలుసుకుని దేహరూపంలో ఉన్నపిండాండాన్ని, సృష్టిరూపంలో ఉన్న బ్రహ్మాండాన్ని కూడా మలభాండంగా త్యజిస్తాడు. అనాదియైన అజ్ఞానంతో, దేహమే ఆత్మ అనేభావనతో దుఃఖాన్ని పొందుతున్నాడు. కాబట్టి దేహాదులందున్న అహం అనే బుద్ధిని ఆత్మయందు నిలిపి, సర్వదా కేవలము అద్వితీయపరబ్రహ్మ అవుతాడు.

అద్దంలో కనిపించే అంతఃపుర ప్రతిబింబంలాగా ఏ పరబ్రహ్మమందు మిథ్యా జగత్తు కనిపిస్తున్నదో, ఆ బ్రహ్మమే నేను అని నిశ్చయించుకుని, కృతకృత్యుడు కావాలి. అహంకారం లేనివాడికి అఖండ స్థితి చేకూరుతుంది. స్వయంప్రభువైన అతడు చంద్రునిలాగా విమలుడై, సంపూర్ణమైన ఆనందం పొందుతాడు. క్రియ నశిస్తే, చింత కూడా నశిస్తుంది. ఈ రకంగా వాసనాప్రక్షాళనమే మోక్షము. అటువంటి స్థితే జీవన్ముక్తి. అన్ని ప్రదేశాలలోను, ఈ జగత్తునందంతటా పరబ్రహ్మను దర్శించటమే పరబ్రహ్మ సాక్షాత్కారము. అటువంటి భావనలతోనే మనసు లోపల ఉన్న వాసనలను జయించాలి. బ్రహ్మనిష్ఠలో ఎప్పుడూ కొంచెం కూడా ప్రమాదం కలగరాదు. ఈ ప్రమాదాన్ని మహర్షులు మృత్యువుగా పరిగణిస్తారు.

నీటినిఆవరించిఉన్న నాచును ప్రక్కకునెట్టేస్తే, అది మళ్ళీవచ్చి అక్కడికే చేరుతుంది. అలాగే ప్రాజ్ఞుడు మాయను బయటకుపంపినప్పటికీ, అతడు గనక బ్రహ్మనిష్ఠ నుంచి క్రిందికి జారినట్లైతే, ఆమాయ మళ్ళీవచ్చిచేరుతుంది. దీనివల్ల అతని యోగనిష్ఠ భ్రష్టమవుతుంది. అతడుగనక ఎల్లప్పుడూ ఆత్మానుసంధానం చేస్తూ జీవించినట్లైతే, బ్రహ్మజ్ఞానాన్ని పొందుతాడు. అటువంటి వాడు జీవన్ముక్తుడు అనబడతాడు. అతడు ఈ శరీరం వదలినతరువాత కూడా ఆత్మస్వరూపుడై ఉంటాడు. భ్రాంతిలేని సమాధిచేత ఆత్మసాక్షాత్కారము కలిగినప్పుడు, అజ్ఞానము పూర్తిగా నశించి, అఖండైకసచ్చిదానందమేతాను అని ధృవీకరించుకుంటాడు.

ఈ ప్రపంచమంతా అసత్యపదార్థమే. అదంతా తనయందే ఆరోపించబడి ఉన్నది. అటువంటి ఆరోపితప్రపంచాన్ని నిరసించగా, పూర్ణుడు, అద్వయుడు, క్రియారహితుడు, అయిన పరబ్రహ్మ తానేఅవుతాడు. ఈ జగత్తంతా అసత్కల్పము, అవికల్పము అయిఉన్నది. వస్తువు ఒక్కటే. అది అవికారము. అవిశేషము. నీ రూపం కూడా అదే. అందులో నీపేరుండదు. దర్శించేవాడు, దర్శింపబడినది, దర్శనము అనే త్రిపుటి ఆ బ్రహ్మలో లేదు. ఆ బ్రహ్మము నిరామయము, నిర్విశేషము, పరిపూర్ణము, చిద్రూపము, శివము, అవిద్యారహితము, అద్వితీయము అయిఉన్నది. అటువంటి పరమాత్మలో వస్తుభిన్నరూపము ఉండదు. ఏకాత్మకమైన పరతత్త్వంలో భేదంఉండదు. అటువంటి బ్రహ్మపదార్థాన్ని నేనే.

ఈ విధంగా మహావాక్యాలను అనుసంధానం చెయ్యటమే 'శ్రవణము'. విన్న విషయాన్ని యుక్తితో అనుసంధించటమే 'మననము'. ఈ రకంగా శ్రవణ మననాదులు చేసి, నిస్సంశయంగా తెలిసిన వస్తువునందు ప్రీతిని నిలిపి, దానియందు మనస్సు నిలిపి, తదేకధ్యానం చెయ్యటమే 'నిధిధ్యాసము'. ధ్యాతను మరచి, ధ్యానాన్ని వర్జించి, ధ్యేయమైన గోచరమైన చిత్తాన్ని గాలిలేనిచోట ఉంచిన దీపంలాగా ఉంచటమే 'సమాధి'. నిర్వికల్పసమాధిలో ఆత్మగోచరాలయిన అజ్ఞానవృత్తులు ఉంటాయి. కాని అవి ఆసమయంలో తెలియబడవు. నిర్వికల్పసమాధి వేలకొలది ధర్మరూప అమృతధారలను వర్షిస్తుంది. కాబట్టి యోగవేత్తలు ఈ సమాధిని 'ధర్మమేఘము' అంటారు. వాసనలే కర్మలకు కారణం. వాసనాక్షయం జరిగినట్లైతే పుణ్యపాప కర్మలన్నీ నశించిపోతాయి. 'తత్త్వమసి' అనే మహావాక్యం సమాధి స్థితి లభించిన తరువాత ఆత్మసాక్షాత్కారాన్ని ప్రసాదిస్తుంది. కోరికలు పూర్తిగా నశించటమే వైరాగ్యము. ఆత్మయందు దాగిఉన్న చిత్తవృత్తి మళ్ళీ బయటకురాకూడదు. అదే వైరాగ్యము. దీన్నే ఉపరతి అంటారు. అలా కాకుండా పాండిత్యం వల్ల వైరాగ్యం కలగదు. వైరాగ్యం లేకపోతే జ్ఞానంకలగదు. ప్రజ్ఞ గలవాడే స్థితప్రజ్ఞుడు.

ఈశ్వరుడు తత్పదార్థమని, జీవుడు త్వమ్ పదార్థమనీ, లక్ష్యార్థభావంతో శోధన చేస్తే జీవబ్రహ్మల ఏకీభావం కలుగుతుంది. అటువంటి ఏకరూప జ్ఞానరూపంలో

ఉన్న చిన్మాత్ర ప్రవృత్తినే 'ప్రజ్ఞ' అంటారు. జీవాత్మ పరమాత్మల ఏకత్వరూపజ్ఞానమే ఆకారంగాఉన్న ప్రజ్ఞ గలవాడే 'జీవన్ముక్తుడు'. దేహము, ఇంద్రియాలే నేను అనే భావన వదలి, ఆత్మస్థితుడైన వాణ్ణి "జీవన్ముక్తుడు" అంటారు. తనకన్న బ్రహ్మము వేరుగాలేదని, మాయాకల్పిత జగన్నిర్మాణము పరబ్రహ్మ కన్న వేరుకాదని, ప్రజ్ఞతో తెలుసుకున్నవాడు "జీవన్ముక్తుడు". సాధువులు పొగిడేటప్పుడు, దుర్మార్గులు పీడించేటప్పుడు కూడా సమభావంతో ఉండేవాడే జీవన్ముక్తుడు. బ్రహ్మతత్త్వం తెలిసినవాడు అందరిలాగానే సంసారమందున్నప్పటికీ, రాగద్వేషాలకు వశంకాకుండా బహిర్ముఖుడై ఉంటాడు. ఈ విషయం బ్రహ్మవేత్తలకు మాత్రమే తెలుసు. ఈ సుఖదుఃఖాల అనుభవం అంతా ప్రారబ్ధానికి సంబంధించినది. ఈ ప్రారబ్ధాన్ని జ్ఞానికూడా అనుభవిస్తాడు.

దేహమేఆత్మ అనే భ్రాంతి ఉన్నవాడికి ప్రారబ్ధం ఉంటుంది. ఈ దేహము తానుకాదు. అని నిశ్చయించుకున్నవాడు తానే ఆత్మఅవుతాడు. ఆ పరబ్రహ్మ నిర్గుణము, క్రియారహితము, సూక్ష్మము, నిర్వికల్పము, నిరంజనము, అనిరూప్య స్వరూపము, మనోవాచామగోచరము, సత్సమృద్ధము, స్వతఃసిద్ధము, శుద్ధము, బుద్ధము, అనీదృశము. ఆ బ్రహ్మము ఒక్కటిగా అద్వయంగా ఉన్నది. పరబ్రహ్మ కన్న వేరైనది లేదు.

మహావాక్యాలను శ్రద్ధగావిని, వాటి అర్థంతెలుసుకుని, మననంచేసి, వాటిని గనక అనుసంధానం చేసినట్లైతే సాధకుడు తానే సంగరహితుడు, అంగరహితుడు, లింగరహితుడు, ప్రశాంతుడు, అనంతుడు, పరిపూర్ణుడు, చిరంతరుడు, అకర్త, అభోక్త, అవికారుడు, అవ్యయుడు, శుద్ధ బుద్ధ స్వరూపుడు అయిన పరమాత్మ అవుతాడు.



# 16. ఆత్మ

దేన్నిగురించి తెలుసుకున్నంత మాత్రంచేత జగత్తులో ఇంకా తెలుసు కోవలసినది ఏమీఉండదో అదేఆత్మ. దేన్నిగురించి తెలుసుకుంటే జగత్తులో అన్ని విషయాలు అవగతమవుతాయో అదేఆత్మ. ఈ ఆత్మ తనకు తానేసాక్షి. తనకుతానే తెలియబడుతుంది. అందుచేత ఈ ఆత్మే పరబ్రహ్మ. అంతకుమించినది, వేరైనది ఇంకొకటి లేదు. ఈ ఆత్మపురుషుడే సృష్టిస్థితిలయాలకు కారణమైనవాడు ఆద్యంతములు లేనివాడు. నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుణుడు, సత్యము నిత్యము అయినవాడు, సర్వాంతర్యామి. సర్వవ్యాపి. తలవెంట్రుకలో వెయ్యోవంతుగా అణుమాత్రుడై ఉన్నాడు. అతడు జన్మించడు, మరణించడు, శుష్కించడు, తడుపబడడు, దహించబడడు, కదలింపబడడు, ఛేదింపబడడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ అతడే సాక్షి. భూతాలను అభివృద్ధి చేసేవాడు. ఆ పరమాత్మ పరిశుద్ధుడు. అతనికి కాళ్ళు చేతులు తల మొదలైన అవయవాలు ఏవీలేవు. మమకారము లేనివాడు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు లేనివాడు. కోరికలు లేనివాడు. చింతించటానికి వీలు కానివాడు. రంగు లేనివాడు. అశుద్ధాన్ని శుద్ధంగా, అపవిత్రాన్ని పవిత్రంగా చేసేవాడు. క్రియాశూన్యుడు. నిర్వికల్పుడు. రాగద్వేషాలు లేనివాడు. ఆ పరమేశ్వరుడు ఆత్మసంజ్ఞ గలవాడు. శుద్ధుడు. ఒక్కడుగానే ఉన్నాడు. అతనితో సమానమైన వారు గాని, అతనికన్న అధికులైన వారు గాని ఎవరూ లేరు. బ్రహ్మరూపంలో సమస్త జగత్తులోను ప్రకాశించేది అతడే. విద్య అవిద్య, భావము అభావము, గురువు శిష్యుడు అనే భేదాలతో ఆ పరబ్రహ్మ ప్రకాశిస్తోంది. విద్యలేదు అవిద్యలేదు. జగత్తు అంతకన్నాలేదు. పరాపరములు లేవు. ఆత్మని పోల్చి చెప్పటానికి ఇంకొక ప్రమాణము ఏదీలేదు. ఆత్మను తెలుసుకోవటానికి దేశము, కాలము, బుద్ధి. ఇవి ఏవీ అవసరంలేదు. నేనే పరమేశ్వరుణ్ణి అనే విజ్ఞానంమాత్రం చాలు.

జాగ్రస్వప్నసుషుప్తి మొదలైన అవస్థలలో స్పష్టంగా వ్యక్తమయ్యేది, అంతరంగంలో ఎప్పుడూ నేను నేను అంటూ అనేకవిధాలుగా స్ఫురించేది, సర్వసాక్షిగా ఉండేది, సచ్చిదానందస్వరూపమైనది ఆత్మ. అది మానవుడి హృదయంలోనే ఉంది. అన్నమయకోశం నుంచి ఆనందమయకోశం వరకు గల పరంపరనే 'గుహ' అంటారు.

ఆగుహలో ఉన్నాడు కాబట్టే గుహుడు అనబడుతున్నాడు. కుండలో నీరు నిండా ఉంది. ఆ నీటిలో సూర్యుడి ప్రతిబింబం కనిపిస్తోంది. ఆ ప్రతిబింబాన్ని చూసి మూర్ఖుడు అదే సూర్యుడు అనుకుంటాడు. అలాగే భ్రమవలన బుద్ధిలో ప్రతిబింబించిన చిదంశనుచూసి అదే తన సహజరూపం అనుకుంటాడు. వివేకవంతుడు కుండని, నీటిని, ప్రతిబింబాన్ని వదలి స్వయంప్రకాశంగా ఉన్న సూర్యుణ్ణి చూడగలుగుతాడు. అలాగే జ్ఞాని ఈ మూడింటినీ ప్రకాశింపచేసే స్వయంజ్యోతి అయిన పరమసత్యాన్ని స్పష్టంగా చూడగలుగుతాడు. తన హృదయ కమలంలో ఉన్న నిత్యము, సత్యము, శాశ్వతము, సూక్ష్మరూపము అయిన పరమేశ్వరుణ్ణి గుర్తిస్తాడు. ఆత్మ వేరు నేను వేరు అనుకోవటమే బంధం. ఈ రెండూ ఒకటే అనుకోవటమే మోక్షం. ఈ విధంగా జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అని భావనచేసేవాడు, అలా బ్రహ్మాత్వభావన పొందినవాడు తిరిగి ఈ లోకంలో జన్మించడు.

**1. ఏది ఆత్మ? :** శరీరంలో వివిధ భాగాలున్నాయి. వీటిలో ఆత్మ ఏది ? ఆత్మ అంటే స్థూలశరీరమా ? సూక్ష్మశరీరమా ? కారణశరీరమా? ఏది ఆత్మ ? ఇదిఆత్మ అని చెప్పటానికి ఒక ప్రమాణం అంటూ ఏమైనా ఉన్నదా ? ఇవి మనముందుండే ప్రశ్నలు. వీటికి అనేకమంది అనేకరకాలుగా సమాధానాలు చెప్పారు. అలా అయితే వీటిలో ఆత్మ ఏది ? ఈ విషయాలు చూద్దాం.

**1. చార్వాకులు :** వేదాలు పరమేశ్వరునిచే చెప్పబడలేదు. కొంతమంది స్వార్థపరులు వ్రాసిన అభూతకల్పనలు అనినమ్మేవారు. నాస్తికులు లోకాయతులు, చార్వాకులు మొదలైన వారు. కంటికికనిపించే ప్రత్యక్షప్రమాణాన్ని తప్ప ఇంకేదీ నమ్మరు. వీరిప్రకారము కూటస్థుడైన చైతన్యం దగ్గరనుంచీ స్థూలశరీరం దాకా సమస్తమూ ఆత్మస్వరూపమే. వీరు వేదాలనునమ్మకపోయినా, ఇతరులను నమ్మించటానికి తమసిద్ధాంతం వేదప్రామాణ్యము అనికూడాచెబుతారు. వీరు "ఆత్మైవదేవమయః" అనే విరోచనుని సిద్ధాంతాన్ని ఉదహరించి దేహమే ఆత్మ అని చెబుతారు. ఇది చార్వాకసిద్ధాంతం.

**2. లోకాయతులు :** దేహమేఆత్మ అనేది చార్వాకసిద్ధాంతం. లోకాయతులు ఇంద్రియాలేఆత్మ అని చెబుతారు. స్థూలశరీరం నుంచి ఆత్మ నిష్క్రమించగానే శరీరం మరణిస్తుంది. కాబట్టి ఆత్మఅంటే శరీరంకాదు. దేహం కన్న భిన్నమైన

ఇంద్రియాలేఆత్మ. బృహదారణ్యకంలో ఒకసారి ఇంద్రియాలు తమలో ఎవరు గొప్ప అనికలహించుకున్నాయి. అని ఒకకథఉంది. దాన్ని ఉదాహరణగా చూపి, ఇంద్రియాల్లు కలహించుకున్నాయి అంటే అవి చేతనాలు. కాబట్టి 'ఇంద్రియాలే ఆత్మ' అంటారు.

**3. హిరణ్యగర్భోపాసకులు :** వీరు 'ప్రాణమేఆత్మ' అని నమ్ముతారు. చక్షురాది ఇంద్రియాలు లేకపోయినప్పటికీ, స్థూలదేహం ప్రాణమున్నంత కాలం జీవించి ఉంటుంది కాబట్టి ప్రాణమేఆత్మ అంటారు. దీనికిప్రమాణంగా 'నిద్రపోయే సమయంలో ప్రాణంమాత్రమే మేల్కొనిఉంటుంది. అని, ఇంద్రియాలు తమలో ఎవరు గొప్ప ? అని వాదించుకున్నప్పుడు ప్రాణమే జ్యేష్ఠము, శ్రేష్ఠము అని చెప్పిన శ్రుతివాక్యాలను చూపిస్తారు.

**4. ఉపాసకులు :** వీరు 'మనస్సేఆత్మ' అంటారు. ప్రాణాలకు భోక్తృత్వం లేదు అన్నింటినీ అనుభవించేది మనస్సు. కాబట్టి మనస్సేఆత్మ. మానవుల బంధమోక్షాలకు కారణం మనస్సు. తైత్తిరీయోపనిషత్తులో "ప్రాణమయకోశానికి అభ్యంతరంలో ఉన్న ఆత్మ మనోమయమైనది" అని చెప్పిన వాక్యమే వీరివాదనకు ప్రమాణము.

**5. విజ్ఞానవాదులు :** బౌద్ధులలో అనేక తెగలున్నాయి. క్షణికవిజ్ఞానవాదులైన బౌద్ధులు ప్రతిక్షణం పుడుతూ, చస్తూ ఉండే **'బుద్ధినే ఆత్మ'** అని అంగీకరించారు. మనసుకుండే విజ్ఞానానికి కారణం బుద్ధి. అంటే విజ్ఞానం నుంచే మనస్సు పుడుతోంది. అందుచేత 'బుద్ధే ఆత్మ' అంటారు. జీవాత్మ విజ్ఞానమయకోశంలో ఉంటుంది. జనన మరణాలు, సుఖదుఃఖాలు, ఈసంసారముఅంతా జీవుడిదే అని ఆగమాలు చెబుతున్నాయి. అంటూ తైత్తిరీయంలో చెప్పిన "మనోమయకోశానికి భిన్నమై దాని అభ్యంతరంలో ఉండే ఆత్మ విజ్ఞానమయము" అనేమాటను ప్రమాణంగాచూపుతారు.

**6. శూన్యవాదులు :** బౌద్ధంలో శూన్యవాదం ఇంకొకశాఖ. వీరిప్రకారం విజ్ఞానమనేది ప్రతిక్షణము పుడుతూ చస్తూ ఉంటుంది. కాబట్టి విజ్ఞానం ఆత్మ కాదు. అంతకుమించి ఇంకేమీ కనిపించటంలేదు కాబట్టి 'శూన్యమే ఆత్మ' అంటారు. సృష్టికిముందు ఈజగత్తంతా శూన్యంగాఉండేది అనే బృహదారణ్యక, ఛాందోగ్యాలను ప్రమాణంగా చూపుతారు. వేదంలో చెప్పిన 'అసత్' అనే మాటకు శూన్యము అని అర్థంచెబుతారు.

**7. వైదికులు :** వేదాలను ప్రామాణికంగా చెప్పేవారు వైదికులు. వీరి దృష్టిలో వేదాలు పరమేశ్వర ప్రోక్తాలు. వీరిప్రకారము 'ఆనందమయుడే ఆత్మ'. దీనికి ప్రమాణంగా తైత్తిరీయంలోని "విజ్ఞానమయకోశానికి అభ్యంతరంలో ఆనందమయకోశవముందున్నది. అదేఆత్మ" అనే వాక్యాన్ని, కఠోపనిషత్తులోని "ముందుగా అసద్రూపమైన జగత్తును తత్త్వరూపంగా తెలుసుకుని, తరువాత ఉపాధిరహితమైన శుద్ధతత్త్వాన్ని తెలుసుకోవాలి" అనే వాక్యాన్ని చూపుతారు. మొత్తం మీద ఆనందమయుడే ఆత్మ అనిచెబుతోంది వైదికదర్శనం.

**2. ఆత్మస్వరూపం :** ఆత్మ ఎలాఉంటుంది ? అనే ప్రశ్నకు సమాధానం లేదు. ఆత్మని చూసిన వాళ్ళెవరూ లేరు. ఆత్మయందు ఈదృక్తము (ఇలా ఉంటుంది) తాదృక్తము (అలా ఉంటుంది) అనేది ఉండదు. ఆత్మస్వరూపాన్ని మనం ఏ విధంగా అంగీకరించినా అది వేద్యమవుతుంది. ఏవిధంగానూ అంగీకరించకపోతే శూన్యమవుతుంది. కాబట్టి ఇలాఉంటుంది, అలాఉంటుంది అని చెప్పటానికి వీలులేనిదే ఆత్మ. కంటికికనిపించే పదార్థాలను ఇలాంటివి (ఈదృక్) అంటారు. కంటికి కనిపించని స్వర్గాదులను వివరించేటప్పుడు అలాంటివి (తాదృక్) అంటారు. ఆత్మ ఇంద్రియాలకు విషయంకాదు. ఇంద్రియాలచేత ఆత్మతెలుసుకోబడదు. అలా అని పరోక్షమైనది కాదు. స్వయంప్రకాశము గలది. "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ"

ఆత్మ సత్యమైనది జ్ఞానస్వరూపమైనది. అనంతమైనది. అపరిచ్ఛన్నమైనది. ఇవి పరబ్రహ్మ లక్షణాలు. పరబ్రహ్మకీ ఆత్మకీ తేడాలేదు. రెండూ ఒకటే. ముందుగా సత్యము అంటే ఏమిటో చూద్దాం. నిషేధించటానికి వీలుకానిదాన్ని, త్రోసి పుచ్చటానికి వీలులేనిదాన్ని సత్యము అంటారు. బాధితమయ్యేది, త్రోసి పుచ్చటానికి వీలయ్యేది అసత్యం. జగత్తు బాధితమవుతోంది అందుకే అది అసత్యం. ఆత్మ బాధితం కాదు. అందుకే అది సత్యం. ఇంట్లో ఉన్న వస్తువులన్నింటినీ, కంటికి కనిపించే వాటన్నింటినీ బయట పారేస్తే, ఇక ఇంట్లో మిగిలేది ఆకారం లేని ఆకాశం. అలాగే అనాత్మ పదార్థాలన్నింటినీ నిషేధిస్తే చివరకు వాటికి సాక్షిగా మిగిలేది ఆత్మ. అంటే నిషేధించటానికి వీలుకాని సత్యస్వరూపమే ఆత్మ. సాక్షిరూపంగా ఉండే చైతన్యాన్ని నిషేధించటానికి వీలుండదు అని శ్రుతులు చెబుతున్నాయి. అనాత్మ వస్తువులన్నింటినీ నేతి, నేతి అనేపదాలతో నిషేధిస్తూపోతే, అధిష్ఠాన రూపంలో చివరకి మిగిలేది

ఆత్మ. నిషేధించటానికి వీలులేనిది ఆత్మ. అసలు నిషేధించటానికి వీలైనవి ఏమిటి? ఇది అనేరూపంలో, అంటే నామరూపాత్మకంగా ఉండే సమస్తవస్తుజాలాన్ని నిషేధించాలి. ఇదం శబ్దంతో త్యజించటానికి వీలుకానిది, సాక్షిరూపంలో ఉండే ఆత్మ త్యజించటానికి వీలులేనిది, నిషేధించటానికి వీలు లేనిది. అటువంటి బాధారహితమైన సాక్షియే ఆత్మ. అంతేకాని అహంకారము మొదలైన దృశ్యజాతము ఆత్మకాదు.

ఆత్మ అనేది స్వయంగా అనుభూతి రూపం కలది కాబట్టి ఎవరికీ అనుభవింప దగిన విషయంకాదు. ఆత్మ సత్యజ్ఞాన స్వరూపం కలదికాబట్టి ఎవరికీ అనుభావ్య విషయం కాదు. స్వయంప్రకాశము కాబట్టి, జ్ఞాత జ్ఞానము అనేవి లేవు కాబట్టి - జ్ఞానానికి విషయం కాదు. ఆత్మ అనంతమైనది. బ్రహ్మయందు దేశ కాల వస్తుగతమైన పరిమితి ఉండదు. కాబట్టి బ్రహ్మఅనంతము. ముండకోపనిషత్తు చెప్పినట్లుగా బ్రహ్మము నిత్యము, వ్యాపకము, సర్వగతము, మిక్కిలి సూక్ష్మమైనది. బృహదారణ్యకంలో చెప్పినట్లుగా ఈసమస్తమూ ఆత్మయే. కఠోపనిషత్తులో "ఆత్మ ఆకాశంలాగా ఉంటూ అంతటా వ్యాపకమైనది" అని చెప్పబడింది శ్వేతాశ్వరోపనిషత్తులో "ఆత్మ నిత్యమైన వాటి కన్న నిత్యమైనది. చేతనాలన్నిటి కన్న చేతనమైనది" అనిచెప్పారు. సర్వంహ్యేతద్బ్రహ్మ ఈ సమస్తమూ బ్రహ్మమే అంటోంది మాండూక్యోపనిషత్తు. ఆత్మ సత్యమైనది అనిచెబుతోంది నృసింహఉత్తరతాపినీ ఉపనిషత్తు.

పరిచ్ఛిన్నభావం కారణంగా దేశకాల వస్తువులన్నీ బ్రహ్మంలో మాయద్వారా ఆరోపించబడ్డాయి. అంతేకాని దేశకాలాదులవల్ల కలిగే భేదాలేవీ పరబ్రహ్మలో లేవు. అటువంటి పరబ్రహ్మ అనంతత్వమే ఆత్మలో కూడా ఉంది. అందుకే ఆత్మ, బ్రహ్మము రెండూఒకటే. ఆకాశము అపరిచ్ఛిన్నమయినప్పటికీ, అందులో గంధర్వ నగరాలను ఆరోపించుకున్నట్లుగా, అనంతమైనఆత్మలో మాయవల్ల ఇవన్నీ కల్పించబడ్డాయి. ఈఆత్మ పంచకోశాలను ఉపాధిగాగ్రహించినప్పుడు జీవుడు, మాయాశక్తిని ఉపాధిగా గ్రహిస్తే ఈశ్వరుడు అవుతాడు. నిజానికి ఈశ్వరత్వం గాని జీవత్వం గాని ఆత్మకు లేవు.

**3. ఆత్మస్వభావము :** దేన్ని గురించి తెలుసుకుంటే మానవుడు బంధం నుంచి విడివడి కైవల్యాన్ని చేరుకుంటాడో, అది పరమాత్మ. అహంకారము యొక్క స్ఫురణకు

ఆధారమైన నిత్యసత్యం స్వయంగా ఒకటుంది. ఇది జాగ్రస్వప్న సుషుప్తులనబడే మూడు అవస్థలను సాక్షిగా చూస్తూ ఉంటుంది. కోశము అంటే వర అని అర్థం. శరీరంలో పంచకోశాలున్నాయని చెప్పుకున్నాం. వీటిలో స్థూలశరీరము అనబడే అన్నమయకోశం ఆత్మకాదు. సూక్ష్మశరీరంగా పిలువబడే ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము కూడా ఆత్మకాదు. కారణ శరీరంగా పిలవబడే ఆనందమయకోశం ఆత్మకాదు. పంచకోశాలలో ఏదీఆత్మ కాదు. ఆత్మ స్వయంజ్యోతి. పంచకోశాలకన్న విలక్షణమైనది. జాగ్రస్వప్న సుషుప్త్యాది అవస్థలలో సంభవించిన వాటన్నింటినీ తెలుసుకుంటుంది. మనస్సు ఉండటాన్ని లేకపోవటాన్ని, పనిచెయ్యటాన్ని తెలుసుకుంటుంది. అందుకే ఇది అవస్థాత్రయానికి సాక్షి. సత్స్వరూపం, నిర్వికారం, నిరంజనం, నిత్యానంద స్వరూపం, వివేకవంతులు ఈ ఆత్మ తమలోనేఉన్నదని గ్రహిస్తారు. ఆత్మ కంటికి కనిపించదు. చెవులకు వినిపించదు. మనస్సుతో దాన్ని తెలుసుకోలేరు. ఇంద్రియాలను సృష్టించింది ఆత్మ. ఇంద్రియాలకు శక్తినిచ్చింది ఆత్మ. అటువంటి ఆత్మను ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేరు. అందుకే ఆత్మ ఉన్నచోటికి ఇంద్రియాలు వెళ్ళలేవు. ఆత్మ అన్నింటినీ చూస్తూఉంటుంది. కాని ఎవరికీకనపడదు. ఎవరూ దీన్నిచూడలేరు. బుద్ధి మొదలైన వాటన్నింటినీ ఆత్మే ప్రకాశింపచేస్తుంది. ఆత్మస్వయంప్రకాశి. అన్నింటికీ ప్రకాశాన్నిచ్చేది ఆత్మ. కాని ఆత్మని ఏవీ ప్రకాశింపచేయలేవు. ఆత్మ ఆకాశంలాగా సర్వవ్యాపి. జగత్తంతా వ్యాపించి ఉన్నది. ఇక్కడ ఆత్మయొక్క సర్వవ్యాపకత్వాన్ని వివరించటానికి ఆకాశంతో పోల్చిచెప్పారు. అంతమాత్రంచేత ఆత్మ, ఆకాశము రెండూ ఒకటి కాదు. ఆత్మ దూరంగా ఉంటుంది, దగ్గరగా ఉంటుంది. దూరంగా ఉంటుంది అంటే అజ్ఞానులకు దూరంగా, పొందరానిదిగా ఉంటుంది. జ్ఞానులకు దగ్గరగా ఉంటుంది. వాళ్ళు ఆత్మతత్వాన్ని తెలుసుకుని ఉంటారు. శరీరంలో ఇంద్రియాలన్నింటికీ యజమాని ఆత్మ. అలాగే జగత్తులో అన్నింటికీ యజమాని ఆత్మ. ఆత్మఉన్నదనే భయంచేతనే సూర్యుడు సవ్యంగా ఉదయము, అస్తమయము చేస్తున్నాడు. అంటే సూర్యగమనం సవ్యంగా జరుగుతోంది. దిక్పాలకులు వారివిధులను నిర్వహిస్తున్నారు. గాలివీస్తోంది. సముద్రం తన చెలియలికట్టను దాటకుండా ఉంది. ఈ రకంగా చరాచర జగత్తును నియంత్రించేది ఆత్మ. ఈ ఆత్మవల్లనే అహంకారము, వస్తువులు, కష్టసుఖాలు,

అన్నీ మనకి స్పష్టంగా తెలుస్తున్నాయి. ఆకాశంలో ఉన్న సూర్యుడు తన ప్రకాశంతో ఈ జగత్తును ప్రకాశింపచేస్తున్నట్లే, ఆత్మ ఈ శరీరంలో అవ్యక్తమైన గుహలో ఉండి శరీరాన్ని ప్రకాశింపచేస్తున్నది. బాగా కాల్చిన ఇనుపముద్దలో ప్రతిఅణువులోనూ అగ్నిస్ఫుటంగా ప్రకాశిస్తూ ఉంటుంది. అలాగే ఆత్మకూడా శరీరము, మనస్సు, ప్రాణాలు, ఇంద్రియాలు చేసే పనులన్నింటితోను తనకు భాగము ఉన్నట్లుగా కనిపిస్తుంది. కాని నిజానికి ఆత్మకు కర్తృత్వము, భోక్తృత్వము రెండూలేవు. ఆత్మకి పుట్టటము, పెరగటము, క్షీణించటము లాంటి షడ్విధ వికారాలు లేవు. ఆత్మనిత్యము, సత్యము, శాశ్వతము అయినది. ఆత్మ ఎటువంటిమార్పులు పొందదు. శరీరం నశించినా ఆత్మనశించదు. అన్నింటికీ ఆధారంఆత్మ. కాని ఆత్మకు ఏ ఆధారము లేదు. అన్నింటికీ మూలంఆత్మ. అటువంటిఆత్మకు మూలం ఆత్మేగాని ఇంకేదీ కాదు.

**4. ఆత్మ పరిమాణం :** ఆత్మ పరిమాణం ఎంత ? అనే దానిలో కూడా భిన్నవాదనలున్నాయి. ఇది అణుపరిమాణమని, మధ్యమమని, మహత్పరిమాణమని రకరకాలుగా చెబుతారు. ఈ వాదనలకు శ్రుతులు, యుక్తి, అనుమాన ప్రమాణాలే ఆధారం.

**1. అణు పరిమాణం :** రామానుజ, మధ్వమతస్థులు అంటే ద్వైతులు, విశిష్టాద్వైతులు ఆత్మ అణుపరిమాణంలో ఉన్నది అంటారు. శ్వేతాశ్వరోపనిషత్తులో **వాలగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ** "ఆత్మ అనేది అత్యంత సూక్ష్మమైన నాడులలో, వెంట్రుకలో వెయ్యోవంతు గల నాడుల్లో సంచరిస్తుండటంవల్ల, దానిపరిమాణము అణువులాగా చాలాచిన్నది" అంటారు. ఈ ఆత్మ అణువుకన్న చిన్నది. ముండకోపనిషత్తులో చెప్పినట్లుగా "సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం" ప్రత్యగ్రూపమైన జీవాత్మ మిక్కిలి సూక్ష్మమైనదై, ఇంద్రియాలకు కనిపించదు. అందుచేత కేవలము విశుద్ధమైన జ్ఞానంతోనే దీన్ని తెలుసుకోవాలి. ఇది అత్యంత సూక్ష్మము, నిత్యము. తలవెంట్రుక చివరను నూరు భాగాలుగా చేసి, అందులో ఒక భాగాన్ని మళ్ళీ నూరు భాగాలుగా చేస్తే ఎంతసూక్ష్మమవుతుందో, అంతసూక్ష్మమైనది.

**2. మధ్యపరిమాణం :** జైనులలో దిగంబరశాఖ వారు "శరీరంలో నఖశిఖ పర్యంతము చైతన్యం ఉంది. కాబట్టి ఆత్మ శరీరమంతావ్యాపించి మధ్యపరిమాణంతో ఉంది. అంటారు. "దీనికి ప్రమాణం బృహదారణ్యకోపనిషత్తు". "ఈ పురుషుడు

నఖశిఖ పర్యంతము ప్రవేశించి ఉన్నాడు" రెండు చేతులు ఉన్న చొక్కాలో శరీరమంతా ప్రవేశిస్తున్నట్లే, సూక్ష్మావయవనాడుల్లో ఆత్మ ప్రవేశించి సంచరిస్తోంది. అవయవాల ఉత్పత్తినిబట్టి ఆత్మకు నియతమైన మధ్యపరిమాణం ఉంది. అందువల్ల శరీరం చిన్నదైనా, పెద్దదైనా అంటే చీమలో గాని, ఏనుగులో గాని తేలికగా ప్రవేశిస్తుంది. వీరు చెప్పేదాన్నిబట్టి ఆత్మ అవయవాలు కలిగి ఉంటుంది.

అవయువాలు ఉన్న దేనికైనా నాశనముఉంటుంది. కాబట్టి వీరి మతానన్నుసరించి ఆత్మకు నాశనమున్నది. ఆత్మ అనిత్యము.

**3. మహత్పరిమాణము :** ఆత్మ అణుపరిమాణం కాదు. మధ్యమ పరిమాణం కాదు. అంటే మహత్పరిమాణం గలది అని భావించాలి. ఇది ఆకాశంలో సర్వగతమైనది. నిత్యమైనది. అవయవాలు లేనిది.

ఐతే, వేదాంతదర్శనం ప్రకారం ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మమైనది. **"అణోరణీయాం, మహతోమహీయాం"** మహత్తులకు కూడా మహత్తైనది. అంటే చిన్న వాటికన్న చిన్నది పెద్దవాటికన్నపెద్దది. అణువురూపంలో ఉంటుంది. అదే విస్తరించి జగత్తంతా వ్యాపిస్తుంది. కాబట్టి ఆత్మపరిమాణం ఎంత ? అంటే అణువుకన్న చిన్నది. మహత్తులకన్న మహత్తైనది.

**5. ఆత్మలో రకాలు :** ఆత్మ మూడురకాలుగా ఉంటుంది. 1. గౌణాత్మ 2. మిథ్యాత్మ 3. ముఖ్యాత్మ.

ఆత్మ, ఆత్మకన్న భిన్నమైన వస్తువులు అని రెండు రకాలుగా ఉంటాయి. ఇందులో ఆత్మకన్న భిన్నమైన వస్తువులు మళ్ళీ మూడురకాలు. ఇలా ఆత్మలోగలరకాలను 'ఆత్మానందము' అనే చోట వివరించాం. కాని పాఠకుల సౌలభ్యం కోసం ఇక్కడ కూడా చెబుతున్నాం.

ఆత్మ మూడు రకాలుగా ఉంటుంది. 1. గౌణాత్మ 2. మిథ్యాత్మ 3. ముఖ్యాత్మ. సందర్భాన్నిబట్టి అర్థంగ్రహించాలి. ఇందులో పుత్రాదులు గౌణాత్మ. గౌణము అంటే అప్రధానము అని అర్థం. చీకట్లో స్థాణువుని చూసి దొంగవాడు అనుకున్నాం. ఇక్కడ రాతికున్న చోరరూపం మిథ్య. వెలుతురు ప్రకాశించగానే చీకట్లు తొలగిపోతాయి. పంచకోశాలకున్న సాక్షిరూపత్వం – మిథ్య. పంచకోశాలు

మిథ్యాత్మలు. సాక్షిఅయిన ఆత్మకు దేనిలోనూ భేదంలేదు. అందరిలోనూ ప్రతీతమవుతూ ఉంటుంది కాబట్టి సాక్షినే ముఖ్యాత్మ అంటారు. అయితే. ఏ వ్యవహారంలో ఏ రకమైన ఆత్మ అవసరమవుతుందో అదే ముఖ్యాత్మ. మిగిలిన రెండూ గౌణాత్మలు.

చనిపోయిన వాడి ఆస్తిపాస్తులు రక్షించేది కుమారుడే. అందుకే పుత్రుడు ఇక్కడ ముఖ్యాత్మ కాగా మిగిలిన రెండూ గౌణాత్మలవుతాయి. 'నేను చిక్కిపోయాను' అన్నప్పుడు చిక్కిపోయేది. సన్నబడేది శరీరము అంతేకాని పుత్రుడు కాదు. అందుచేత ఇక్కడ మిథ్యాత్మే ప్రాధాన్యత సంతరించుకుంటుంది నేను మోక్షంపొందుతాను అన్నప్పుడు నేను అనేపదానికి అర్థం చిదాత్మయైన ముఖ్యాత్మే అని గ్రహించాలి. ఇలా ఏచోట, ఏఆత్మ, ఏ వ్యవహారానికి ఉపయోగిస్తుందో, ఆ సమయంలోనే దాన్ని ఉపయోగించాలి. ముఖ్యాత్మ మీద నిరతిశయమైన ప్రీతి ఉంటుంది. మిగిలిన వాటియందు ఈరకమైన ప్రీతిఉండదు.

1. ఆత్మ 2. ఆత్మకన్న భిన్నమైన వస్తువులు అని రెండు రకాలుగా ఉంటాయి. ఆత్మకన్న భిన్నమైన వస్తువులు మళ్ళీ మూడు రకాలుగా ఉంటాయి. ఆ రకంగా మొత్తం నాలుగు రకాలుగా ఉంటాయి. అవి 1. అత్యంత ప్రీతిపాత్రమైన ఆత్మ 2. ప్రియమైన భార్యాపుత్రులు 3. ఉపేక్షించదగిన గడ్డి, రాళ్ళు మొ॥వి 4. ద్వేషించదగిన పులి మొ॥వి. ఒకేవస్తువు పరిస్థితులనుబట్టి 1. ప్రియము 2. అప్రియము 3. ఉపేక్షణీయము అవుతుంది. ఉదాహరణకు మనఎదురుగా పెద్దపులి వచ్చింది. అప్పుడు అది తప్పకుండా ద్వేషింపతగినది. 2. అదేపులి మనల్ని ఏమీఅనకుండా ప్రక్కగా వెళ్ళిపోతోంది. అప్పుడది ఉపేక్షించతగ్గది అవుతుంది. అదేపులి మనపెంపుడు జంతువనుకోండి. అప్పుడది మనకు అత్యంతప్రియమైనది అవుతుంది. ఇలా పరిస్థితినిబట్టి ఒకేవస్తువు ప్రియము. అప్రియము ఉపేక్షించతగినది అవుతుంది. లోకంలో మూడురకాల ధర్మాలున్నాయి. 1. అనుకూలరూపం 2. ప్రతికూల రూపం 3. ఉపేక్షణీయం. వీటిలో అనుకూలము ప్రతికూలము కానటువంటిది ఉపేక్షణీయం. ఆత్మ అత్యంత ప్రియమైనది. మిగిలినవన్నీ ఆత్మకు ఉపకారకాలు కాబట్టి అవి ప్రియమైనవి. అంతే. అందుచేతనే పులి మొదలైన క్రూరజంతువుల్ని ద్వేషించటం. గడ్డి, రాళ్ళు వాటిని ఉపేక్షించటం జరుగుతుంది. ఈ విషయాన్నే యాజ్ఞవల్క్యుడు

మైత్రేయికి వివరించాడు. ఇదే విషయం పురుషవిధ బ్రాహ్మణంలో కూడా వివరించబడింది. ఆత్మ అనే పుత్రుడు మిగతా అన్నింటికన్నా, ధనముకన్నా కూడా అత్యంతప్రియమైనవాడు. అంటే ఆత్మ అనేది అన్నింటికన్నా ఎక్కువ ప్రీతికరమైనది. **ఆత్మావై పుత్రనామాసి** అంటే ఇదీ అర్థం.

**6. ఆత్మఅసంగము :** ఆత్మ అనేది అసంగం. దేనిమీదా ఆసక్తి అనేది ఉండదు. పరమేశ్వర స్వరూపానికి రాగద్వేషాలు ఉండవు. అహంకార మమకారాలు అసలే ఉండవు. దేహేంద్రియాలతో చేసే పనులతో ఆత్మకు కర్తృత్వము భోక్తృత్వము ఉండవు. భ్రమాజన్యమైన బుద్ధితో తాదాత్మ్యంచెంది, ఆ బుద్ధియొక్క పరిమితులన్నింటినీ తనవిగానే భావించి, తానువేరుగా అంటే జీవాత్మగా భావిస్తుంది. ఉపాధి భేదం చేత, ఆ ఉపాధిధర్మాలు తనవిగా భాసిస్తుంది. ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా మానవ శరీరాన్ని సృష్టించిన తరువాత, నవరంధ్రాలు, దశేంద్రియాలతో కూడిన ఈ శరీరంలో నేను ప్రవేశించకపోతేఎలా అనుకుంది. మానవదేహంలో ప్రవేశించటానికి రెండు మార్గాలున్నాయి. 1. పై నుంచి 2. క్రిందనుంచి. క్రింద నుంచి ప్రవేశించటం సేవకా లక్షణము కాబట్టి, పై నుంచే ప్రవేశించాలనుకుంది. బ్రహ్మరంధ్రం ద్వారా శరీరంలో ప్రవేశించింది. అలా ప్రవేశించి ఇంద్రియాలతో సమస్తసుఖాలు అనుభవిస్తూ, వచ్చినమార్గం మరచిపోయి, పంజరంలో బంధించబడిన పక్షిలాగా, బయటకువెళ్ళేమార్గంతెలియక అలా ఉండిపోయి, అజ్ఞానంతో శరీరంతోచేసే కర్మలకన్నింటికీ తానే కర్తను, భోక్తను అని భావన చేస్తోంది. శరీరంలో నుంచి బయటకు వెళ్ళటము అంటే నవరంధ్రాలలోను ఏ రంధ్రంద్వారా వెళ్ళినా మళ్ళీజన్మించాల్సిఉంటుంది. వచ్చినమార్గంగుండా అంటే బ్రహ్మరంధ్రంగుండా బయటకువెడితేనే పునర్జన్మఉండదు.

ఈ రకంగా ఆత్మ అసంగమై ఉండి కూడా అజ్ఞానంతో ఈ కర్మ కంతటికీ తానే కర్త, భోక్త అనుకుంటోంది.

**7. అంతర్యామి :** ఆత్మ అంతర్యామి. సర్వాంతర్యామి. ఈ జగత్తులోఉన్న ప్రతి దానియందు అంతర్లీనంగాఉంటూ అన్నింటినీ నడిపిస్తూఉంటుంది. ఈ జగత్తంతా పరమాత్మ స్వరూపమే. స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తులో అన్నింటియందు అంతర్యామిగాఉండేది ఆత్మే. ఈవిషయం బృహదారణ్యకోపనిషత్తులోను, సుబాలోపనిషత్తులోను చెప్పబడింది.

ఎవడు భూమిపైనా, భూమిలోపలా కూడా ఉంటాడో, తనలో ఉన్నప్పటికీ భూమి ఎవరినిఎరగదో, ఎవరిశరీరమేభూమియో, భూమిలోపలఉంటూ ఆ భూమినినియంత్రించేవాడు ఎవరో, అతడేఅంతర్యామి. అతడే ఆత్మ. ప్రాణులు అన్నీ భూమిమీద ఉంటాయి. ప్రతిమానవుడి శరీరము భూమే. అవయవాలు భూమే కాని తనలో ఉన్న వాడిని ఈ శరీరము, అవయవాలు ఏవీ ఎరగవు. శరీరాన్ని అవయవాలను నియంత్రించేది లోపల ఉన్నఆత్మే.

జలంలోఉన్నాడు. జలంఅతన్నెరగదు. జలమేఅతనిశరీరం. జలంలో ఉంటూనే జలాన్నినియంత్రిస్తాడు. అతడేఅంతర్యామి. అతడేఆత్మ.

ఈ విధంగా పంచభూతాలలో ఉన్నాడు. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, నదులు, సముద్రాలు, పర్వతాలు, కొండలు, బండలు, పశువులు, పక్షులు, మృగాలు అన్నింటి యందు అంతర్లీనంగా ఉండి, అన్నింటినీ నియంత్రిస్తున్నాడు. కాని అవి ఏవీ అతన్నెరగవు. అతడే వాటిశరీరం. ఈరకంగా వాటన్నింటినీ నియంత్రిస్తున్న అతడేఅంతర్యామి. అతడేఆత్మ. ఈవిధంగా ఆత్మపురుషుడు చరాచరజగత్తంతా నిండిఉన్నాడు. ప్రాణమున్నవి, ప్రాణంలేనివి, చలనమున్నవి చలనంలేనివి అన్నింటి యందు ఉన్నాడు. అవేవీ అతన్నిఎరగవు. వాటిల్లోఉంటూనే వాటిని నియంత్రిస్తుంటాడు. అతడేఅంతర్యామి. అతడేఆత్మ.

**8. జ్ఞానస్వరూపం :** ఆత్మఅంటే పరమేశ్వరస్వరూపమే. ఆత్మకు పరమేశ్వరుడికీ ఏరకమైన తేడాలేదు. ఆత్మతత్వాన్ని తెలుసుకోవటము అంటే జ్ఞానసముపార్జన చెయ్యటమే. జ్ఞానమే ఆత్మస్వరూపము. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. సృష్టి స్థితి లయాలకు కారణం ఆ పరమేశ్వరుడే. ఈ జగస్సృష్టిఅంతా ఆ పరమేశ్వరుణ్ణించే జరుగుతుంది. తిరిగి అతనిలోనేలీనమవుతుంది. ఈ జగత్తుకు ఆధారమైనవాడు ఆ పరమేశ్వరుడే. ఈ విధంగా పరమేశ్వరుణ్ణి గురించి తెలుసుకోవటమే జ్ఞానము. నేనే ఆ పరమేశ్వర స్వరూపాన్ని అని తెలుసుకున్నవాడు మహాజ్ఞాని.

జగత్తులో నామరూపాలు గలదేదైనాసరే నశించితీరుతుంది. పుట్టిన ప్రతిదీ మరణిస్తుంది. అసలు ఈలోకమే మర్త్యలోకము. మరము అంటే మరణము ధర్మముగా

గలది. అందుకే మర్త్యలోకమనబడుతుంది. ఇలా జన్మించినప్రతిజీవి మరణించటం సృష్టి ధర్మం. ఈ విషయం తెలిసినవాణ్ణి దుఃఖం బాధించదు. అతడు నిత్యము శాంతంగా ఉండగలుగుతాడు. దృశ్యమానమైనజగత్తంతా ఈశ్వరనిర్మితము. జగత్తులో ఈశ్వరుడుతప్ప వేరెవరూలేరు. రెండవదిలేదు. ఈ రకమైన నిశ్చయ జ్ఞానం కలిగినట్లైతే సాధకునిలో కోరికలునశించి పరమశాంతుడవుతాడు. ఈ రకమైన జ్ఞానం కలిగినవాడు పూర్ణకాముడు. ఆప్తకాముడు. అతడు దేన్నీ కోరడు. దేనికీ ప్రలోభపడడు. లోకంలో ఎంతటివాడైనా ప్రారబ్ధాన్ని అనుభవించక తప్పదు. తాను చేసిన కర్మఫలం తానే అనుభవించాలి. అందుకే అర్హమైన కాలంలో కర్మఫలంగా కష్టాలు ప్రాప్తిస్తాయి. ఈ విషయం నిశ్చయంగా తెలిసినవాడు రాగద్వేషాలకు, ఉద్రేకాలకు లోనుగాక, నిశ్చలమైన మనస్సుతో వచ్చినకష్టాలు, నష్టాలను స్వీకరించి పరమశాంతంగా ఉంటాడు. ఈ జన్మలో మనం అనుభవించే సుఖదుఃఖాలు, జనన మరణాలు, గతజన్మలలో చేసిన కర్మఫలితాలు. ఈ విషయం తెలిసిన జ్ఞాని లౌకిక విషయాలను, భోగాలను కోరడు. తన బాధ్యతలనుండి, కోరికలనుండి విముక్తుడవుతాడు. అతడు కోరికలులేకుండా నిష్కామ్యకర్మచేస్తాడు. కాబట్టి ఆగామికర్మ అనేది ఉండదు. అసలు దుఃఖం ఎందుకు కలుగుతోంది? అని ఆలోచించగలిగితే ఈ దుఃఖం ఉండదు. తన కోరికలు తీరకపోవటం వల్ల, ఆతృతవల్ల దుఃఖం కలుగుతుంది. జ్ఞానికి ఈ విషయం తెలుసు. అందుకే అతడు ఆతృతను వదిలి శాంతుడై, కోరికలు లేనిస్థితిలో హాయిగాజీవిస్తాడు. దేహమే ఆత్మకాదు. ఈ శరీరం నేనుకాదు. నేను శుద్ధచైతన్య స్వరూపాన్ని అని తెలుసుకున్నవాడు గతాన్నిగురించి గాని, భవిష్యత్తును గురించి గాని ఆలోచించడు. నేను, నాది అనే భావం సృష్టించే పెనుతుఫానులే బంధమోక్షాలు. అహంకార మమకారాలు నిర్మూలిస్తే మోక్షం కలుగుతుంది. పిపీలికాది బ్రహ్మపర్యంతము ఉన్నదినేనే. జగత్తులో నేను తప్ప వేరెవరూలేరు. ఇలా అద్వైతభావన కలిగినవాడికి భావోద్రేకాలుండవు. ప్రాప్తించిన వాటినుంచి, ప్రాప్తించని వాటినుంచి విడివడి ముక్తుడవుతాడు. నానాత్త్వంలో మహాద్భుతంగా కనిపించే ఈ జగత్తంతా భ్రమఅనితెలుసుకుని పరమశాంతంగా జీవిస్తాడు.

భావాభావ వికారశ్చ స్వభావాత్ ఇతి నిశ్చయా ।
నిర్వికారోగతక్లేశః సుఖేనైవోప శామ్యతి ॥

నామం రూపం కలిగినది ఏదైనా సరే మార్పు చెందుతుంది. నశిస్తుంది. ఇది సృష్టి ధర్మం. ఈ విషయం తెలిసిన వాణ్ణి దుఃఖం బాధించదు. నిత్యమూ శాంతంగా ఉండగలుగుతాడు.

**ఈశ్వర స్సర్వ నిర్మాతా నేహాన్య ఇతి నిశ్చయా ।**
**అంతర్గళిత సర్వాశః శాంతః క్వాపిన సజ్జతే ॥**

దృశ్యమానమైన జగత్తంతా ఈశ్వరుడి చేతనే నిర్మించబడింది. ఉన్నది ఒకటే. రెండవది లేదు. అనే నిశ్చయజ్ఞానంగలవాడు కోరికలునశించి పరమశాంతుడై ఉంటాడు. ఈ జ్ఞానంతో అతడు దేనినీకోరడు.

**ఆపదః సంపదః కాలే దైవాదేవేతి నిశ్చయా ।**
**తృప్తః స్వస్తేంద్రియో నిత్యం నవాంఛతి నశోచతి ॥**

ప్రారబ్ధాను గుణంగా కష్టాలు, సుఖాలు, అర్హమైన కాలంలో ప్రాప్తిస్తాయని నిశ్చయంగాతెలిసిన జ్ఞాని రాగద్వేషాలకు లోనుగాక, నిశ్చలమనస్సుతో వచ్చిన సంఘటనలను ఆయాసమయాలలో ప్రసాదబుద్ధితో తీసుకుని ప్రశాంతంగా ఉంటాడు.

**సుఖే దుఃఖే జన్మ మృత్యూ దైవాదేవేతి నిశ్చయా ।**
**సాధ్యాదర్శీ నిరాయాసః కుర్వన్నపి న లిప్యతే ॥**

ఈ జన్మలో అనుభవించే సుఖదుఃఖాలు, జనన మరణాలు గతజన్మలలో చేసిన కర్మల ఫలితాలు అనే మాట నిశ్చయంగా తెలిసిన జ్ఞాని, ప్రాపంచిక విషయభోగాలను కోరడు. అతడికి బాధ్యతలు, కోరికలు ఉండవు. నిష్కామ్యకర్మలే చేస్తాడు కాబట్టి ఆగామికర్మ కూడా ఉండదు.

**చింతయా జాయతే దుఃఖం నాన్యదేహేతి నిశ్చయా ।**
**తయాహీన స్సుఖీశాంతః సర్వత్ర గళిత స్పృహః ॥**

తన కోరికలు, చింత, ఆతృత వీటివల్లనే దుఃఖం వస్తోంది. అని నిశ్చయంగా తెలిసినవాడు, ఆతృత, చింతలను, కోరికలను వదిలి శాంతుడై హాయిగా జీవిస్తాడు.

**నాహం దేహో న మే దేహః బోధోహమితి నిశ్చయా ।**

**కైవల్యమితి సంప్రాప్తః న స్మరత్య కృతం కృతం ॥**

ఈ దేహం నేనుకాదు. దేహం నాదికాదు. నేను శుద్ధచైతన్యస్వరూపాన్ని. ఈ విషయం తెలిసిన జ్ఞాని గతంలో తను చేసినవి గాని, చెయ్యనివాటిని గాని ఆలోచించడు. కేవలము తానుమాత్రమే ఉన్నానని నిశ్చయంగా తెలుసుకుంటాడు.

**ఆ బ్రహ్మస్తంభ పర్యంతం అహమేవేతి నిశ్చయా ।**

**నిర్వికల్పశ్శుచిశ్శాంతః ప్రాప్తాప్రాప్త వినిర్వృతః ॥**

పిపీలికాది బ్రహ్మ పర్యంతము జగత్తంతా నేనే ఉన్నాను. ఈ విషయం తెలిసిన జ్ఞానికి భావోద్రేకాలుండవు. ప్రాప్తించినవాటినుండి, ప్రాప్తించనివాటినుండి, సుఖదుఃఖాల నుండి విముక్తుడై శాంతంగా జీవిస్తాడు.

**నానాశ్చర్యమిదం విశ్వం నకించదితి నిశ్చయా ।**

**నిర్వాసనః స్ఫూర్తి మాత్రో న కిందివ శామ్యతి ॥**

నానాత్వంతో అద్భుతంగా కనిపించే ఈ జగత్తంతా కేవలముభ్రమ. ఈ విషయం తెలిసిన జ్ఞాని పరమశాంతుడై జీవిస్తాడు. కేవలము చైతన్యము మాత్రమే ఉన్నదని గుర్తించే కేవలానందాన్ని, ఏకత్వ అనుభూతిని పొందుతాడు.

**9. ఆనంద నిలయం :** ఆత్మ ఆనందమయమైనది. ఈ జగత్తంతా ఆనందం నుంచే సృష్టించబడుతోంది. ఆనందంతోనే వృద్ధి చెందుతున్నది. మళ్ళీ ఆనందంలోనే లీనమవుతున్నది. అంటే జగత్తంతా ఆత్మనుంచే ఉద్భవించింది. సముద్రంలో తరంగాలు అనేకానేకాలున్నాయి. అవన్నీ కలిసిలేవు విడివిడిగాఉన్నాయి. అయినప్పటికీ అవన్నీ సముద్రంలో భాగమే. అలాగే జగత్తులో మనమంతా విడివిడిగా కనిపిస్తున్నప్పటికీ, ఆత్మమాత్రమే ఉన్నది. ఈ జీవులన్నీ విడివిడిగా లేవు. అలా ఉన్నట్లుగా కనిపిస్తున్నాయి. అంతేకాని అవి ఆత్మకన్న వేరుకాదు.

అష్టావక్రగీతలో జనకమహారాజు చెబుతున్నాడు "అపారసాగరంలా ఉన్న నాలో జగత్తుఅనే నావ, మనస్సుఅనే వాయువుతో కదలింపబడినదై, కదలాడుతున్నది. అందువల్ల నాకు ఏవిధమైన అశాంతీ లేదు.

మహాసముద్రంలో తరంగాలు ఉవ్వెత్తున లేచిపడుతుంటాయి. అల్లకల్లోకం సృష్టిస్తుంటాయి. అలాగే నాలో ఈ జగత్తు ఆవిర్భవించి, వివిధ రూపాలు ధరించును గాక. దానివల్ల నాకువచ్చేఇబ్బంది లేదు. ఏరకమైన వృద్ధిక్షయాలు నాలో కలగవు. అనంతమైన సాగరంలా ఉన్ననాలో ఊహలతో కల్పించబడిన జగత్తు కనిపిస్తోంది. నేను నిత్యుణ్ణి. శాంతుణ్ణి. నిరాకారుణ్ణి. అలా కనిపించిన జగత్తు వల్ల నాకు ఏరకమైన హానిజరగదు. ఈజ్ఞానంతో నేను నిశ్చలంగా ఆనందంగా ఉన్నాను. ఆత్మఅనేది వస్తువులోలేదు. అలాఅని వస్తువుకూడా ఆత్మలో ఉండజాలదు. ఆత్మ అనంతము, అమలము, అద్వయము, కాబట్టి ఆత్మకు కోరికలు ఉండే ఆస్కారం లేదు. ఇది నిత్యశాంత స్వరూపం' ఈ జ్ఞానంతోనే సదా శాంతంగా ఉన్నాను.

**అహోచిన్మాత్ర మేవాహం ఇంద్రజాలోపమం జగత్ ।**
**అతోమమ కథం కుత్ర హే యో పాథేయకల్పనా ॥**

మహదాశ్చర్యం. మహాద్భుతం. శుద్ధచైతన్యంగా నేను మాత్రమే ఉన్నాను. ఈ జగత్తంతా నాకు గారడీలాగా కనిపిస్తోంది. అందుకే నాలో సంతోషము, విచారము అనేవి లేవు" అంటాడు.

ఈ జగత్తులో ఉన్న ఏ వస్తువూ జ్ఞానిని ఆకర్షించదు. జగత్తంతా ఇంద్రజాలంలా కనిపిస్తుంది. అందుకే జ్ఞాని ఈ జగత్తును వినోదంతో వీక్షిస్తుంటాడు. పరమేశ్వరుడు ఈ జగత్తును తన లీలా వినోదం కోసం సృష్టించాడు అంటారు. ఇది ఆ లీలా వినోదం అనే పదానికి అర్థం. అలాంటప్పుడు ఈ జగస్సృష్టి ఎందుకు జరుగుతోంది? అంటే కర్మక్షయం కాని జీవులకు కర్మక్షయం చేసి ముక్తిని ప్రసాదించాలనే ఉద్దేశ్యంతో ఈ సృష్టి జరుగుతోంది. ఈ రకంగా ఆత్మ ఆనంద నిలయము. ఆ ఆనందం అనుభవైక వేద్యము. వర్ణనాతీతము.



# 17. ఆత్మ అద్వయం

ఆత్మ ఆనందం, అద్వయంగా ఉంది. ఆ స్థితికి చేరుకున్న సాధకుడి సర్వ కోరికలు అదృశ్యమయి పోతాయి. కావలసినవన్నీ సిద్ధించే ఉన్నాయి. ఆ స్థితిలో ముక్తి పొందాలనే కోరిక కూడా హాస్యాస్పదంగానే అనిపిస్తుంది. మనస్సు మౌనంగా, శాంతంగా, నిశ్చలంగా ఉంటుంది. దుఃఖాలన్నీ మటుమాయమై పోతాయి. మనస్సు శరీరాలతో తాదాత్మ్యం తొలగిపోయి మహానంద స్వరూపమయిన కైవల్యస్థితిలో సాధకుడు శాంతంగా, నిశ్చలంగా ఉండిపోతాడు.

శాంతించిన ఇంద్రియాలతో, కోరికలు ఏవీ లేకుండా, తృప్తిగా నిత్యము ఏకాంతం అనుభవించే వాడికి యోగాభ్యాస ఫలము, జ్ఞానఫలము కూడా సిద్ధం చేస్తాయి. అతడు సత్యాన్ని తెలుసుకున్నాడు. సత్యాన్ని తెలుసుకున్న వాడికి సంతాపాన్ని కలిగించేవి ఏవీ ఉండవు. ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నది తానే అనే భావన అతనికి ఉంటుంది. లేత చిగుళ్ళయందు మక్కువ గల ఏనుగుకు వేపాకులు ఏ విధంగా అప్రియం అవుతాయో, అదే విధంగా ఆ తపోనిష్ఠుడైన జ్ఞానికి ప్రాపంచిక విషయాలు రుచించవు. గతంలో తాను అనుభవించిన విషయాలు గాని, అనుభవించని విషయాలు గాని అతని ఆలోచనలో ఉండవు. నిశ్చలమైన మనస్సుతో శాంతంగా ఉంటాడు. ఈ జగత్తులో విషయభోగాలు కోరేవారు కొందరయితే, స్వర్గసుఖాలు కోరేవారు కొందరు. ముక్తిని కోరేవారు మరి కొందరు. ఇహపర భోగాలు కాని, ముక్తిని కాని కోరకుండా, అసలు ఏ కోరికా లేకుండా, నిత్యానందంలో జీవించే జ్ఞానిదర్శనం దుర్లభం. పురుషార్థాలయిన ధర్మార్థ కామమోక్షాల యందు, జనన మరణాల యందు సమానమైన బుద్ధి గలిగి, దేనినీ కోరకుండా, ప్రాప్తించిన వాటిని స్వాగతించకుండా, నిరాకరించకుండా జీవించే మహానుభావుడు అత్యంత అరుదుగా ఉంటాడు. ఈ జగత్తు ఈ రకంగా ఉండాలని గాని, నశించాలని గాని జ్ఞాని ఎన్నడూ కోరడు. ఉన్న స్థితి మీద ప్రేమ ఉండదు. ద్వేషము ఉండదు. తన ప్రారబ్ధం ప్రకారము వచ్చిన వాటిని ఆనందంగా స్వీకరిస్తాడు. అతడు చూస్తున్నా, వింటున్నా, తింటున్నా, మాట్లాడుతున్నా, ఏ పని చేస్తున్నా, ఆనందమయమైన తన శక్తినే గమనిస్తూ నిశ్చలమైన జ్ఞానంతో సుఖంగా జీవిస్తాడు. ఈ జగత్తంతా యథార్థం కాదని అతనికి తెలుసు. ఆ కారణం చేత విషయాల మీద ఆసక్తి ఉండదు. దీనివల్ల

అతని దృష్టి భావశూన్యంగా, నిర్లిప్తంగా ఉంటుంది. అతని శారీరక కర్మలకు ప్రత్యేకత ఉండదు. ఇంద్రియాలు కూడా దేన్నీకోరి పనిచెయ్యవు.

**న జాగర్తి ననిద్రాతి నోన్మీలతి నమీలతి ।**
**అహోపరదశా క్వాపి వర్తతే ముక్త చేతసః ॥**

జ్ఞానికి జాగ్రదావస్థ లేదు. నిద్రావస్థ అంతకన్నా లేదు. కళ్ళు తెరవటం లేదు ముయ్యటం లేదు. జీవన్ముక్తుడైన అటువంటి జ్ఞాని, అన్ని వేళల యందు పరమాత్మగా మాత్రమే ఉంటాడు. సర్వకాల సర్వావస్థలలోను కోరికలతో చలించకుండా, శాంతమైన స్వస్థితిలో నిత్యతృప్తుడై జీవిస్తుంటాడు. అతను ఏ పని చేస్తున్నా, తింటున్నా, తిరుగుతున్నా, రాగద్వేషాలు లేకుండా, నిశ్చలంగా, స్వతంత్రంగా, నిత్యముక్తుడై ఉంటాడు. జీవన్ముక్తుడు ఎవరినీ నిందించడు, స్తుతించడు. దుఃఖం, సంతోషం అనేవి ఉండవు. దానం చెయ్యడు, పరిగ్రహించడు. సర్వవిషయానుభవాల నుండి విడిగా ఉంటాడు. అందము అనురాగము కలిగిన స్త్రీని చూసినా, మృత్యువును చూసినా సమబుద్ధితో శాంతంగా ఉంటాడు. సర్వత్రా ఆత్మనే దర్శిస్తున్న జ్ఞానికి సుఖదుఃఖాలలో, స్త్రీపురుషులలో, అదృష్ట దురదృష్టాలలో తేడా కనిపించదు. ఆత్మానుభవంతో సంసారం నుంచి విముక్తుడైన జ్ఞానికి కరుణ, హింస, దీనత్వం, గొప్పదనం, ఆశ్చర్యము, అలజడి లాంటివి ఏవీ ఉండవు. జీవన్ముక్తుడికి ఇంద్రియాల మీద, విషయాల మీద, ఆసక్తి, ద్వేషము అనేవి ఉండవు. ఈ రకంగా శూన్యచిత్తుడైన జ్ఞానిలో అశాంతి, శాంతి, మంచి చెడు మొదలైన మానసిక ఉద్రేకాలు, ద్వంద్వాలు ఏవీ ఉండవు. కేవలము తానొక్కడే ఉన్నట్లుగా, సంతోషాంతరంగంతో జీవిస్తాడు. అహంకార మమకారాలు లేనివాడు, కేవలము నామరూపాలు తప్ప సృష్టే లేదనే వాడు, సర్వ కోరికలు నశించిన వాడు అయిన జ్ఞాని కర్మలు చేస్తున్నా, నిజానికి ఏ కర్మలు చెయ్యడు. అతను చేసిన కర్మలకు ఫలం అతన్నంటదు.

**మనః ప్రకాశం సంమోహ స్వప్నజాడ్య వివర్జితః ।**
**దశాంకామపి సంప్రాప్తో భవేద్గళిత మానసః ॥**

మనస్సు అమనస్కం కాగా, కోరికలు, కోరికలతో చేసే పనులు, భ్రమ, స్వప్నం, తమస్సు వీటినుంచి విముక్తిపొందినజ్ఞాని అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. అది అనుభవైక వేద్యము.

# 18. ఆత్మనిష్ఠ

మనస్సును, బుద్ధిని ఆత్మయందు లయం చెయ్యటమే ఆత్మనిష్ఠ అనబడుతుంది. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. జగత్తులో పరమేశ్వర స్వరూపాన్ని మించినది లేదు. ఉన్నది ఒకటే రెండవది లేదు. అదే ఆత్మ. నేను కూడా పరమేశ్వర స్వరూపాన్నే. అసలు నేనే పరమేశ్వరుణ్ణి. నాకన్న వేరుగా ఏదీ లేదు అని నిశ్చయంగా తెలుసుకోవటమే జ్ఞానం. తరువాత మనస్సును అశాంతికి గురిచేసే ఆలోచనలను పూర్తిగా వదలివేసి, శాంతస్వరూపమైన ఆత్మను దర్శించాలి. ఆలోచనలు వదలి పెట్టటమనేది చాలా కష్టమైనపని. అంతేకాని అసాధ్యం మాత్రం కాదు. విపరీతమైన కృషి గనక చేసినట్లైతే ఆలోచనలను అరికట్టగలుగుతాం. అహంకార మమకారాలను పూర్తిగా జయించాలి. మమకారం ఎంత బాగా వ్యాపిస్తే, ఆలోచనలు దుఃఖాలు కూడా అంతబాగా విస్తరిస్తాయి. దీనిఫలితం అశాంతి. అందుకని క్రమంగా దశలవారీగా, శాస్త్రజ్ఞానమాధారంగా, గురువుగారి పర్యవేక్షణలో మమత్వ పరిధిని తగ్గించాలి. అప్పుడు ఆలోచనలు వాటంతటవే తగ్గుతాయి. మనస్సు నిశ్చలం అవుతుంది. నిర్మలమైన మనస్సులో ఆత్మజ్యోతి ప్రకాశిస్తుంది. ముందుగా ఆత్మనిష్ఠ ఎలా సాధించాలో చూద్దాం.

**ఎలా సాధించాలి :** జగత్తంతా పరబ్రహ్మ స్వరూపం అని అర్థమయింది. జగత్తులో ఉన్నది ఆ పరబ్రహ్మ ఒక్కడే. అదే నేను. నేను తప్ప ఇంకేదీ లేదు. ఈ విషయాలు శాస్త్రాలు చదవటంద్వారా, గురూపదేశం ద్వారా, ప్రత్యక్షానుభవం ద్వారా తెలుసుకున్నాడు. ఇప్పుడు కర్మలు చేసినా, చెయ్యకపోయినా ఒకటే అని తెలిసింది. క్రమేణా కర్మలయందు విరక్తి కలిగింది. కర్మలు చెయ్యటం వల్ల మోక్షంరాదు. ఈ విషయం రూఢిగాతెలిసింది. జగత్తులోఉన్నది తానొక్కడే. తనుతప్ప ఇంకెవరూ లేరు. కాబట్టి ఇతరులతో మాట్లాడటం వ్యర్థం. ఇతరులతో మాట్లాడటము అంటే, తనలో తాను మాట్లాడుకున్నట్లే. ఎందుకంటే, జగత్తులోని ప్రతిజీవి పరబ్రహ్మస్వరూపమే. తనలో తాను మాట్లాడుకోవటం పిచ్చివాడి చేష్ట. ఈ రకంగా శారీరక, వాచక, మానసిక కర్మలయందు సంపూర్ణంగా విముఖత గలగాలి. అలా కలిగి నేను ఆత్మస్థితుడనైనాను. ఆత్మనిష్ఠుడనైనాను అనే భావనకు రావాలి.

యోగవాసిష్టంలో చెప్పినట్లుగా "గతజన్మలలో చేసిన కర్మల ఫలితమే ఈ శరీరం. గతంలో ఉన్న వాసనలతో రూపుదాల్చి జీవుడైన అహంకారము మనస్సు, శరీరాల ద్వారా కర్మలు చేయిస్తుంది. ఇక్కడ జీవుడుఅంటే ఈశ్వరుని వ్యక్తస్వరూపమే. ఈశ్వరుడు ఆత్మ వేరు కావు. ఉన్నదంతాఒకటే అదే పరబ్రహ్మ" ఈ భావన కలిగినవాడు ఆత్మనిష్టుడవుతాడు. ఆత్మజ్ఞానసంపన్నుడు కావాలనుకున్నవాడు విషయ వాంఛలయందు ఆసక్తిని విడనాడాలి. అవి ప్రాణాపాయం కూడా కలగజేస్తాయి. దానికి ఉదాహరణగానే **"కురంగ, మతంగ, పతంగ, భృంగ, మీనాః"** కురంగము అంటే లేడి. సంగీతమంటే ఇష్టపడే లేడి, దాని కారణంగానే వేటకాడికి చిక్కి ప్రాణాలు కోల్పోతుంది. అలాగే ఆడుఏనుగుస్పర్శను కోరిన మగఏనుగు, నిప్పును చూసి పండు అని భ్రమపడిన మిడత, తేనేకోసం వెళ్ళి తుమ్మెద, ఎరకోసం వెళ్ళిన చేప కూడా ప్రాణాలుకోల్పోతాయి. కాబట్టి శబ్దాదివిషయాలు నన్నుఆకర్షించటం లేదు. సంకల్పవికల్పాలకు కారణమయిన మనసును నాశనంచేశాను. మనోనాశనం జరిగింది. కాబట్టి మనస్సులో ఏ రకమైన ఆలోచనలు రావు. ఇలా సంకల్పం లేకుండా ఉన్న ఆత్మను నేనే అని భావిస్తాడు. ధ్యానము, సమాధి లాంటివి చెయ్యాలా? వద్దా ? ఇదీ అనుమానం. మనసులో ఆలోచనలు తరంగాలుగా లేస్తున్నప్పుడు మాత్రమే ధ్యానము సమాధి కావాలి. మనసులో ఆలోచనలే లేనప్పుడు ఇంకా ధ్యాన సమాధుల అవసరం లేదు. జగత్తంతా పరమేశ్వర స్వరూపమని తెలిసిన జ్ఞాని అంగీకరించవలసినది, నిరాకరించవలసినది ఏదీఉండదు. అతడికి సుఖ దుఃఖాలు ఉండవు. ప్రత్యేకంగా ఒక ఆశ్రమంలో ఉండటం, ధ్యానం, మనోనియమాలు ఇవన్నీ ఆత్మస్థితి నుంచి దూరం చేస్తాయి. ఈ విషయాలు తెలుసుకున్నవాడు అన్ని రకాల సంకల్పాలను విడిచి, ఆత్మనిష్ఠుడౌతాడు. సర్వానికీ తానేసాక్షి అని తెలుసుకున్న వాడికి కులాలు, మతాలు, ఆశ్రమ ధర్మాలు ఏవీలేవు. కర్మలు చెయ్యటమే కాదు వాటిని త్యజించటం కూడా అజ్ఞానమే. ఈ సత్యాన్ని గ్రహించి, నేను కర్మ చెయ్యాలని గాని, వద్దనిగాని భావించరాదు. ఆలోచనలు వదిలి, ఆత్మయందే స్థితుడు కావాలి. ఈ రకంగా భావనచేసినవాడు ఆత్మనిష్ఠుడవుతాడు.

**ఆటంకాలు, సూచనలు :** విషయభోగాలను త్యజించటం, వాటిమీద కోరికలు పూర్తిగా నాశనంకావటం, దృశ్యమానమైన జగత్తంతా ఆత్మజ్ఞానంలో లయంకావటం. ఈ విధంగా ఐహికబంధనాలు పూర్తిగా తెగిపోవటం – ఇదే ముక్తి. ఐహికబంధనాల

నుంచి విముక్తి. చిత్తశుద్ధి కలిగిన సాధకులు ఆత్మానుభవాన్ని అప్పుడప్పుడు పొందుతుంటారు. కాని వారికి ఆత్మనిష్ఠ అనేది ఉండదు. ఇలా ఎందుకు జరుగుతున్నది? ఆత్మనిష్ఠకు అడ్డంకులు ఏమిటి ? వీటిని ఏ రకంగా అధిగమించవచ్చు. ఆ విషయాలు చూద్దాం.

**1. శాస్త్రపరిజ్ఞానం :** సాధకుడు అనేక గ్రంథాలు చదివాడు. వాటిమీద చర్చలు జరిపాడు ఉపాన్యాసాలిచ్చాడు. వాటి సారమంతా అతని మస్తకంలో పాతుకుపోయి ఉంది. ఇప్పుడు ఆ విషయపరిజ్ఞానమే మాటిమాటికీ గుర్తువస్తుంది. ఆత్మనిష్ఠకు అదే పెద్దఅడ్డంకి. ఆత్మనిష్ఠ కావాలంటే తాను చదువుకున్న శాస్త్రపరిజ్ఞానాన్ని పూర్తిగా మరిచిపోవాలి. విషయమే గుర్తుండాలి. అంతేకాని శాస్త్రాలపేర్లు మాత్రం కాదు.

**2. స్వరూపానందం :** విషయభోగాలు అనుభవించినా, ధర్మకర్మలు నిర్వహించినా, సమాధిస్థితిని అభ్యసించినా, సాధకుని మనస్సు సహజస్వరూప ఆనందస్థితిని కోరుతూ ఉంటుంది. సహజస్వరూపమనేది సర్వ విషయాలకు అతీతంగా ఉంటుంది. ప్రతిమనిషీ కోరికలు తీర్చుకోవాలని ప్రయత్నిస్తుంటాడు. అంటే కోరికలులేకుండా ఉండటానికి ప్రయత్నిస్తున్నాడన్న మాట. ఏదైనా ఒక వస్తువును కోరుకున్నప్పుడు, అనుభవించాలనుకున్నప్పుడు, మనస్సు అశాంతితో నిండిపోతుంది. అహంకారం ఆ వస్తువును పొందాలని నిశ్చయించుకుంటుంది. ఆ వస్తువు సంపాదించగానే ఎంతో ఆనందం కలుగుతుంది. అయితే ఈ ఆనందం ఆ వస్తువు పొందటంవల్ల రావటంలేదు. తన స్వభావానికి విరుద్ధమైన కోరిక లేకపోవటంతో వస్తోంది. కోరిక తీరటంవల్ల మనస్సులోని అశాంతి పోయి, శాంతి ఏర్పడుతుంది. కాబట్టి మానవుడు ఎన్ని భోగాలనుభవించినా, ధర్మకార్యాలు చేసినా, సమాధిస్థితిని అభ్యసించినా శాంతి దొరకదు. దీనికి మూలకారణం ఏదో శోధించి, దానికి సరైన విధానం అవలంబించాలి.

**3. కోరికలకతీతం :** ప్రతివాడికీ కొన్ని కోరికలుంటాయి. వాటిని తీర్చుకోటానికి అహరహము శ్రమిస్తూనే ఉంటాడు. ఆ కోరికలు తీర్చుకోవాలనే భావనతో తాను కష్టపడుతున్నాడు. ఇతరులను కష్టపెడుతున్నాడు. ఇలా ప్రతివాడు విషయభోగాల వెంట పరుగులు పెడుతున్నారు. ఎంతగా అనుభవించినా ఈ కోరికలు తీరవు. ఒక కోరిక తీరితే, దాని స్థానంలో ఇంకొకటి పుడుతుంది. దీంతో అశాంతి, అలజడి మానవుణ్ణి పట్టిపీడిస్తాయి. ఇప్పుడు మానవుడు కోరికలను త్యజించి, ఆ కోరికల

కతీతంగా నిలబడగలిగితే. మనసులో అశాంతి, అలజడి, అనే వాటికి చోటుండదు. సర్వవాసనల నుండి విముక్తుడయి శాంత నిశ్చల మనస్సుతో నిలవగలగటం కన్న గొప్పస్థితి ఇంకొకటి లేదు.

**4. ఉదాసీనత :** మానవుడి అంతరంగంలో ఉండే ఆలోచనలే కర్మలుగా వ్యక్తమవుతాయి. మనసులో కోరికలున్నవాడు వాటిని తీర్చుకోవటానికి ఏదో ఒక పని చేస్తాడు. కోరికలు లేని వాడికి ఆలోచనలే ఉండవు. ఏ రకమైనకర్మ చెయ్యడు. అతడు ఆనందమయము, అనంతము అయిన తన ఆత్మలోనే స్థితుడై ఉంటాడు. అతనికి శరీరము అనే స్పృహకూడా ఉండదు. అతడు జీవించి ఉన్నా లేనట్లే. దృశ్యమానమైన జగత్తునుచూస్తున్నా పట్టించుకోడు. అన్నింటిపట్ల ఉదాసీనంగా ఉంటాడు. ఈ స్థితినే "సహజసమాధి" అంటారు. ఇతడు కళ్ళు మూయటం తెరవటం కూడా కష్టమే ఇతడు సర్వదా ఆత్మనిష్టలోఉంటాడు.

**5. ద్వంద్వాతీతము :** రాగద్వేషాలు, సుఖదుఃఖాలు అనే ద్వంద్వాలలో చిక్కి దుఃఖాలు కోరితెచ్చుకుంటాడు. సుఖం వెనకే దుఃఖం ఉంటుంది. ఈ విషయం తెలుసుకున్న వాడు, వాటి నుంచి విడివడతాడు. ఈ రకంగా ద్వంద్వాలనుంచి విడివడిన మనస్సు ఐశ్వర్యము, కోరికలు, ముక్తిపట్ల కూడా ఉదాసీనంగానే ఉంటుంది. కాబట్టి ద్వంద్వాల నుంచి విముక్తి పొందినవాడు సర్వదా ఆత్మనిష్ఠలో ఉండగలుగుతాడు.

**6. వైరాగ్యం :** విషయవాంఛలు లేనిస్థితినే వైరాగ్యము అంటారు. ఎప్పుడైతే వైరాగ్యం వచ్చిందో, అప్పుడు ఇంకా కోరికలనేవి ఉండవు. మనసు పరమశాంతంగా ఉంటుంది. అటువంటి వాడు సర్వదా ఆత్మనిష్ఠలో ఉంటాడు.

**7. బీజనాశనం :** కోరికలున్నంత కాలము బుద్ధిలో వాటిని స్వాగతించటం, వ్యతిరేకించటం అనే భావాలుంటాయి. వస్తువులను గురించి ఆలోచిస్తే వాటిమీద రాగం ఏర్పడుతుంది. రాగం నుంచే కోరికలు పుడతాయి. కోరికల నుంచి క్రోధము, క్రోధము నుంచి భ్రమ, భ్రమ నుంచి – విభ్రమము, విభ్రమము వల్ల – బుద్ధినాశనము జరుగుతుంది. అంటే వివేకాన్ని కోల్పోతాడు. సంసారమనే వృక్షానికి కోరికలే బీజాలు. కర్మలవల్ల విషయాల మీద రాగంఏర్పడుతుంది. విషయాలు పొందలేకపోతే ద్వేషం వస్తుంది. అందుకే ద్వంద్వాలకు అతీతంగా సంచరించగలిగినవాడు ఆత్మ నిష్ఠుడవుతాడు.

**8. మోహత్యాగం :** జగత్తు మీద వ్యామోహమున్న వారు, అందులోని బాధల ననుభవించి, జగత్తును త్యజిస్తారు. అందుచేత మోహాన్ని త్యాగం చేసినవారు బాధలకు లోను కార్రు. లోకంలో దేహాన్ని తనదిగా భావించేవాడు, మోక్షాన్ని కోరేవాడు ఇద్దరూ ఒకటే. వీరి మధ్య తేడాలేదు. మోక్షంకావాలనుకునే వాడు జ్ఞానీ కాదు, యోగి కాదు. కేవలం బాధామయుడు. కాబట్టి వీటన్నింటినీ త్యజించినవాడే ఆత్మనిష్ఠుడౌతాడు.

**9. మరుపు :** సాధకుడు తాను చదువుకున్న శాస్త్రాలు, గురువు ఉపదేశాలు, వేదవేదాంగాలు అన్నీ మరచిపోవాలి. అపరోక్ష జ్ఞానం కలగటానికి అవన్నీ సాధనాలు. అపరోక్షజ్ఞానం కలిగిన తరువాత వాటన్నింటినీ మరచిపోవాలి. ఏరు దాటిన తరువాత తెప్పతో పనిలేదు. అలా కాకపోతే సాక్షాత్తు త్రిమూర్తులే నీకు గురువులైనా నీకు ఆత్మానుభవం సిద్ధించదు.

**10. నిరంతర దృష్టి :** ఆత్మనిష్ఠుడు కావాలంటే నిరంతరము ఆత్మ మీదనే దృష్టి నిలపాలి. సత్త్వరజస్తమో గుణాలు లేనప్పుడు మనస్సు శుద్ధమవుతుంది. శుద్ధమయిన మనస్సు విషయాలు, ఉద్రేకాలు పొందదు. పరమశాంతంగా ఉంటుంది. అందుకే మనస్సు నిశ్చలమైనప్పుడు పూర్ణము, నిత్యము అయిన ఆత్మను సాధకుడు తన స్వరూపంగా గ్రహించగలుగుతాడు. అజ్ఞానంవల్ల కల్పించబడిన దేహము, ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సు మొదలైన ఉపాధుల నుంచి విముక్తిచెంది ఆత్మ అఖండము, పూర్ణము అయిన మహాకాశంలాగా ప్రకాశిస్తుంది, జగత్తులో ఉపాధి భేదంచేత ఆత్మ అనేకరూపాలుగా కనిపిస్తోంది. ఉపాధులను గనక తొలగించి చూసినట్లైతే, మిగిలేది పరబ్రహ్మ మొక్కటే. బ్రహ్మ నుండి స్తంబం దాకా ఉన్న ఉపాధులన్నీ మిధ్య. కాబట్టి సాధకునిలో ఉన్నఆత్మ పూర్ణము, ఏకము అయినది. భ్రమతొలగిపోతే, మిగిలినఅధిష్టానం స్పష్టంగాకనిపిస్తుంది. భూతంకనిపిస్తే స్తంభం కనిపించదు. భ్రమ ఉంటేనే భూతం కనిపిస్తుంది. వివేకంతో కూడిన బుద్ధి వికసించగానే భ్రమతొలగిపోతుంది. భూతంఅదృశ్యమవుతుంది. భూతానికి ఆధారమైన స్తంబంమాత్రమే కనిపిస్తుంది. అసలు ఉన్నది స్తంబంమాత్రమే. ఈ జగత్తంతా ఆత్మస్వరూపమే. త్రిమూర్తులు, త్రిశక్తులు, అంతా ఆత్మస్వరూపమే. ఆత్మ కాక రెండవది ఏదీలేదు. పైన, క్రింద, ప్రక్కన, లోపల, బయట సర్వత్ర వ్యాపించి ఉన్నది ఆత్మే. సముద్రంలో అలలు, కెరటాలు, నీటిబిందువులు, గాలిబుడగలు,

తుంపర్లు అన్నీ సముద్రమే. అంతా నీరే. అలాగే జగత్తులో కనిపించేదంతా ఆత్మస్వరూపమే. ఇంద్రియాల చేత గుర్తించబడే జగత్తు బ్రహ్మము. దీనికి అతీతంగా ఉన్నది బ్రహ్మమే. మట్టితో తయారయిన కుండ, కూజా వంటి వాటికి మూలము మట్టి. అలాగే ఈ జగత్తుకు మూలము, ఆధారము పరబ్రహ్మ. కంటికి కనిపించే ద్వైతమంతా భావన మాత్రమే. ఆకాశంలాగానే పరబ్రహ్మ కూడా నిర్వికల్పము, నిరంజనము, నిర్మలము, అనంతము. దీనికి బాహ్యాభ్యంతరాలు ఉండవు. ఆత్మ ఏకము, అద్వయము, స్వయము. స్వయంగా జీవుడు బ్రహ్మ. జగత్తుగా కనిపించే ఈ విశాలవిశ్వమంతా బ్రహ్మమయము. ఇది ఆ పరబ్రహ్మ కన్న వేరు కాదు.

శరీరం శవంతోసమానం. ఈ శరీరాన్ని ప్రేమతో చూసినంత వరకు జనన మరణాలు తప్పవు. సంసారబంధనాలు తప్పవు. పరిశుద్ధమైన ఆత్మస్వరూపమే తాను అని తెలుసుకున్న జ్ఞాని సదా ఆత్మనిష్ఠుడై తానే స్వయంగా పరబ్రహ్మ అవుతాడు.

**11. ఆత్మవిచారం :** శాస్త్రాలు చదవటం ద్వారా, గురూపదేశాలు వినటం ద్వారా సముపార్జించిన జ్ఞానంతో, ఆత్మవిచారణతో ప్రత్యక్షజ్ఞానం పొందాలి. ఈ జగత్తంతా మిథ్య. కేవలము భ్రాంతివల్లనే ఇలా కనిపిస్తోంది. చీకట్లో తాడును చూసి పాము అని ఊహిస్తున్నాము. అందుకే అది పాములాగా కనిపిస్తోంది. అంటే అధిష్టానం కన్న వేరుగా కనిపిస్తోంది. ఈ విషయాన్ని జ్ఞానులు గుర్తించరు. ఎందుకంటే అది మిథ్య, భ్రాంతి అని వారికి తెలుసు. త్రాడును చూసి పాము అనుకునేది అజ్ఞాని. అవిద్య వల్ల ఈ రకంగా భావనచేస్తాడు. కంటికికనిపించే జగత్తు యొక్క మూలమంతా మనస్సులోనే ఉంది. మనస్సు నశిస్తే ఈ భావన నశిస్తుంది. కాబట్టి అంతరాంతరాళాల్లో ఉన్న ఆత్మమీద దృష్టిని నిలిపి మనసును ఏకాగ్రం చెయ్యాలి. అందుకే సమాధిస్థితిలో ఉన్నవారు బ్రహ్మతత్త్వాన్ని పూర్ణంగా గ్రహించగలుగుతారు. దీనికి కారణం వారిమనసు శుద్ధము, నిర్మలము అయిఉండటమే. సమాధిస్థితిలో అనంతమయిన పరబ్రహ్మతత్త్వాన్ని, సాధకుడు తన హృదయంలో చూడగలుగుతాడు. ఆ పరబ్రహ్మ అజరము, అమరము, అయిన ఏకైక వస్తువు. దానికి పేరు లేదు. గుణం లేదు. అది నిత్యము, సత్యము, శాశ్వతము అయినది. ఇంతవరకు సముపార్జించిన జ్ఞానంతో వాసనాబంధనాలు ఛేదించి, సచ్చిదానందస్వరూపము, అద్వయము, ఏకము అయిన ఆత్మను తన హృత్పద్మంలోనే దర్శించగలుగుతాడు. ఈ విధంగా ఆత్మవిచారణ చేసినందువల్ల ఆత్మనిష్ఠ కలుగుతుంది.

# 19. ఆత్మసాక్షాత్కారము

సాధకుడు మనసా వాచా కర్మణా "నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని" అనే విషయం తెలుసుకోవటమే ఆత్మసాక్షాత్కారము. సాధకుడు తననుగురించి తాను తెలుసుకోవటమే స్వరూపజ్ఞానము. జగత్తంతా నాలోనే ఉంది. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని. సృష్టి స్థితిలయాలన్నీ నా నుంచే జరుగుతున్నాయి. చరాచర జగత్తులో ఉన్నది నేను ఒక్కడినే. నేను తప్ప వేరుగా ఏదీలేదు. ఉన్నదిఒక్కటే. అదే పరబ్రహ్మ. అదే నేను. ఈ జగత్తంతా నా నుంచే సృష్టింపబడి మళ్ళీ నాలోనే లయంఅవుతోంది. అనేవిషయం తెలుసుకోవటమే ఆత్మసాక్షాత్కారము. ఈ విషయాలు శాస్త్రాలు చదివి కాదు. అనుభవం ద్వారా తెలుసుకోవాలి. ఆత్మసాక్షాత్కారాన్ని గురించి మహోపనిషత్తులో వివరించటం జరిగింది.

**1. ఆత్మసాక్షాత్కారము ఎలా జరుగుతుంది ?** మన ముఖం ఎలా ఉందో చూసుకోవటానికి అద్దంముందు నుంచున్నాం. అయితే అద్దమంతా దుమ్ము కొట్టుకుని ఉంది. అందుచేత మన ప్రతిబింబం అద్దంలో సరిగాకనిపించదు. ఇప్పుడు ఒక పాతగుడ్డ తీసుకుని అద్దం మీద దుమ్మును తుడిచేస్తే, అద్దం పరిశుభ్రంగా నిర్మలంగా ఉండి, అందులో ప్రతిబింబం కనిపిస్తుంది. నిర్మలమైన అద్దంలో ప్రతిబింబం స్పష్టంగా కనిపించినట్లే, నిర్మలమైనమనస్సులో పరమాత్మస్వరూపం గోచరిస్తుంది. కాబట్టి ఆత్మసాక్షాత్కారము కావాలంటే మనోమాలిన్యం తొలగిపోవాలి. భ్రమలన్నీ నశించిపోవాలి. మోక్షద్వారానికి ద్వారపాలకులు నలుగురు

1. ఇంద్రియ నిగ్రహము 2. విచారణ 3. సంతుష్టి 4. సజ్జన సాంగత్యము

ఇందులో ఇంద్రియ నిగ్రహము అంటే శమదమాలు. అంతరింద్రియ నిగ్రహము బాహ్యేంద్రియ నిగ్రహము. ఈ నలుగురిలోనూ ఏ ఒక్కరినైనా గట్టిగా పట్టుకున్నట్లైతే, మిగిలిన ముగ్గురూ వశమవుతారు. అంటే వీటిలో ఏ ఒక్కటి మనం పూర్తిగా ఆచరించినా మోక్షం సిద్ధిస్తుంది. కాబట్టి సర్వప్రయత్నాలచేత, సమస్తాన్ని త్యజించైనా, సరే, ఎవరో ఒకరిని గట్టిగా పట్టుకోవాలి. ముందుగా శాస్త్రాభ్యాసము, సజ్జనసాంగత్యము వీటిని బాగా అలవరచుకోవాలి. వీటివల్ల వివేకము వృద్ధి అవుతుంది. శాస్త్రవాక్యము, సద్గురువాక్యము, అనుభవము ఈ మూడూ ఒకేసారి

ఎవరి ఆత్మలో నిరంతరము దర్శనమిస్తాయో, అతడికి పరమాత్మ దర్శనం కలుగుతుంది. ఆత్మ సాక్షాత్కారమవుతుంది.

**2. తూష్ణీంస్థితి :** సంకల్పము, ఆశ, విషయాలు ఈ మూడింటినీ ప్రతిక్షణము పరిత్యజిస్తున్నట్లైతే, సాధకుడు పరమపావనమైన అమనస్కస్థితిని సాధిస్తాడు. మనసు అకర్మగా ఉండే స్థితినే తూష్ణీంస్థితి అంటారు. ఆ స్థితే సమాధి. అది కేవల భావస్థితి. శుభప్రదమైన ఉత్తమనిర్వాణము. మనస్సులో సంకల్పాలను పరిత్యజించి, మూగవాడిలాగా, అంధుడిలాగా, జడుడులాగా సంచరించాలి. ఈ సర్వమూ ప్రశాంతము, అజము, ఏకము, ఆదిమధ్యాంతరహితము, ప్రకాశస్వరూపము, దృశ్యభావన అనేది లేని అనుభవరూపము. సమస్తము ఓంకారరూపము అనటం కూడా భ్రాంతియే. దృశ్యమానమైన ఈ జగత్తంతా చిద్వస్తువే. ఇక్కడ చైతన్యం తప్ప వేరేదీలేదు. ఈ రకంగా సర్వదా కడుజాగరూకతతో, నిండుమనసుతో, ఆత్మ అద్వితీయము అని తెలుసుకుని, జగత్కార్యాన్ని ఆరాధిస్తూ, తరంగాలు లేని సముద్రంలాగా, నిశ్చలుడైఉండాలి. వాసనలన్నింటికీ తృణానికి అగ్నివంటిదైన ఆత్మతత్త్వబోధయే సమాధి. అంతేకాని సమాధి అంటే మౌనంగా కూర్చునే తూష్ణీం స్థితి కాదు. జాతిరత్నానికి ఏ కోరికా ఉండదు. అయినప్పటికీ, దాని నుంచి కాంతులు వెదజల్లుతున్నట్లుగా, పరబ్రహ్మతత్త్వము సత్తామాత్రము అయినప్పటికీ, బ్రహ్మ భావంగా ఈ జగత్తు సర్వము ప్రకటమవుతున్నది. ఆత్మయందు కర్తృత్వమున్నది. అయితే ఇచ్ఛలేకుండా ఉంది కాబట్టి అకర్త. సన్నిధానమాత్రంచేత కర్తకూడా అవుతున్నది. ఈ రకంగా పరస్పర విరోధంగల కర్తృత్వరూపంలో ఉన్న ఈ చమత్కారము ఏ పరబ్రహ్మలో ఉన్నదో తెలుసుకుని, ఆ బ్రహ్మన్నే ఆశ్రయించి, ఆ బ్రహ్మలోకంలోనే స్థిరంగా ఉండాలి. నేను నిత్యము అకర్తనై ఉన్నాను. అనే భావనతో ఒప్పేది, పరమామృతము అనబడేది, అయిన సమత్వమే జ్ఞానికి విశేషించి మిగిలేది. సత్తామాత్రస్థితిలో ఉన్నవారే మహాగుణవంతులు. వారిస్థితి శాశ్వతమైనది. మహోన్నతమైనది. అటువంటివాడు ఆకాశంలో పూర్ణచంద్రునిలాగా ప్రసన్నవదనంతో ఉంటాడు. అతడే శాంతి, సుఖము, సమభావము సిద్ధించిన మహానుభావుడు. అట్టివారు రాత్రిపూట పద్మంలాగా ఆపదలు వచ్చినప్పుడు కృంగిపోరు. శిష్టాచారులు పోయే మార్గంలో సత్ప్రవర్తనతో సంతోషంగా ఉంటారు. అటువంటి వారి దేహాలు

మైత్రి మొదలైన సద్గుణాలతో శోభిల్లుతుంటాయి. వారు సమత్వభావం గలవారై, సర్వదా సాధువృత్తి గలవారై, సమరసులై, మార్పు లేకుండా ఉంటారు. నిర్మలాత్ములైన మహాత్ములు సముద్రంలాగా, మర్యాదను అతిక్రమించకుండా ఉంటారు. సూర్యునిలాగా నియమాలను విడిచిపెట్టకుండా ఉంటారు. నేను ఎవరిని? ఈ సంసారమాలిన్యము ఏ రకంగా వ్యాపించింది? అని ప్రాజ్ఞుడు, సాధువు అయిన మహాత్ముని సన్నిధిలో చక్కగా విచారణ చెయ్యాలి. నిషిద్ధ కర్మలు చేయరాదు. ఆచార్యులతో కలిసినివశించరాదు. సర్వసంహార సంహర్త అయిన మృత్యువును హేళన చేయరాదు. ఈ దేహము, ఎముకలు మాంసము, రక్తము, మలము, మూత్రము మొదలైన అశోభనమైన పదార్థాల సమూహమే అని గ్రహించి, దేహం మీద మమకారాన్ని వదిలిపెట్టి, సకల జీవులను ముత్యాలహారంలోని దారంలాగా చిన్మాత్ర పరమాత్మగా భావించి దర్శించాలి.

**3. దుఃఖాతీతస్థితి :** ఇది కావాలి, ఇది వద్దు అనుకోవటం ఇదే మనసుయొక్క స్వరూపము. ఆత్మ అటువంటి మనస్సుకన్న వేరుగాఉంటుంది. సద్గురువులు, శాస్త్రాలు చూపిన మార్గాన్ని అనుసరిస్తూ, స్వానుభవంలో "నేను చిద్గగనుడైన బ్రహ్మనే అయిఉన్నాను" అని తెలుసుకొని శోకంలేనివాడు కావాలి. జీవన్ముక్తుడి దుఃఖాతీతమైన శక్తి అద్భుతమైనది. పదునైనకత్తితో నరుకుతున్నప్పటికీ, కలువపూలు పైన చల్లుతున్నట్లుగా భావిస్తాడు. నిప్పులలోకాలుస్తున్నప్పుడు మంచిగంధం చల్లదనాన్ని అనుభవిస్తాడు. బాణవర్షము కురిపించినప్పుడు, బాగా ఎండగాఉన్న సమయంలో జలయంత్రం నీళ్ళుజల్లుతున్నట్లుగా భావిస్తాడు. శిరచ్ఛేదనచేస్తే సుఖంగానిద్రిస్తాడు. వాగ్బంధనముచేస్తే మౌనముద్రగాభావిస్తాడు. శ్రోత్రాన్ని బంధిస్తే నిశ్శబ్దస్థితి అనుభవిస్తాడు. అటువంటి మహోన్నతమైనస్థితి ఉపేక్షతో ప్రాప్తించదు. దృఢమైన వైరాగ్య సాధనతోనే అటువంటిస్థితి సిద్ధిస్తుంది. గురువాక్యం చేత, సంపాదించిన అనుభవంతో, పరిశుద్ధమైన బుద్ధితో నిరంతరము అభ్యాసం చెయ్యటం చేత ఆత్మను చక్కగా దర్శించవచ్చు. ఆత్మసాక్షాత్కారం పొందవచ్చు.

**4. శాంతస్వరూపుడు :** దిగ్భ్రమపూర్తిగా పోయినప్పటికీ, గతంలోలాగానే దిక్కుల యొక్క జ్ఞానము ఉంటుంది. అలాగే బ్రహ్మజ్ఞానంవల్ల ఈ జగత్తులేదు అని తెలిసినా, జగత్తు కళ్ళకుకనిపిస్తూనే ఉంటుంది. అలాకనిపించినప్పటికీ జగత్తు లేదనే

భావించాలి. ఆత్మసాక్షాత్కారానికి సిరిసంపదలు సాయంచెయ్యలేవు. స్నేహితులు, బంధువులు, శరీరకష్టము, తీర్థాలుసేవించటం, క్షేత్రదర్శనము ఇవేవీ సాయపడవు. కేవలము పరమాత్మలో తన్మయంపొందే మనసుకలవాడే ఆత్మసాక్షాత్కారం పొందగలడు. దుఃఖాలు, తృష్ణ, భరించలేనిచింతలు అన్నీ మహాత్ములకు సూర్యకిరణాలవల్ల అంధకారంనశించినట్లుగా నశిస్తాయి. క్రూరజంతువులు, సాధుజంతువులు శమము గల మహాత్ముని కన్నతల్లి దగ్గరికి చేరినట్లుగా, అత్యంతవిశ్వాసంతో దరిచేరతాయి. మానవుడు శమమువల్ల పరమసుఖము అనుభవిస్తాడు. అటువంటి పరమసుఖము అమృతపానంవల్లకూడా సిద్ధించదు. లక్ష్మీదేవిఅనుగ్రహంతో లభించదు. శుభాశుభాలను విని, అనుభవించి, దర్శించి, తెలుసుకుని, సంతోషము, దుఃఖము పొందనివాడు శాంతస్వరూపుడు.

ఎవరి మనసైతే మరణకాలంలోను, ఉత్సవసమయంలోను, యుద్ధంలోను కూడా వ్యాకులతచెందకుండా స్వచ్ఛంగా నిర్మలంగా ఉంటుందో అతడు శాంతుడు. తపస్సంపన్నులయందు, బుద్ధిశాలులయందు, యజ్ఞాలుచేసినవారియందు, చక్రవర్తులయందు, బలవంతులయందు, సద్గుణసంపన్నులయందు, శమము కలిగి ఉండేవాడే ప్రశస్తిని పొందుతాడు. సంతోషామృతపానంతో ఎవరు శాంతచిత్తులవుతారో, అట్టివారే పరమపదాన్ని పొందుతారు. ప్రాప్తించనివాటికోసం దుఃఖించనివాడు, ప్రాప్తించినవాటితో తృప్తిచెందేవాడు, భేదభావాలు లేనివాడు, సంతుష్టుడు. అంతఃపురంలో నివసించే సాధ్వి ఏ రకంగా లభించిన వాటితో తృప్తి చెంది ఆనందంగా ఉంటుందో, అలాగే ప్రాప్తమైన వాటితో సంతృప్తిచెందేవాడు జీవన్ముక్తుడవుతాడు. అదే స్వరూపానందము.

**5.కృతకృత్యుడు :** ప్రాజ్ఞుడు దేశకాలమానాలను అనుసరించి, ఏది సుఖమో, అది ఎలా దొరుకుతుందో, విచారిస్తుంటాడు. ఈ రకంగా ఆత్మలో విశ్రాంతి దొరికేదాకా మోక్షపదానికి దారి వెతుకుతూ ఉండాలి. సంసారార్ణవమునుండి బయటపడి, తురీయస్థితిలో విశ్రాంతి పొందేవాడు గృహస్తుగాని, సన్యాసిగాని జీవించి ఉన్నా, మరణించినా, అతడు కృతకృత్యుడు. అటువంటి జీవన్ముక్తుడు కర్మలు చేసినందువల్ల ప్రయోజనంలేదు. చెయ్యకపోతే అపకారంజరగదు. మందరపర్వత రహితుడు, క్షోభరహితుడు, అయిన క్షీరసాగరంలాగా, ఆత్మస్థితుడు ఆనందంగానే

ఉంటాడు. దృశ్యపదార్థాలన్నీ పరమాత్మగానే దర్శించే జ్ఞానము కలిగినప్పుడు, దేశ, కాల, వస్తు, పరిచ్ఛేదశూన్యము, శుద్ధచిద్రూపము అయిన స్వస్వరూపం ప్రకాశిస్తుంది. అదే ఆత్మసాక్షాత్కారము. ఈ రకంగా నువ్వుభావించిన రూపంలో ఆత్మ ప్రత్యక్ష మవుతుంది. స్తావరజంగమాత్మకమైన సమస్తదృశ్యప్రపంచము, గాఢనిద్రలో స్వప్నంలాగా, ప్రళయకాలంలో నశించిపోతుంది. ఆత్మ, ఋతము, సత్యము, పరబ్రహ్మము అనే పదాలు పరబ్రహ్మకు వ్యవహార సంజ్ఞలు.

**6. ఇంద్రజాలము :** కంకణము అంటే బంగారమే కాని ఇంకొకటి కాదు. కడియము అన్నా బంగారమే. అలాగే ఈ జగత్తు అంటే పరమాత్మే అవుతుంది. జగత్తే బ్రహ్మ. బ్రహ్మమే జగత్తు. ఆ చిత్‌బ్రహ్మమందే జగత్తుగాకనిపించే ఇంద్రజాలము విస్తారంగా ఉంది. దృశ్యము యొక్కస్థితే ద్రష్ట అయిన ఆత్మకు బంధము. ద్రష్ట దృశ్య పదార్థాల వల్ల బద్ధుడవుతున్నాడు. దృశ్యము యొక్క అభావంతో జీవన్ముక్తుడవుతున్నాడు. నేను, నీవు అనే బాధలతో ఉన్నదే జగత్తు. మనస్సు వల్లనే జగత్తు అనే ఇంద్రజాలము విస్తరించి ఉన్నది. మనస్సు అనే ఈ కల్పితభావం ఎంతకాలం ఉంటుందో అంతకాలం మోక్షం రాదు. స్వయంభువు అయిన పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు. అతనియొక్క మానసికసృష్టియే ఈ జగత్తు. అందుచేతనే నామరూపాలు గల దృశ్యమాన జగత్తంతా మనస్సే అయి ఉన్నది. మనస్సు లేకపోతే ఈజగత్తులేదు. మనస్సుఅనేది హృదయం యొక్క లోపలగాని, బయటగాని, ఇంకోచోట గాని లేదు. దానికి సత్యమైనఉనికిలేదు. విషయసంకల్పమే మనస్సు. సంకల్పమే మనస్సు యొక్క రూపము. ఎక్కడ మనస్సు ఉంటుందో, అక్కడ సంకల్పముంటుంది. సంకల్పము, మనస్సు రెండూ వేరు కాదు. సంకల్పాలన్నీ నశించినప్పుడు పరమాత్మస్వరూపమే మిగులుతుంది.

**7. చిదాకాశము :** నేను, నువ్వు, జగత్తు మొదలైన దృశ్యభావమంతా నశించి పోగా, మిగిలినస్థితే కైవల్యము. అదే ఆత్మస్థితి. ప్రళయం సంభవించినప్పుడు జగత్తంతా నాశనమై పోతుంది. అప్పుడు సృష్టికి పూర్వం ఉన్న శాంతిరూపమైన పరమేశ్వర స్వరూపమే మిగులుతుంది. ఈ సృష్టికి పూర్వము ఉన్నది ప్రళయము. అటువంటి ఆత్మభానుడు ఎన్నడూ అస్తమించడు. సర్వదా తేజోవంతుడై ఉంటాడు. ఆ పరమాత్మ అజుడు. అంటే జన్మ లేనివాడు. అతడే దేవుడు ఏ రకమైన దోషము

లేనివాడు. అతడే సర్వకర్త. సర్వస్వరూపుడు. ఎక్కడ నుండి వాక్కులు వెనక్కి తిరిగి వస్తుంటాయో, దేనిని ముక్తపురుషులు తెలుసుకుంటున్నారో, దాన్నే ఆత్మ అంటారు. ఆకాశాలు మూడున్నాయి. 1. చిత్తాకాశము 2. చిదాకాశము 3. దహ్రాకాశము. వీటిలో చిదాకాశము అత్యంత సూక్ష్మమైనది. మనసు ఒక చోట నుండి వేరొకచోటికి పోయేటప్పుడు, ఆ మధ్యసమయంలో రెప్పపాటుకాలంలో అనుభవమయ్యే ఆనందమే చిదాకాశము. రెండుదృశ్యాల మధ్య ఉన్న ఉనికియే చిదాకాశము.

**8. జగత్తుభ్రమ :** సర్వసంకల్పాలు త్రోసిపుచ్చిన స్థితిలో స్థిరంగాఉన్నప్పుడు సర్వాత్మకమైన శాంతిపదం పొందగలడు. ఔదార్యము, సౌందర్యము, వైరాగ్యములతో కూడిన పరమపదఆనందస్థితే సమాధి. దృశ్యము లేనేలేదు అనే భావనతో రాగద్వేషాలు నశిస్తాయి. ఆ సమయంలో మహత్తరమైన స్వరూపానందం కలుగుతుంది. అటువంటి స్థితే సమాధి. దృశ్యములేదు అనేదే నిజమైనజ్ఞానము. అదే కేవలభావము. చిదాత్మక విజ్ఞేయము అదే కైవల్య స్థితి. అంతకన్నా మిగిలినదంతా మిథ్య. మదించినఏనుగు ఆవగింజలో బంధించబడింది. చిన్నదైన చెట్టుతొర్రలో ఒకదోమ సింహాలగుంపుతో యుద్ధంచేసింది. తామరపూసలో మేరుపర్వతం పెట్టబడింది. ఆ తామరపూసను తుమ్మెద మింగేసింది. ఇవన్నీ అసంభవాలు. భ్రమతో కూడిన వాక్యాలు. ఈ జగత్తుకూడా అలాంటిదే. ఈ జగత్తుకు అస్తిత్వంలేదు. రాగద్వేషాలతో దూషితమైనచిత్తమే సంసారము. ఆ చిత్తము ఎప్పుడు రాగద్వేష రహితం అవుతుందో, అప్పుడు సంసారనివృత్తి జరుగుతుంది. మోక్షంసిద్ధిస్తుంది.

మనసుతో భావింపబడినవాడై జీవుడు దేహవాసన కలిగి ఉంటాడు. దేహవాసన పోయిన తరువాత, అతడు దేహధర్మాలకు అంటుకోడు. మనసుకు గొప్పశక్తి ఉంది. అది ఒక కల్పముకాలాన్ని క్షణంగా చేస్తుంది. అలాగే ఒకక్షణాన్ని కల్పంగా చేస్తుంది. ఈ సంసారమంతా మనోవిలాసం మాత్రమే. దుష్ప్రవర్తన వదిలిపెట్టని వాడు, అశాంతుడు, కేవలము ప్రజ్ఞాబలంతో ఆత్మసాక్షాత్కారం పొందలేడు. ద్వంద్వ రహితమై, నిర్గుణమై, సత్యమై, చిద్ఘనమైనట్టి బ్రహ్మానందాన్ని, తన ఆత్మరూపంగా తెలుసుకున్నవాడు, ఎన్నటికీభయపడడు. ఉత్తమోత్తమమైనది. మహత్తరమైనది, తేజోమయమైనది, కళ్యాణకారకమైనది, శాశ్వతమైనది, సర్వజ్ఞము, పురాణము,

సనాతనము, సకలదేవతల చేత ఆరాధింపబడునది, అయిన పరమేశ్వర స్వరూపాన్ని గురించి తెలుసుకున్నవాడు దేనికీభయపడడు. అతడికి భయమనేది ఉండదు.

**9. నిశ్చలమైన బుద్ధి :** 'మమ' 'నమమ' ఈ రెండు పదాలే బంధమోక్షాలకు హేతువులు. మమ అనుకున్న జీవుడు బద్ధుడవుతాడు. నమమ అనుకున్నవాడు ముక్తుడవుతాడు. చేతనాచేతనాత్మకమైన ఈజగత్తు జీవేశ్వరాది రూపంలో ప్రకాశిస్తోంది. ఈసృష్టిఅంతా పరమేశ్వరసంకల్పం. జాగ్రదవస్థ నుంచి మోక్షము వచ్చేదాకా సంసారము జీవకల్పితమై ఉన్నది. నాచికేతాగ్ని మొదలు యోగము వరకు ఉన్నటువంటి మతాలన్నీ ఈశ్వరుని విషయంలో భ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. పొరపాటు పడుతున్నాయి. చార్వాకం నుండి, సాంఖ్యందాకా జీవభ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. అందువల్ల ముముక్షువులు జీవేశ్వర సిద్ధాంతంలో బుద్ధిని ప్రవేశింపనీయరాదు. నిశ్చలమైన బుద్ధితో బ్రహ్మతత్త్వ విచారణ చెయ్యాలి. అన్వయ, వ్యతిరేక సిద్ధాంతాల ద్వారా ఇతడు జ్ఞాని. అతడే శివుడు. అతడే హరి. అని తెలుస్తుంది. సద్గురువు యొక్క కరుణ లేకపోతే విషయత్యాగం చాలాకష్టం. తత్త్వదర్శనం దుర్లభం. సహజస్థితి మరీదుర్లభము.

**10. భేదభావన :** ఈశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు అనే జ్ఞానంకలవాడు, సర్వకర్మలను త్యాగంచేసినవాడు, అయిన యోగికి ఆత్మస్థితి సహజంగానే కలుగుతుంది. మానవుడు ఈ జగత్తులో దేవభావాన్ని దర్శించినట్లైతే, అతనికి భయం కలుగుతుంది. సచ్చిదానందమనే జ్ఞాననేత్రము సర్వవ్యాపకమైనది. ప్రకాశించే సూర్యుణ్ణి గ్రుడ్డివాడుచూడలేడు. అలాగే అజ్ఞాని సచ్చిదానందాన్ని దర్శించలేడు. 'ప్రజ్ఞానమే బ్రహ్మ' ఆ బ్రహ్మము సత్యజ్ఞానాది లక్షణాలుగలది. అటువంటి బ్రహ్మమును గూర్చిన జ్ఞానంవల్లనే మానవుడు అమృతుడుఅవుతున్నాడు. పరాపరరూపమైన పరబ్రహ్మ సాక్షాత్కారమైన తరువాత, మానవుని హృదయగ్రంథులు విడిపోతాయి. సర్వసంశయాలు నశించిపోతాయి. అన్నికర్మలు క్షీణిస్తాయి. కాబట్టి అనాత్మ అనే సంకల్పాన్ని పరిత్యజించాలి. జగత్తువిషయంలో నిర్వికారుడై ఉండాలి. అంతర్ముఖుడై కేవలము సంవిన్మాత్రపరుడై (అన్నీ తెలిసినవాడై) ఉండాలి. భ్రమవల్ల ఎడారిలో ఎండమావులు కనిపిస్తాయి. కాని అవి మృగతృష్ణలు. అలాగే జాగ్రస్వప్న సుషుప్తులకు సంబంధించిన జగత్తంతా ఆత్మస్వరూపంకన్న వేరుకాదు.

**11. త్యాగం :** లక్ష్యాలక్ష్య బుద్ధులనుత్యజించి కేవలము ఆత్మమాత్రుడుగా ఎవడుఉంటాడో, అతడు సాక్షాత్తు ఈశ్వరుడు. అతడే ఉత్తమమైన బ్రహ్మజ్ఞాని. సర్వానికీఅధిష్ఠానము పరబ్రహ్మమే. అది ఉపమానములేనిది, అవాంగ్మానస గోచరమైనది, నిత్యము, సర్వగతము, సూక్ష్మాతిసూక్ష్మము, అవ్యయము అయి ఉన్నది. ఈ జగత్తు సర్వశక్తిమయుడగు పరమేశ్వరుని విలాసముగా ఉన్నది. సంశయాసంశయాలతో ఈ సంసారము అశాంతి పొందుతోంది. మనోవ్యాధి చికిత్సకు ఒక్కటే ఉపాయం. ఏ వస్తువు మీద ప్రీతిఉన్నదో, దాన్ని త్యజిస్తూ వెళ్ళాలి. అప్పుడే మోక్షం సిద్ధిస్తుంది. స్వాధీనములో ఉన్నది, ఏకాంతరహితమైనది అయిన ఇష్టమైనవస్తువును పరిత్యజించటానికి ఇష్టపడనివాడు కీటకంతో సమానుడు.

**12. మనస్సే కల్పన :** చిత్తాకాశంలో వాసనారూపంలోఉన్న రాత్రినశించిన తరువాత, చిదాదిప్రకాశంవల్ల చంద్రకళ (జీవభావము) వెలవెలబోతుంది. విషయాలు అనే దృశ్యసంబంధాలు లేనటువంటిది, సామాన్య రూపంలో సర్వవ్యాపకము, అనిర్వచనీయము, అయిన చైతన్యమే ఆత్మ. అదేపరమేశ్వర స్వరూపము. ఈ సమస్తము నిత్యమై, సత్యమై, అక్షయమైన బ్రహ్మమేఅయిఉన్నది. మనస్సు అనే పేరుగలకల్పన ఇంకొకటి ఏదీలేదు. ఈ జగత్తులో ఏదీజన్మించటం లేదు మరణించటంలేదు. అందువల్ల షడ్భావవికారాలు కనిపిస్తున్నప్పటికీ, వీటికి అస్తిత్వము ఏమాత్రంలేదు. ఏకముగాఉన్నది, తేజోరూపము, స్వస్వరూపము, సర్వసామ్రాజ్యము, అవ్యయము, చైతన్యానుపాతరహితము, చిన్మాత్రము అయిన బ్రహ్మమే ఇక్కడఉన్నది. అటువంటి నిజమైన, వ్యాపకంగా ఉన్న, శుద్ధమైన, చిన్మాత్రంగాఉన్న, నిరుపద్రవమైన, శాంతశమ పూర్ణ నిర్వికారమైన, చిదాత్మ యందు మనసు విహరిస్తుంది. తన స్వభావానికి అనుగుణమైన వాటిని కల్పించుకుని, అన్ని దిక్కులకు పరుగెడుతుంది కాబట్టే దీన్ని మనస్సు అన్నారు. ఈ మనస్సు సంకల్పం చేతనే సిద్ధిస్తుంది.

**13. అమనస్కస్థితి :** అసంకల్పము అనేశస్త్రంతో ఈచిత్తాన్ని ఛేదించాలి. అప్పుడు సర్వరూపము, సర్వగతము, శాంతము అయిన పరబ్రహ్మ ప్రాప్తిస్తుంది. లోకవిషయభావనను పూర్తిగావదిలెయ్యాలి. పరబ్రహ్మను గురించే ఆలోచించాలి. మనోనిగ్రహం కలిగి ఉండాలి. శాంతమనస్కుడై ఉండాలి. మనస్సు మ్రింగివేయబడిన

స్థితి. అదే అమనస్కస్థితి. అదే బ్రహ్మపదము. పరమమయిన పురుషప్రయత్నాన్ని ఆశ్రయించి, చిత్తాన్ని అచిత్తంగాచేసి,. హృదయాకాశంలో ఆత్మను ధ్యానించాలి. జ్ఞానము అనే చక్రాయుధంతో మనస్సును సంకోచంలేకుండా ఛేదించాలి. అప్పుడు కోరికల రూపంలో ఉన్నశత్రువులు నిన్నుబంధించలేవు. నేను నాది అనేసంకల్పమే మనస్సు. అటువంటి సంకల్పాలు లేకుండాచేసి, నిస్సంకల్పము అనే కొడవలితో మనస్సును ఛేదించాలి. శరత్కాలంలో ఆకాశంలోపట్టిన మేఘాలు, వేగంగా వీచిన గాలులవల్ల చిన్నాభిన్నమై పోయినట్లుగా, చక్కని ఆత్మవిచారంతో మనస్సును అమనస్కం చెయ్యాలి. అదే మనస్సుఅంతర్ధానం అయినస్థితి. అమనస్కస్థితి.

**14. విచారణ :** ప్రళయకాలపవనాలు వీచినప్పటికీ, సముద్రాలన్నీ ఏకమైనప్పటికీ, ద్వాదశాదిత్యులు ఒక్కసారే ప్రకాశించినప్పటికీ, మనోనాశనమైన వారికి ఏ రకమైన చింతాఉండదు. మోక్షసామ్రాజ్యమనేది సంకల్పరాహిత్యం వల్లనే వస్తుంది. మనసు ఎప్పుడూ చలనంలేకుండా ఉండదు. అగ్నికి ఉష్ణముధర్మము. అలాగే మనసుకు చంచలత్వంధర్మము. చిత్తాన్ని ఆధారంగా చేసుకుని ఉన్నది, చంచలముగా ఉన్నది అయిన స్పందనశక్తే మనోసంబంధమైన చిత్తశక్తి. ఈ జగదాడంబరము అంతా మనసుకు సంబంధించినది. చలనరహితమైన మనస్సు అమృతమయము. అది తపస్సు. దాన్నే మోక్షముఅంటారు. మనసు యొక్క చంచలత్వమే వాసనారూపమయిన అవిద్య. ఈ అవిద్యని విచారణద్వారా నశింపచెయ్యాలి.

**15. అవిద్యానాశనము :** పురుష ప్రయత్నాన్ని ఆశ్రయించి, శుద్ధమైన చిత్తంతో మలినచిత్తాన్ని జయించాలి. మనసును నిగ్రహించాలిఅంటే దానికి మనసే సమర్ధవంతమైనది. మనసును మనసుద్వారానే నిగ్రహించాలి. ఒక వీరుణ్ణి గెలవాలంటే ఇంకొక వీరుడేకావాలి. సంసారమనే సాగరంలోచిక్కి ఆశఅనే గ్రహంతో పట్టుకోబడినవాడికి అతని శుద్ధమనస్సే నావగాఉంటుంది. వివేకమైన మనస్సుతో బంధరూపంలో ఉన్న పాశాన్నిఖండించి, సంసారసాగరం నుంచి నిన్ను నువ్వే రక్షించుకోవాలి. సాధకుడు తననుతానే ఉద్ధరించుకోవాలి. అంతేకాని ఇతరులు ఎవరూ కాపాడలేరు. తనలోపల జనించిన ఇష్టాన్ని ప్రాజ్ఞుడు నశింపచేసుకోవాలి.

దాంతో అవిద్యనశిస్తుంది. భోగవాసనలు వదిలి, భేదభావన తిరస్కరించి, భావాభావములు పూర్తిగా పరిత్యజించి, నిర్వికల్పుడైనవాడు సుఖిస్తాడు. అనుభవానికి వచ్చే వేటికీ నీలోపల అవకాశంఇవ్వవద్దు. ఇదే మనోనాశనము. అవిద్యానాశనము.

దృశ్యములందు విశ్వాసము, ప్రీతి విడిచిపెట్టటమే మోక్షము. దృశ్యములందు ప్రీతి, విశ్వాసము కలిగిఉండటమే దుఃఖము. అవిద్యఅనేది లేనేలేదు. అయినప్పటికీ, అష్టప్రజ్ఞల యందు అవిద్య కనిపిస్తోంది. నామమాత్రంగా ఉన్న ఈ అవిద్య సమ్యక్ ప్రజ్ఞగలవారి యందు అసలుఉండదు. సమ్యక్ప్రజ్ఞ సిద్ధించేదాకా అవిద్య అమాయకుడైన జీవిని తన వెంట తీసుకుపోయి దుఃఖాలనే ముళ్ళపొదలలో పడేస్తుంది. సమ్యక్ ప్రజ్ఞగలవారిని ఈ అవిద్య ఏమీ చెయ్యలేదు. మోహకారకమైన కోరికలున్నంతవరకు అవిద్య వెంటాడుతూనే ఉంటుంది. పరతత్త్వాన్ని అవలోకించిన వెంటనే అవిద్య నాశనమవుతుంది. సర్వగతమైన జ్ఞానాన్ని దర్శించినట్లైతే, అవిద్య తనకు తానే నశించి పోతుంది. అవిద్య నశిస్తే ఆత్మసాక్షాత్కారము జరుగుతుంది ఈస్థితి రావాలంటే సంకల్పాలు పూర్తిగానశించాలి.

**16. నేనే పరతత్త్వాన్ని :** "నేను బ్రహ్మము కాదు" అనే ఆలోచనతోనే మనసు బంధించబడుతోంది. సర్వమూ బ్రహ్మమయమే అనే దృఢసంకల్పంతో మనస్సు విముక్తమవుతుంది. నేను కృశించిన వాడను. దుఃఖించిన వాడను. కోరికలతో బంధించబడినవాడను. కాలుచేతులు గలవాడను. అనేభావంతో జీవుడు బద్ధుడవుతున్నాడు. నేను దుఃఖినికాను. నాకుదేహంలేదు. బంధము లేదు. అనే భావాలతో జీవి విముక్తుడవుతున్నాడు. నేను మాంసంకాను. ఎముకలుకాను. దేహము కన్న వేరైనవాడను, నేను పరతత్త్వాన్ని అని అంతరంగంలో నిశ్చయించుకున్న వాడు అవిద్యారహితుడై ఆత్మసాక్షాత్కారము పొందుతాడు. అనాత్మ యందు భావన చెయ్యటం చేత అవిద్య కల్పించబడింది. పురుషప్రయత్నం తీవ్రం చేసి, భోగేచ్ఛను దూరంగా వదలి, నిర్వికల్పుడై, సుఖవంతుడు కావాలి. ఈ రకంగా అమనస్కుడైన జ్ఞానికే ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది.



# 20. ఆత్మానుభవము

ఆత్మసాక్షాత్కారము పొందినవాడు ఎలా ఆలోచిస్తాడు? అనే విషయాన్ని తేజోబిందు ఉపనిషత్తు చెబుతోంది. అతడికి ఆత్మసాక్షాత్కారమైంది. తానే పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. తానుతప్ప ఈజగత్తులో వేరెవరూలేరు. ఉన్నది ఒక్కటే అదేపరబ్రహ్మ. అదేతను. కాబట్టి, "నేను పరబ్రహ్మస్వరూపుణ్ణి, జ్ఞానరూపుడను, పరముడను, కేవలముశాంతరూపుడను, చిన్మయుడను, నిత్యరూపుడను, శాశ్వతుడను, సత్యరూపుడను, నేను కలిసి ఉన్నాను, నేను విడిచి ఉన్నాను. సర్వజీవస్వరూపుడను. చిదాకాశమయుడను.

నేను సత్పరానందరూపుడను. చిత్పరానంద రూపుడను. అవాఙ్మానస గోచరుణ్ణి. వాక్కుకు మనస్సుకు అందని వాణ్ణి. ఆత్మానందరూపుడను. సత్యానందరూపుడను. ఆత్మారాముడను. నేనేఆత్మను, నేనేసదాశివుడను. ఆత్మప్రకాశరూపుడను. ఆత్మజ్యోతిని ఆదిమధ్యాంతరహితుడను, ఆకాశసదృశుడను. నిత్యశుద్ధుడను, చిదానందుడను, సత్తామాత్రుడను. నిత్యబుద్ధుడను. ఏకసచ్చిదానందమును. సర్వాతీతుడను. రూపాతీతుడను. పరమైన ఆకాశవిగ్రహుడను. భూమానంద స్వరూపుడను. భాషాహీనుడను, సర్వాధిష్ఠానరూపుడను. దేహభావం లేనివాడను. చింతలులేనివాడను. చిత్తవృత్తులు లేనివాడను. చిదాత్మైకరసుడను. ద్రుగ్రూపుడను. పూర్ణరూపుడను. నిత్యతృప్తుడను. నేనే బ్రహ్మను. సర్వము నేనే. చైతన్యము నేనే, జడము నేనే. ఆకాశ స్వరూపుడను నేనే. ఆత్మను నేనే. నేను ఎవరిలాగానో ప్రకాశిస్తుంటాను. నేను శరీరంలాగాభాసిస్తాను.

నేను శిష్యునిలాగా భాసిస్తాను. లోకత్రయాశ్రయుడను. త్రికాలాతీతుడను. వేదాలచే ఉపాసింపదగినవాడనునేనే. శాస్త్రాలతో నిర్ణయింపబడేవాడను, చిత్తంలో ఉన్నవాడను. నేనులేనిది ఎక్కడాలేదు. నేను బ్రహ్మను. సిద్ధుడను, నిత్యశుద్ధడను. నిర్గుణుడను. కేవలము ఆత్మరూపిని. నిరాకారుడను. కేవలము బ్రహ్మమాత్రుడను. అజరుడను, అమరుడను. నాకునేనే ప్రకాశిస్తాను. నాకునేనే సదాత్మకుడను. స్వయంగా ఆత్మయందున్నాను. నాకుపరాగతినేనే. స్వయంగా భుజిస్తాను. స్వయంగా క్రీడిస్తాను. స్వయంగా జ్యోతిస్వరూపాన్ని. స్వయంగా మహారూపాన్ని. నా ఆత్మలో నేనే క్రీడిస్తాను.

నా ఆత్మయందే అన్నీ చూస్తాను. స్వాత్మయందు సుఖాసీనుడనై స్వాత్మమాత్రావశిష్టుడనై ఉంటాను. స్వచైతన్యంలో స్వయంగాఉంటాను. స్వాత్మ రాజ్యంలో సుఖమందురమిస్తాను. స్వాత్మసింహాసనము నుండి స్వాత్మకన్న ఇతరమైన దాన్ని చింతించను.

చిద్రూపమైన బ్రహ్మను. చిదానంద స్వరూపుడను. అద్వయుడను. నేను ఆనంద ఘనుడను. నేను కేవలము బ్రహ్మను. నేను ఎప్పుడూ సర్వశూన్యుడను. ఆనందవంతు డను. నిత్యానంద స్వరూపుడను. ఆత్మాకాశుడను. హృదయాకాశంలో చిదాదిత్య స్వరూపుడను నేనే. ఆత్మచే, ఆత్మయందు తృప్తుడను. అరూపుడను. అవ్యయుడను. నిత్యము ముక్తస్వరూపుడను. ఆకాశముకన్న మహాస్వరూపుడను. ఆద్యంతములు లేనివాడిని. సర్వప్రకాశరూపుడను. సత్తామాత్ర స్వరూపుడను. శుద్ధమోక్ష స్వరూపుడను. సత్యానంద స్వరూపుడను. జ్ఞానానంద ఘనుడను. విజ్ఞానమాత్ర రూపుడను. సచ్చిదానందలక్షణుడను. ఈసర్వజగత్తు బ్రహ్మముమాత్రమే. బ్రహ్మకన్న వేరైనది ఏదీలేదు. అదే నేను. సచ్చిదానందస్వరూపుడను. సనాతనమైన బ్రహ్మను నేనే. నీవు, అతడు అనేవి నాకన్న వేరుగా లేవు. నేనే పరమశివుడను.

నేను అతిభావస్వరూపుడను. నాకు సాక్షిత్వంలేదు. నేనే సనాతనమైన ఆత్మను. ఆదిశేషుడునేనే. నామరూపాలులేనివాడను. ఆనందవిగ్రహుడను. ఇంద్రియాభావ రూపుడను. సర్వాభావరూపుడను. బంధమోక్షాలు లేనివాడను. శాశ్వతఆనంద విగ్రహుడను.

చైతన్యమాత్రుడను. అఖండైకరసుడను. అవాఙ్మానసగోచరుడను. సుఖవంతుడను. అన్నిప్రదేశాలయందు పూర్ణుడను. భూమానందమయుడను, తృప్తిరూపుడను. ఉత్కృష్టమైన అమృతరసుడను. అద్వితీయుడను, సత్తును, అసత్తును. నేనేబ్రహ్మను. సంశయము లేదు. సర్వశూన్యస్వరూపుడను. సకలాగమములందు గోచరుడను. ముక్తుడను. మోక్షరూపుడను. నిర్వాణసుఖస్వరూపుడను.

సత్యవిజ్ఞానమాత్రుడను. సన్మాత్రుడను. సదానందుడను. తురీయాతీతరూపు డను. నిర్వికల్పుడను. అజుడను. రాగము లేనివాడను. నిరంజనుడను. శుద్ధుడను. బుద్ధుడను, నిత్యుడను, విభుడను. ఓంకారానికి అర్థరూపాన్ని. నిష్కళంకమైన చిదాకార స్వరూపాన్ని. నేను అనేది లేదు. అతడు నేను కాదు. నేను ఏ స్వరూపము కాదు. నిర్వ్యాపార స్వరూపుడను. నిరంజనుడను. నిరాభాసుడను. నేనుఅంటే మనస్సును

కాదు. ఇంద్రియాలుకాదు. బుద్ధికాదు, వికల్పముకాదు, దేహత్రయముకాదు, అవస్థాత్రయముకాదు, తాపత్రయముకాదు, ఈషణత్రయముకాదు. నాకు శ్రవణం లేదు. మననంలేదు. సజాతీయములేదు విజాతీయములేదు.

మనోరూపముఅసత్యము. బుద్ధిఅసత్యము. అహంకారముఅసత్యము. నేను నిత్యుడను. శాశ్వతుడను. దేహత్రయము, కాలత్రయము, గుణత్రయము అంతా అసత్తే. నేను సత్యాత్మకుడను. శుచియైనవాడను. శ్రుతము, వేదము, శాస్త్రము, అంతా అసత్తే. నేనొక్కడనే చిదాత్మకుడను. సత్యము, మూర్తిత్రయము అంతా అసత్తే. సర్వభూతాలుఅసత్తు. సర్వతత్త్వాలుఅసత్తు. నేను సర్వమూవ్యాపించిఉన్నాను. నేనేశివుడను.

గురువులేడు శిష్యుడులేడు. మంత్రంలేదు తంత్రంలేదు. దృశ్యములేదు దృక్కులేదు. నేనుమాత్రమేఉన్నాను. చింత్యమైనది, న్యాయమైనది, హితమైనది ఏదీలేదు. ప్రాణాలన్నీఅసత్తే. భోగాలుఅసత్తే. చూడబడేది, వినబడేది, అంతా అసత్తే. కార్యము అకార్యము అసత్తే. నష్టమైనది ప్రాప్తమైనది కూడా అసత్తే.

సుఖంలేదు దుఃఖంలేదు. పూర్ణంలేదు అపూర్ణంలేదు. ధర్మంలేదు అధర్మం లేదు. స్వరూపములేదు. అంతాఅసత్తే నేనుసన్మాత్రుడను "ఆత్మసాక్షాత్కారం" పొందిన వాడు ఈ విధంగా ఆత్మానుభవం పొందుతాడు అని చెబుతోంది **తేజోబిందు ఉపనిషత్తు.**

**'అష్టావక్రగీత'**లో అష్టావక్రుడు చెప్పిన విషయాలన్నీ విన్న జనకమహారాజు ఆత్మసాక్షాత్కారం పొందిన తరువాత తన అనుభవాన్ని చెబుతాడు.

సత్యాన్ని గురించిన జ్ఞానంఅనే శ్రావణంతో నాహృదయాంతరాళాలలో ముళ్ళలా ఉన్న భ్రమలన్నీ తొలగించగలిగాను.

**క్వధర్మః క్వచవాకామః క్వచార్థః క్వవివేకితా ।**
**క్వద్వైతం క్వచవాద్వైతం స్వమహిమ్ని స్థితస్యమే ॥**

నాకు ఆత్మసాక్షాత్కారం కలిగింది. నా ఆత్మలో నేను స్థితుడనై ఉన్నాను. అలాంటి నాకు ధర్మంఏమిటి? అధర్మంఏమిటి? కోరికలెక్కడ? ఐశ్వర్యంఎక్కడ ? ద్వైతమెక్కడ?

అద్వైతం ఎక్కడ ?

**క్వభూతం క్వభవిష్యద్వా వర్తమానమపి క్వదా ।**

**క్వదేశః క్వచవానిత్యం స్వమహిమ్ని స్థితస్యమే ॥**

నాకు భూతకాలంఎక్కడ ? భవిష్యత్తుఎక్కడ ? అసలు వర్తమానంఎక్కడుంది? అవకాశంఎక్కడ ? నిత్యముమాత్రం ఎక్కడుంది?

**క్వచాత్మా క్వచవానాత్మా క్వశుభం క్వాశుభం తథా ।**

**క్వచింతా క్వచవాచింతా స్వమహిమ్ని స్థితస్యమే ॥**

ఆత్మఏది ? అనాత్మఏది ? మంచిఏది ? చెడుఏది ? చింతఏది ? అచింతఏది?

**క్వస్వప్నః క్వసుషుప్తి ర్వా క్వచజాగరణం తథా ।**

**క్వతురీయం భయంవాపి స్వమహిమ్ని స్థితస్యమే ॥**

నా ఆత్మలో స్థితుడనై నాకు స్వప్నంఎక్కడ ? సుషుప్తిఎక్కడ ? జాగ్రదావస్థ ఎక్కడ ? తురీయంఎక్కడ ? భయంఎలాఉంటుంది?

**క్వదూరం క్వసమీపం వా బాహ్యం క్వాభ్యంతరం క్వ వా ।**

**క్వస్థూలం క్వచవాసూక్ష్మం స్వమహిమ్నిస్థితస్య మే ॥**

ఆత్మస్థితుడైన నాకు దూరమెక్కడ ? దగ్గరెక్కడ ? స్థూలసూక్ష్మాలు, బాహ్యాంభ్యంతరాలు ఎక్కడున్నాయి.

**క్వమృత్యుర్జీవితంవా క్వలోకాః క్వాస్య స్వలౌకికమ్ ।**

**క్వలయః క్వసమాధిర్వా స్వమహిమ్ని స్థితస్య మే ॥**

ఆత్మస్థితుడైన నాకు జీవితంఎక్కడ ? మరణంఎక్కడ ? ప్రపంచంఎక్కడ? ప్రాపంచికసుఖాలు, బంధాలుఎక్కడ ? ఏదిధ్యానం ? ఏదిసమాధి ?

**అలంత్రివర్గకథయా యోగస్య కథయా ప్యలమ్ ।**

**అలం విజ్ఞానకథయా విశ్రాంతస్య మమాత్మని ॥**

ఆత్మానుభవంలో ఆనందంగా ఉన్న నాకు త్రివిధాలైన జీవనధ్యేయాలు, ఉపన్యాసాలు అన్నీవృధాయే. అపరోక్షానుభూతిగురించి జ్ఞానోపదేశం కూడా అర్థరహితమే.

**క్వభూతాని క్వదేహోవా క్వేంద్రియాణి క్వవా మనః ।**

**క్వశూన్యం క్వచనైరాశ్యం మత్స్వరూపే నిరంజనే ॥**

నేను నిరంజనుడను. నాలో పంచభూతాలు ఎక్కడున్నాయి? వాటిచే నిర్మించ బడిన దేహంఎక్కడ ? ఇంద్రియాలెక్కడ ? మనసెక్కడ ? శూన్యంఏది ? నిరాశ ఎక్కడ ?

**క్వ శాస్త్రం క్వాత్మవిజ్ఞానం క్వవా నిర్విషయం మనః ।**

**క్వతృప్తిః క్వ వితృష్ణత్వం గతద్వంద్వస్యమే సదా ॥**

ద్వంద్వాలన్నింటికీ అతీతతంగా ఉన్న నాలో శాస్త్రాలెక్కడ ? ఆత్మజ్ఞానంఎక్కడ? విషయరాహిత్యమైనమనసేది ? తృప్తిఏది ? కోరికలు లేకపోవటంఏమిటి?

**క్వవిద్యా క్వచవావిద్యా క్వాహం క్వేదం మమక్వవా ।**

**క్వబంధః క్వచవామోక్షః స్వరూపస్య క్వరూపితా ॥**

జ్ఞానమెక్కడ ? అజ్ఞానమెక్కడ ? ఏదినేను ? ఏదినాది ? బంధంఏది ? మోక్షంఏది ? అనంతమైన నా స్వరూపానికి రూపంఏది ?

**క్వప్రారబ్దాని కర్మాణి జీవన్ముక్తి రపి క్వవా ।**

**క్వ తద్వి దేహకైవల్యం నిర్విశేషస్య సర్వదా ॥**

సర్వదాఏకంగా విషయరహితంగా ఉండే నాలో ప్రారబ్ధంఎక్కడుంది ? జీవన్ముక్తి ఏమిటి ? విదేహముక్తి ఎవరికి?

**క్వకర్తా క్వచవాభోక్తా నిష్క్రియం స్ఫురణం క్వవా ।**

**క్వాపరోక్షఫలం వా క్వనిస్స్వభావస్య మే సదా ॥**

కర్తఎవరు ? భోక్తఎవరు ? ఆలోచనలురావటంఏమిటి ? వాటిని నిరోధించటం ఏమిటి ? పరోక్షజ్ఞానంఏమిటి ? అపరోక్షానుభూతిఎవరికి ? స్వభావరహితంగా నేనుమాత్రమేఉన్నాను.

**క్వసృష్టి క్వచ సంహారః క్వసాధ్యం క్వచసాధనం ।**

**క్వసాధకః క్వసిద్ధిర్వా స్వస్వరూపేహమ ద్వయే ॥**

అద్వయము, ఆత్మరూపముఅయిన నాలో సృష్టిఎక్కడుంది? సంహారంఎక్కడ? సాధించాల్సిందిఏది ? సాధనఏది ? సాధకుడెవరు ? సిద్ధించవలసినదిఏది ?

**క్వప్రమాతా ప్రమాణంవా క్వప్రమేయం క్వచప్రమా ?**

**క్వ కించిత్క్వనకించిద్వా సర్వదా విమలస్య మే ॥**

నిత్యశుద్ధుడైన నాలో తెలుసుకునే ప్రమాతఎవరు ? తెలియబడేప్రమేయం ఏది ? ప్రమాణరూపమయిన జ్ఞానంఎక్కడ ? ఉన్నదిఏది ? లేనిదిఏది ?

**క్వవిక్షేపః క్వచైకాగ్ర్యం క్వనిర్బోధః క్వమూఢతా ।**

**క్వహర్ష క్వవిషాదోవా సర్వదా నిష్క్రియస్య మే ॥**

సర్వదా నిష్క్రియుడనైన నాలో చలనమెక్కడ ? ఏకాగ్రతఎక్కడ ? దృఢమైన జ్ఞానంఎక్కడ ? మూఢత్వంఏమిటి ? సుఖదుఃఖాలుఎలాఉంటాయి?

**క్వచైష వ్యవహారోవా క్వచసా పరమార్థతా ।**

**క్వచ సుఖం క్వచవా దుఃఖం నిర్విమర్శస్య మే సదా ॥**

విమర్శించబడటానికి అతీతంగాఉన్న నాలో పరస్పరాధారంగా జరగబడే కర్మలెక్కడున్నాయి? కర్మరహితమైన కేవలస్థితిఏది ? సుఖమేది ? దుఃఖమేది?

**క్వమయా క్వచ సంసారః క్వప్రీతి ర్విరతిః క్వ వా ।**

**క్వజీవః క్వచతద్బ్రహ్మ సర్వదా విమలస్య మే ॥**

నిత్యశుద్ధమైన నాలో మాయఎక్కడ ? సంసారమెక్కడ ? రాగద్వేషాలుఎక్కడ? జీవుడెవరు ? దేవుడెవరు ?

**క్వ ప్రవృత్తిర్నివృత్తిర్వా క్వచముక్తిః క్వచబంధనమ్ ।**

**కూటస్థ నిర్విభాగస్య స్వస్థస్య మమ సర్వదా ।**

ప్రవృత్తిఎక్కడ ? నివృత్తిఎక్కడ ? ముక్తిఎవరికి ? బంధంఎవరికి ? విభాగ రహితంగా ఆత్మగాఆత్మస్థితుడనై అంతటా నేనే ఉన్నాను.

**క్వోపదేశః క్వవాశాస్త్రం క్వశిష్యః క్వచవాగురుః ।**

**క్వచాస్తి పురుషార్థోవా నిరుపాధే శివస్య మే ॥**

ఉపదేశంఎవరికి ? శాస్త్రంఎక్కడ ? గురువెవరు ? శిష్యుడెవరు ? పురుషార్థాలేవి? ఉపాధి రహితంగా, మంగళ స్వరూపంగా నేను మాత్రమే ఉన్నాను.

**క్వచాస్తి క్వచవానాస్తి క్వాస్తిచైకం క్వచద్వయం ।**
**బహునాత్ర విముక్తేన కించిన్నో తిష్ఠతే మమ ॥**

ఉండటంఏమిటి ? లేకపోవటంఏమిటి ? ద్వైతంఎక్కడ ? అద్వైతం ఎక్కడ? ఇంతకన్న చెప్పవలసినది ఏముంది? నానుంచి ఏదీ వ్యక్తంకావటం లేదు. ఇది ఆత్మసాక్షాత్కారం పొందినవారి ఆత్మానుభవం.



# 21. పరమేశ్వరుడు

నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. నిరాకారుడు అంటే, ఆకారము లేనివాడు. పరమేశ్వరుడికి ఏ ఆకారము లేదు. అతడు ఇలాఉంటాడు అని చెప్పలేము. జగత్తంతా అతనిస్వరూపమే. జగత్తులో ఉన్నవన్నీ అతనిఆకారాలే. అతనిరూపాలే. 84 లక్షల జీవరాశి అతనిస్వరూపమే. ప్రాణమున్నవి ప్రాణం లేనివి, చలనమున్నవి చలనం లేనివి, అన్నీ అతనిస్వరూపమే. అన్నిరూపాలు అతనివే. అతడు ఏ ఆకారంలో ఉంటాడో చెప్పలేము. ఈ కారణం చేతనే పరమేశ్వరుడు నిరాకారుడు అనటం జరుగుతోంది. ఆయన నిర్గుణుడు కూడా. గుణత్రయంలో సత్త్వగుణం ప్రధానమైనది. సత్వగుణసంపన్నుడికి కూడా అహంకారం ఉంటుంది. 'నేను తపశ్శక్తి సంపన్నుడను' అని భావిస్తాడు. అది సాత్త్వికాహంకారము. అందుకే మోక్షగామి అయిన వాడికి సత్వగుణంకూడా పనికి రాదు. అతడికి ఏగుణము ఉండరాదు. గుణాతీతుడు కావాలి. గతంలోచెప్పినట్లుగా పంచభూతాలు, తన్మాత్రలు, గుణత్రయము, అవస్థాత్రయము, దేహత్రయము, చరాచరజగత్తు ఇవేవీ పరమేశ్వర స్వరూపం కాదు. దృశ్యమానమైనదేదీ పరమేశ్వరస్వరూపం కాదు. మరి పరమేశ్వర స్వరూపం ఏది ? అది ఎలా ఉంటుంది? దానికి ఆకారంలేదు. గుణంలేదు. రంగులేదు. రూపంలేదు. ఎక్కడఉంటుందో తెలియదు. ఎలాఉంటుందో అంతకన్నాతెలియదు. ఇలాఅంటే పరమేశ్వరస్వరూపం లేదని కాదు. అన్ని ఆకారాలు దానివే. దానికి ఏఆకారమూ లేదు. అన్నిగుణాలు దానివే. దానికి ఏ గుణమూ లేదు. అన్నిరంగులూ దానివే దానికి ఏ రంగూ లేదు. అన్నిరూపాలూ దానివే. దానికి ఏరూపమూ లేదు. దానికి మొదలు, చివర, మధ్య అనేవి లేవు. గజేంద్రమోక్షంలో చెప్పినట్లుగా

**అన్ని రూపులు నీ రూపమైనవాడ**
**ఆది మధ్యాంతములు లేక అలరువాడ**

అది ఎక్కడ ఉంటుంది? ఇక్కడ అక్కడ అని తేడా లేదు, ఎక్కడైనా ఉంటుంది. సర్వత్రా ఉంటుంది. చరాచర జగత్తంతా వ్యాపించిఉంటుంది. ప్రహ్లాదుడు చెప్పినట్లుగా

**ఇందు గలడందులేడను సందేహము వలదు, సర్వోపగతుండు చక్రి ఎందెందు వెతకి చూచిన అందందే గలడు**

పంచభూతాలయందు, తన్మాత్రలయందు, త్రిగుణాలయందు, అవస్థా పంచకమునందు అన్నింటియందు ఉంటుంది. ప్రతివస్తువునందు, ప్రతిజీవియందు అంతర్యామిగాఉంటూ అన్నింటినీనియంత్రిస్తూ ఉంటుంది. బృహదారణ్యకోప నిషత్తులో యాజ్ఞవల్క్యుడు ఉద్దాలకుడికి చెబుతాడు. "ఓ ఉద్దాలకా! పరమేశ్వర స్వరూపాన్నే ఆత్మ అంటారు. ఈ ఆత్మ ఆకాశంలో ఉంటుంది. కాని ఆకాశం దాన్నెరగదు. ఆకాశమే దాని శరీరం.

ఆకాశంలో ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తుంది. అదే అంతర్యామి. అదే ఆత్మ. వాయువులో ఉంటుంది. వాయువే దాని శరీరం. కాని వాయువు దాన్నెరగదు. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తుంది. అదే అంతర్యామి. అదే ఆత్మ. ఈ రకంగా చరాచర జగత్తులోని ప్రతివస్తువునందు ఉంటుంది. అవేవీ దాన్నెరగవు. కాని వాటన్నింటినీ నియంత్రిస్తుంది. అదే అంతర్యామి. అదే ఆత్మ. చరాచర జగత్తులో ఉన్న ప్రతి వస్తువునందు, ప్రతి జీవియందు సర్వత్రా వ్యాపించి ఉన్నది. ఈ జగత్తులో సూర్యచంద్రులు, దిక్పాలకులు అందరూ తమపని తాము సక్రమంగా నిర్వర్తిస్తున్నారంటే ఆ పరమేశ్వరుడు ఉన్నాడు అనే భయంతోనే. పరమేశ్వరుడున్నాడు కాబట్టే సముద్రుడు తన చెలియలికట్ట దాటకుండా ఉన్నాడు. లోకాలన్నీ సజావుగా సాగిపోతున్నాయి.

ఆ పరమేశ్వర స్వరూపము మనకి దూరంగాఉన్నదా ? దగ్గరగాఉన్నదా ? అంటే ఈశావాస్యోపనిషత్తులో చెప్పినట్లుగా

**తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే**
**ఽపంతరస్య సర్వస్య తదుసర్వస్యాస్య బాహ్యతః**

అది చలిస్తుంది, చలించదు. దూరంగా ఉన్నది, దగ్గరగా ఉన్నది. లోపలా బయటా సర్వత్రా వ్యాపించి ఉన్నది. ఆత్మ తన నిజమైన కేవలరూపంలో చలించదు. ఉపాధిరూపంలో ఉన్నప్పుడు మార్పు చెందుతున్నట్లుగా, నిరంతరము గమనశీలంగా కనిపిస్తుంది. అది సర్వత్రా వ్యాపించిఉన్నది. అజ్ఞానులకు దూరంగాను, జ్ఞానులకు దగ్గరగానూ ఉంటుంది.

**యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి**
**సర్వభూతేషు చాత్మానం తతోన విజిగుప్సతే ॥**

అన్ని జీవులు తన ఆత్మకన్న వేరు కావని, తన ఆత్మనే అన్నింటి యందు దర్శించే ప్రాజ్ఞుడు దేనినీ ద్వేషించడు.

పరమేశ్వరుని రూపాన్ని గురించి చెప్పాలంటే, అది దివ్యమైన తేజోరూపము. ఒక పెద్ద కాంతిపుంజము. ఇది అగ్నితేజస్సు కాదు. దేవీభాగవతంలో తారకాసురుని బాధలు పడలేక దేవతలు, మహర్షులు అందరూ హిమాలయ పర్వతాలలో ఆ పరమేశ్వరిని 12 సంవత్సరాలపాటు ప్రార్థిస్తారు. అప్పుడు చైత్రశుద్ధ నవమి శుక్రవారం నాడు ఆపరమేశ్వరి, ఆపరంజ్యోతి, ఆపరాత్పరి వారికి ప్రత్యక్షమైంది. ఆమె ఎలా ఉన్నది అంటే

**కోటి సూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలం**
**విద్యుత్ కోటిసమానాభమరుణం తత్పరం మహః**
**నైవచోర్ధ్వం నతిర్యక్చ నమధ్యేపరిజగ్రభత్**
**ఆద్యంత రహితం తత్తు నహస్తాద్యంగ సంయుతం**
**నస్త్రీరూపం అథవానపుం రూపం అథో భయం**

ఆ పరమేశ్వరి కొన్నికోట్ల సూర్యులకాంతితో, కొన్నికోట్ల చంద్రుల చల్లదనంతో, కొన్నికోట్ల విద్యుల్లతలు ఒక్కసారిగా తళుక్కుమని మెరిసినట్లుగా అంత గొప్ప కాంతితో ప్రకాశిస్తున్నది. దానికి పైన, క్రింద, మధ్య అనేవి లేవు. కాలు, చేతులు మొదలైన అంగములు అసలే లేవు. మొదలు చివర అనేవి లేవు అది స్త్రీ కాదు, పురుషుడు కాదు. రెండూ కానిది అంతకన్నా కాదు. కైవల్యోపనిషత్తులో చెప్పినట్లుగా

**అపాణిపాదో హ మచింత్య శక్తిః । పశ్యామ్య చక్షుః సశృణోమ్యకర్ణః ।**
**అహంవిజానామి వివిక్తరూపో । నచాస్తి వేత్తామమ చిత్సదాహమ్ ॥**

పరమేశ్వర స్వరూపానికి కాళ్ళు చేతులు మొదలైన అంగాలు ఏవీ లేవు. అయినప్పటికీ అన్ని పనులు చెయ్యగలదు. కళ్ళు లేకపోయినా చూడగలదు. చెవులు లేకపోయినా వినగలదు. సర్వాన్నీ తెలుసుకుంటుంది. ఆరూపం ఇలా ఉంటుందని ఎవరికీ తెలియదు. నిజంగా చెప్పాలంటే అది చిన్మాత్ర స్వరూపము.

**న భూమి రాపో నచవహ్నిరస్తి । నచానిలో మేస్తి నచాంబరం చ**

**ఏతంవిదిత్వా పరమాత్మ రూపం । గుహాతిశయం నిష్కళ మద్వితీయం ॥**

**సమస్త సాక్షిగుం సద సద్విహీనమ్ । ప్రయాతి శుద్ధం పరమాత్మ రూపం।**

పరమాత్మ అంటే భూమికాదు; జలంకాదు, అగ్నికాదు, వాయువుకాదు, ఆకాశం అంతకన్నాకాదు. అది ఒక్కటే ఉంటుంది. దానితో సమానమైనది కాని, అంతకన్నా అధికమైనది కాని ఇంకొకటి లేదు. సర్వానికీ సాక్షియైనది. సత్తుకాదు, అసత్తుకాదు, సదసత్తు అంతకన్నాకాదు.

**వేదైరనేకై రహమేవ వేద్యో వేదాంత కృద్వేదవిదేవ చాహమ్ ।**

**నపుణ్యపాపే మమనాస్తినాశో । నజన్మ దేహేంద్రియ బుద్ధి రస్తి ॥**

ఆ పరమేశ్వరుడికి పాపపుణ్యాలు, ధర్మాధర్మాలు, జన్మమృత్యుజరాదులు ఏవీ లేవు. దేహము, ఇంద్రియాలు, బుద్ధి కూడా లేవు. ఛాందోగ్యోపనిషత్తులో చెప్పినట్లుగా ఈ జగత్తంతా పరమేశ్వరస్వరూపమే. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామజాబాలికి ఒక ఆబోతు పరబ్రహ్మతత్త్వాన్ని ఉపదేశిస్తూ "సత్యకామా ! పరబ్రహ్మతత్త్వం నాలుగు పాదాలుగా ఉన్నది. అందులో ఒక పాదాన్ని నేను చెబుతాను. అంటూ ఈ జగత్తులో తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం నాలుగు దిక్కులు పరబ్రహ్మ స్వరూపమే అంటుంది.

భూమి, ఆకాశము, సముద్రాలు, నదులు, పర్వతాలు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని చెబుతాడు అగ్నిదేవుడు.

అగ్ని సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, విద్యుల్లతలు పరబ్రహ్మ స్వరూపమే అని చెబుతుంది ఒక హంస.

ప్రాణంబ్రహ్మ, దృష్టిబ్రహ్మ, శ్రవణంబ్రహ్మ, మనస్సుబ్రహ్మ అంటుంది నీటిపక్షి.

ఈ రకంగా జగత్తులో ఉన్న సర్వమూ పరబ్రహ్మ స్వరూపమే అని తెలుస్తోంది. లలితా సహస్రంలో చెప్పినట్లుగా ఆ పరమేశ్వరి ధర్మాధర్మ వివర్జితా, పుణ్యాపుణ్య స్వరూపిణి. పంచకృత్య పరాయణ, సర్వావస్థా వివర్జితా, ఇలా జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. అతనికి లింగభేదం లేదు.

**ఒరులుగారు నాకు ఒరులకు నేనౌదు**

**ఒంటివాడను చుట్టమొకడు లేడు**

అతనికి ఎవరూ లేరు. అందరికీ అతను కావాలి. అతడు మాత్రం ఒంటరివాడు. ఆ పరమేశ్వరుణ్ణి జ్ఞానంద్వారా మాత్రమే తెలుసుకోవాలి. **జ్ఞానాదేవతుకైవల్యం** వేదాలు, శాస్త్రాలు, చదవటంచేత కాని, యజ్ఞయాగాదికర్మలను ఆచరించటంవల్ల కాని, దానధర్మాలు చెయ్యటం చేతగాని అతడు తెలియబడడు. అతడు ఎక్కడ ఉంటాడు అంటే ? ఉత్తరగీతలో భగవానుడు చెప్పినట్లుగా.

**హృదయకమలమధ్యే దీపవద్వేదసారం**

**ప్రణవమయమతర్క్యం యోగిహృద్యాన గమ్యం**

యోగీశ్వరుల హృత్పద్మంలోనే ఉంటాడు. అతన్ని ధ్యానంద్వారా మాత్రమే తెలుసుకోవాలి. వేదంలో చెప్పినట్లుగా

**పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్**

**అధోనిష్ట్యా వితశ్యాంతే నాభ్యాముపరితిష్ఠతి**

**జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాయతనం మహత్**

**సంతతగ్ం శిలాభిస్తులంభత్యా కోశసన్నిభమ్**

**తశ్యాంతే సుషిరగ్ం సూక్ష్మం సర్వమ్ ప్రతిష్ఠితమ్**

**తస్యమధ్యేవహ్నిశిఖా అణీయోర్ధ్వావ్యవస్థితః**

**నీలతోయద మధ్యస్తా ద్విద్యుల్లేఖేవభాస్వరా**

**నీవారశూక వర్తన్విపీతాభాస్వస్త్యణూపమా**

**తస్యా శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః ॥**

కంఠానికి క్రిందిభాగంలో, నాభికిపైన 12 అంగుళాల ప్రమాణం కలిగి అధోముఖంగా, పద్మాన్నిపోలిన హృదయమున్నది. ఆ కమలాన్ని ఆశ్రయించి, జ్వాలాసమూహంతో వెలుగుతూ, జీవులకు ప్రధానస్థానమై అనేక నాడీసమూహాలకు ఆలంబనమై, అరవిరిసినపద్మాన్ని పోలిన హృదయంయొక్క అగ్రభాగంలో సూక్ష్మమైన కమలం ఒకటున్నది. దానిలో సర్వము ప్రతిష్ఠితమై ఉన్నది. దాని మధ్యలో జఠరాగ్ని

ఉన్నది. ఈ జఠరాగ్ని మధ్యన సూక్ష్మమైన అగ్నిశిఖ ఉన్నది. అది నీలమేఘంలా ప్రకాశిస్తుంటుంది. దానిశిఖ ధాన్యపుములికిలా ఉంటుంది. ఆ అగ్నిశిఖమధ్యలో పరమాత్మ ఉంటాడు.

**స బ్రహ్మ సశివ సహరి సఇంద్ర సోక్షరః పరమస్స్వరాట్ ॥**

అతడేబ్రహ్మ, అతడేవిష్ణువు, శివుడు, ఇంద్రుడు. అక్షరస్వరూపుడు అయిన పరబ్రహ్మ. కఠోపనిషత్తులో చెబుతాడు చూడండి.

**అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా। సదా జనానాం హృదయే సన్నివిష్ఠః ।**

హృదయముయొక్క మధ్యభాగంలో ఒక పద్మమున్నది. అందులో అంగుష్ఠమాత్రుడైన పురుషుడు నివసిస్తుంటాడు ఈపద్మమే అంతఃకరణ. దీనినే అంగుష్ఠము అంటారు. అందులోఉండే పురుషుడే అంగుష్ఠమాత్రుడు. లలితా సహస్రంలో ఆపరమేశ్వరి 'భక్తమానసహంసికా' అంటారు. అంటే ఆ పరమేశ్వర స్వరూపము భక్తులయొక్క మానసము అనేసరోవరంలో ఈదులాడే హంస.

షట్చక్ర నిరూపణంలో పరమేశ్వర స్వరూపం సహస్రదళపద్మంలోనే ఉంటుంది. సాధకుడు గ్రంధిత్రయాన్ని భేదించి సహస్రదళపద్మం చేరగలిగితే అక్కడ పరమేశ్వర సాక్షాత్కారము జరుగుతుంది. అక్కడ అంతా మహాశూన్యమున్నది. ఆ శూన్యాన్ని దేవతలు అతిరహస్యంగా సేవిస్తుంటారు. అక్కడికిచేరిన వారికి, ఆ ప్రదేశాన్ని దర్శించగలిగిన వారికి వాంఛితార్థం నెరవేరుతుంది. వారికి పునర్జన్మ అనేది ఉండదు. అని చెప్పబడింది. లలితాసహస్రంలో సహస్రదళపద్మంలో ఆ పరమేశ్వరి సర్వాయుధాలుధరించి, అన్నివైపులకు శిరస్సులుగలిగి, అన్నివర్ణములతోను శోభిల్లుతుంటుంది. అని చెప్పబడింది. ఏది ఏమైనప్పటికీ ఆ పరమేశ్వరుడు సాధకునిలోనే ఉన్నాడు అంతకన్నా వేరే ఎక్కడో లేదు. అటువంటి పరమాత్మను దర్శించిన వారికి పునర్జన్మ ఉండదు. మరి అతన్ని తెలుసుకోవటం ఎలా ? దీనికి గురువు కావాలి. గురువు ద్వారానే ఈపని జరగాలి. గురువంటే ఎవరో కాదు సాక్షాత్తు పరమేశ్వరుడే.

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**

**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥**

గురువు త్రిమూర్తిస్వరూపుడు. అది ఎలాఅంటే అజ్ఞాని అయిన శిష్యుని హృదయంలో జ్ఞానబీజాన్ని నాటతాడు. అందుచేతనే అతడు బ్రహ్మ అనబడతాడు. అలా నాటిన జ్ఞానబీజాన్ని పెంచి పోషిస్తాడు. అందుకే స్థితికారకుడైన విష్ణువు అనబడతాడు. శిష్యుని హృదయంలో అజ్ఞానము అనే చీకటిని నాశనం చేస్తాడు. అందుకే సంహారకర్త అయిన రుద్రుడు అనబడతాడు. ఇప్పుడు జ్ఞానియైన శిష్యునికి మోక్షమార్గం చూపుతాడు. ఈ కారణంచేతనే గురువు సాక్షాత్తు పరమేశ్వరుడు అనబడతాడు.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం।
ఏకంనిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

బ్రహ్మానందమే స్వరూపంగా కలవాడు, శ్రేష్ఠమైన సుఖాన్ని ఇచ్చేవాడు, మహాజ్ఞాని, సుఖదుఃఖాది ద్వంద్వములకు అతీతమైనవాడు, ఆకాశసమానుడు, తత్త్వమసి మొదలైన మహావాక్యాల లక్ష్యార్థమైన పరమాత్మ స్వరూపుడు, శాశ్వతుడు, చలనరహితుడు, నిర్మలుడు, సర్వానికి సాక్షియైనవాడు, భావాలకు, త్రిగుణాలకు అతీతుడుఅయిన గురువుకు నమస్కారము. అటువంటి సద్గురువుయొక్క కృపాకటాక్ష వీక్షణాలు కావాలి. సద్గురుసేవనం జరగాలి. అలాంటి సద్గురువు ఎక్కడ దొరుకుతాడు అంటే గురువు కోసం నువ్వు వెతకనవసరం లేదు. సమయం వచ్చినప్పుడు ఆ గురువే నిన్ను వెతుక్కుంటూ వస్తాడు. అప్పటిదాక ఈ జగత్తే నీకుగురువు. జగత్తులో ఉన్న ప్రతివస్తువు, ప్రతిప్రాణీ నీకుగురువే. దత్తాత్రేయుడు తనకు 24 మంది గురువులున్నారు అంటాడు. వారిలో ఒక పావురము, ఒకవేశ్యకూడా ఉన్నారు. అలాగే రామకృష్ణ పరమహంస తనకు కొలనులో ఒంటికాలి మీద జపంచేసే కొంగ, చేపలుపట్టే జాలరివాడు గురువులేను అంటాడు. అంటే ప్రకృతిలో ప్రతిప్రాణి మనకి గురువే. వాటినుంచి అనేకవిషయాలు తెలుసుకుంటాము. కర్మ పరిపక్వమైనప్పుడు సద్గురువే నిన్నువెతుక్కుంటూ వస్తాడు. అంతవరకు జపము, తపము, సత్సంగము లాంటివి చేస్తుండాలి.

ఒక మానవుణ్ణి ఎవరో ఎత్తుకుపోయి కాలుచేతులు కట్టేసి భయంకరమైన అడవిలో పడేశారు. కళ్ళకు గంతలుకట్టారు. నోరు కూడా కట్టేశారు. అతడు చూడలేడు. మాట్లాడలేడు. నడవలేడు. అటువంటిస్థితిలో ఎవరో వచ్చి దయదలిచి అతనికట్లు విప్పారు. ఇప్పుడు నడవగలడు, చూడగలడు, మాట్లాడగలడు. కాబట్టి కనిపించిన త్రోవగుండా బయలుదేరిపోతూ, కనిపించిన వారినల్లా అడుగుతూ, చివరకు ఇల్లు చేరతాడు. అలాగే సంసార సాగరంలోపడి కొట్టుకుంటున్న మానవుడు కూడా మోక్షమార్గంవైపు పయనించాలి. ఇందులో దారిచూపేవారంతా గురువులే. అసలైన గురువు మాత్రమే మోక్షమార్గంచూపగలడు. అతడేసద్గురువు. ఆ సద్గురువు లభించేదాకా సాధనచేస్తూనేఉండాలి.

ఇక్కడ ఒక చిన్న అనుమానం వస్తుంది. జపతపాలు, కర్మకాండ. ఇవన్నీ అవసరమా? వీటిని చెయ్యాలా? వీటివల్ల మోక్షం వస్తుందా? జపంవల్ల మోక్షం రాదు. తపం వల్ల మోక్షం రాదు. వేదాలు శాస్త్రాలు చదివినా మోక్షం రాదు. కేవలం జ్ఞానం ద్వారానే మోక్షం వస్తుంది. జ్ఞానాదేవతుకైవల్యం ఈశావాస్యోపనిషత్తులో చెప్పినట్లుగా

**అంధం తమః ప్రవిశన్తి యేవిద్యా ముపాసతే**

**తతోభూయ ఇవతే తమోయ ఉ విద్యాయాగ్ం రతాః ॥**

అవిద్యను ఆరాధించేవారు అంధకారంలో పడిపోతారు. యజ్ఞయాగాది కర్మలు చేసేవారు అంతకన్న నిబిడాంధకారంలో పడిపోతారు.

యజ్ఞయాగాది కర్మలు, జపతపాలు, వేదశాస్త్రాలు ఇవేవీ మోక్షాన్ని ఇవ్వవు. వీటివల్ల పునర్జన్మ కలుగుతుంది. అయినప్పటికీ సాధకుడు వీటిని ఆచరించాలి.

**కుర్వన్నే వేహకర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః ।**

**ఏవంత్వయి నాన్యథేతోస్తి న కర్మ లిప్యతే నరే ॥**

శాస్త్రవిహితమైన కర్మలు చేస్తూ మాత్రమే మానవుడు నూరు సంవత్సరాలు జీవించాలి. ఆయుష్యు ఉన్నంతవరకు దుష్కర్మ కాలుష్యాన్ని దూరం చేసుకోవటానికి ఇంతకన్న వేరేమార్గం లేదు.

**జలస్నానం మలత్యాగం । మంత్రస్నానం మనశ్శుచిః ।**

**భస్మస్నానం హరేత్పాపం । జ్ఞానస్నానం పరంపదమ్ ॥**

జలంతో స్నానంచేస్తే కేవలం వంటికి అంటుకున్న మట్టి పోతుంది. మురికి వదులుతుంది. జపంచేస్తే మనసునిర్మలమవుతుంది. కాబట్టి జపతపాలు, కర్మకాండలు చేసి నిర్మలమైన మనసు పొందాలి. నిర్మలమైన మనసులో పరమేశ్వర సాక్షాత్కారం జరుగుతుంది. కాబట్టి కర్మకాండ చేసి ఫలితం పొందాలి. క్షేత్రదర్శనం, సత్సాంగత్యం వల్ల ఏకాగ్రత ఏర్పడుతుంది. భగవంతుడిమీద అచంచలమైన విశ్వాసంఏర్పడుతుంది. అందువల్ల సాధకుడు వీటిని తప్పనిసరిగా ఆచరించాలి. శాస్త్రాధ్యయనం వల్ల పరోక్షజ్ఞానం కలుగుతుంది. ఇలా కలిగిన పరోక్షజ్ఞానం గురుకృపవల్ల ప్రత్యక్షజ్ఞానంగా పరిణమిస్తుంది. అప్పుడు సాధకుడు 'అహంబ్రహ్మాస్మి' అని భావన చేస్తాడు. మంత్రాలన్నింటిలోకి ఉత్తమమైన మంత్రం ఇది. దీన్ని జపం చేస్తే కోటిజన్మలపాపం నశిస్తుంది.

**యస్తుసర్వాణి భూతాన్యాత్మన్యేవాను పశ్యతి ।**
**సర్వభూతేషు చాత్మానం తతోన విజుగుప్సతే ॥**

అన్ని జీవులు తన ఆత్మకన్న భిన్నంకావని, తనఆత్మే అన్నిజీవులయందు ఉన్నదనీ భావించే ప్రాజ్ఞుడు దేన్నీ ద్వేషించడు. అతని దృష్టిలో ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ధర్మంలేదు. అధర్మంలేదు, పాపంలేదు పుణ్యంలేదు, గురువులేడు, శిష్యుడులేడు. అసలు ఈ జగత్తే లేదు ఉన్నది ఒక్కటే – అదే పరమేశ్వర స్వరూపము. అదే నేను. నేనేపరబ్రహ్మను. నేనుతప్ప ఇంకేదీ లేదు. అని భావనచేసినవాడు పరమేశ్వరుణ్ణి చేరగలుగుతాడు. 'బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి' బ్రహ్మను గురించి తెలుసుకున్న వాడు స్వయంగా తాను కూడా పరబ్రహ్మమే అవుతాడు.



# 22. సాయుజ్యం

పరమపదము, కైవల్యము, సాయుజ్యము, మోక్షము, ముక్తి ఇవన్నీ పర్యాయపదాలు. వీటన్నింటికీ అర్థం ఒకటే. ముక్తి అంటే విముక్తి అని అర్థం. అరిషడ్వర్గాల నుంచి విముక్తి. లౌకిక సుఖాలనుంచి విముక్తి. సంసారబంధనాల నుంచి విముక్తి. రాగద్వేషాల నుంచి విముక్తి. మమ అంటే బంధం. నమమ అంటే మోక్షం. ముక్తి రెండు రకాలుగా ఉంటుంది. 1. జీవన్ముక్తి 2. విదేహముక్తి. జీవించి ఉండగానే ముక్తి పొందటం జీవన్ముక్తి. జీవన్ముక్తుడు ఆయుష్య ఉన్నంతవరకు జీవించి, ఆ తరువాత దేహాన్ని విడిచి పరబ్రహ్మలో లీనమవుతాడు. ఈ రకంగా దేహాన్ని విడిచి పరమాత్మలో లీనంకావటాన్నే విదేహముక్తి అంటారు.

**జీవన్ముక్తుడు :** జాగ్రదవస్థలో ఉన్నప్పుడు ఎవరికి దృశ్యజ్ఞానము నశిస్తుందో, అతని స్థితినే 'జ్ఞానము' అంటారు. వృత్తిజ్ఞానము నశించిపోవటమే 'జ్ఞానము'. ఈ విషయాలు తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు. దృశ్యములేదు అనే ఆత్మజ్ఞానంతో, మనసులో ఉన్న దృశ్యభావాలను తుడిచివేసినట్లైతే తక్షణమే మహోన్నతమైన నిర్వాణ సుఖము ఉత్పన్నమవుతుంది. వాసనలు అంటే రాగద్వేషాలను సంపూర్ణంగా త్యజించటమే మోక్షము. ఎవరైతే పరిశుద్ధ వాసనలతో నిండి ఉన్నారో, వారు తిరిగి జనన మరణాలు పొందరు. వాళ్ళు యథార్థాన్ని తెలుసుకోగలుగుతారు. వారే జీవన్ముక్తులు. దృఢమైన విషయచింతనమే బంధము. వాసనాక్షయమే మోక్షము. దేహ, లోక, శాస్త్రవాసనలే సర్వవాసనలు. తపస్సు మొదలైన సాధనలు ఏవీ లేకుండానే సహజంగా ఎవరికి భోగాలు ఉండవో, వారు జీవన్ముక్తులు. కాలానుగుణంగా సుఖ దుఃఖాలు అనుభవిస్తున్నప్పటికీ, సంతోషము, విషాదము పొందనివాడు జీవన్ముక్తుడు. హర్షము, శోకము, భయము, క్రోధము, కామము, కార్పణ్యము లేనివాడు జీవన్ముక్తుడు. అహంకారాన్ని వదిలి, దృశ్యాన్ని త్యాగం చేసినవాడు జీవన్ముక్తుడు. అంతర్ముఖుడై ఇష్టాలు లేకుండా ఉండేవాడు జీవన్ముక్తుడు. సుషుప్తిలో ఉన్నవాడు లాగా సంచరించేవాడు జీవన్ముక్తుడు. ఎప్పుడూ ఆత్మానందం పొందేవాడు, మనసును పవిత్రంగా ఉంచుకునే వాడు జీవన్ముక్తుడు. ఏకోరికలు లేకుండా ఉండేవాడు జీవన్ముక్తుడు. దృశ్యములయందు అసంగుడు, చైతన్యవంతుడు అయినవాడు

జీవన్ముక్తుడు. రాగద్వేషాలు, సుఖదుఃఖాలను లక్ష్యపెట్టకుండా, కోరికలు లేకుండా, నిష్కామ్యంగా, సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మౌనంగా ఉండేవాడు, అహంభావం లేనివాడు, సంకల్పాలు, ఉద్వేగాలు లేనివాడు, జీవన్ముక్తుడు. ఇచ్ఛారహితుడై సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. కంటికి కనిపించే దృశ్యాన్ని సమ్యక్‌దృష్టితో పరిత్యజించిన వాడు జీవన్ముక్తుడు. ధర్మాధర్మాలు లేనివాడు, ఇచ్ఛారహితమైన కర్మలను పరిత్యజించని వాడు జీవన్ముక్తుడు. ధనాన్ని దరిద్రాన్ని, రుచిని అరుచిని, సమ్యక్‌దృష్టితో పరిత్యజించాడు జీవన్ముక్తుడు. షడ్రుచులు సమభావంతో, భుజించగలవాడు జీవన్ముక్తుడు. జన్మమృత్యుజరాదులను సమభావంతో చూడగలవాడు జీవన్ముక్తుడు.

ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు, జరామరణాలు, ఈ ద్వంద్వాలను పరిత్యజించిన వాడు జీవన్ముక్తుడు. సంశయాలను, ప్రయత్నాలను, నిశ్చయాలను జ్ఞానబుద్ధితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. జగత్‌సృష్టికి ముందు, సంహారం తరువాత, ఉదయాస్తమానాల యందు, భావాభావములందు సమభావంతో ఉండేవాడు జీవన్ముక్తుడు. ద్వేషము, కోరికలు, రాగద్వేషాలు లేకుండా ప్రారబ్ధకర్మలు అనుభవించని వాడు జీవన్ముక్తుడు. మనసు ఉండి కూడా అమనస్కుడైన వాడు, సంసార సంకులంలో శాంతుడు జీవన్ముక్తుడు. సమస్త సంపదల యందు, వ్యవహారముల యందు ఉండి కూడా స్పృహలేనివాడు జీవన్ముక్తుడు. జీవన్ముక్తుడు తనశరీరం పతనమైన సమయంలో, శ్వాసఆగిపోయినవెంటనే, జీవన్ముక్త పదవిని దాటి విదేహముక్తు డవుతాడు. విదేహముక్తుడికి జనన మరణాలు ఉండవు.

**పంచవిధ ముక్తులు :** బాహ్య పూజ చేసేవారికి ముక్తితో పనిలేదు. కోరికల సాధనే వారి ధ్యేయం. అంతరారాధన చేసేవారు మాత్రం ముక్తిని కోరుకుంటారు. ఈ ముక్తి ఐదు రకాలుగా ఉంటుంది.

**1. సార్ష్నిరూపముక్తి :** మణిపూరంలో పరమేశ్వరుని అర్చించేవారు ఆ పరమేశ్వరుడు ఉండే పురానికి దగ్గరగా ఇంకొకపురం నిర్మించుకుని అందులో ఉంటారు. ఇది సార్ష్నిరూపముక్తి.

ఆధారస్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. వీటిలో పరమేశ్వరుని అర్చించేవారు లౌకికవాదులు. వారికి ముక్తితో పనిలేదు. అందుకనే మణిపూరచక్రం నుంచి ముక్తి చెప్పబడుతోంది.

---

**2. సాలోక్యముక్తి :** అనాహతపద్మంలో పరమేశ్వరుని అర్చించేవారు ఆ పరమేశ్వరుడు ఉండే పట్టణంలోనే నివసించగలుగుతారు.

**3. సామీప్యముక్తి :** విశుద్ధిచక్రంలో పరమేశ్వరుని అర్చించేవారు ఆయనకు అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు.

**4. సారూప్యముక్తి:** ఆజ్ఞాచక్రంలో పరమేశ్వరుని అర్చించేవారు వేరే దేహంతో పరమేశ్వరునికి అతిసమీపంగా ఉంటారు. సృష్టి స్థితి లయాలు తప్ప, పరమేశ్వరుడు చేసేపనులన్నీ వీరు చేస్తారు.

**5. సాయుజ్యము :** ఇది అసలైన ముక్తి. సహస్రారంలో పరమేశ్వరుని అర్చించే వారు, ఆత్మసాక్షాత్కారం పొందినవారు సాయుజ్యం పొందుతారు. ఇది శాశ్వతమైన ముక్తి. ఇదే పరమపదము; కైవల్యము, మోక్షము, జీవాత్మ పరమాత్మల ఏకీభావము. ఈ స్థితికి చేరిన వారికి పునర్జన్మ ఉండదు. ఈ పంచవిధ ముక్తులయందు సాయుజ్యం పొందిన వారికి తప్ప, మిగిలిన వారందరికీ పునర్జన్మ ఉంటుంది.

అయితే ముక్తి నాలుగు రకాలుగా ఉంటుంది అంటున్నారు భగవత్పాదుల వారు 'శివానందలహరి'లోని 28వ శ్లోకంలో

**సారూప్యం తవపూజనే శివ మహాదేవేతి సంకీర్తనే**
**సామీప్యం శివభక్తి ధుర్య జనతా సాంగత్య సంభాషణే**
**సాలోక్యం చ చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే**
**సాయుజ్యం మమసిద్ధమత్ర భవతి స్వామిన్ కృతార్థోస్మ్యహమ్ ॥**

ఈశ్వరా ! నిన్ను భక్తితో పూజించుటవల్ల - సారూప్యము
శివా ! మహాదేవా ! అంటూ స్తోత్రం చెయ్యటం వల్ల - సామీప్యము
నీ భక్తులతో సహవాసం చెయ్యటవల్ల - సాలోక్యము
చరాచరాత్మకమైన నీ స్వరూప ధ్యానం వల్ల - సాయుజ్యము

అనుగ్రహించావు. నేను కృతార్థుడను. అంటున్నారు దీనిలో సార్ష్టిరూప ముక్తి లేదు. ఇందులో కూడా మొదటి మూడు రకాల ముక్తి పొందిన వారికి పునర్జన్మ ఉంటుంది.

పరబ్రహ్మ తత్త్వాన్ని భక్తి, శ్రద్ధ, యోగము, ధ్యానము, జ్ఞానముల ద్వారానే తెలుసుకోవాలి. కర్మద్వారా గాని, సంతానము, ధనముల ద్వారా గాని పరబ్రహ్మను తెలుసుకోలేరు. అమరత్వాన్ని పొందలేరు. అమరత్వానికి మారురూపమే మోక్షము. దాన్ని త్యాగం ద్వారా మాత్రమే పొందాలి. త్యాగము అంటే దానధర్మాలు చెయ్యటం కాదు. మనకున్నవన్నీ వదిలెయ్యాలి. రాగద్వేషాలు, కామ్యకర్మలు, అహంకార మమకారాలు, ఇవన్నీ త్యాగం చెయ్యాలి. ఆ పరతత్త్వం ఎక్కడో లేదు. నీలోనే ఉంది. ఇంద్రియ నిగ్రహం గలవారు, అమనస్కులు మాత్రమే దాన్ని చేరగలరు. వేదాంత ప్రవచనాలు వినటంవల్ల పరోక్షజ్ఞానం కలుగుతుంది. దానివల్ల పరతత్త్వాన్ని గురించిన అవగాహన కలుగుతుంది. నిష్కల్మషమైన హృదయము, అపరోక్షజ్ఞానము కలిగి, నియమనిష్ఠల నాచరించేవారు సన్యాసయోగం ద్వారా బ్రహ్మలోకం చేరి, కల్పాంతంలో అమరత్వం పొందుతారు. ఇదే క్రమముక్తి. వేదాంత ప్రవచనాలు వినటం, బ్రహ్మను గూర్చి నిశ్చయజ్ఞానం కలగటం, తపస్సు, సన్యాస దీక్ష, ఇవన్నీ ఒక క్రమాన్ని తెలుపుతాయి. అందుకే దీన్ని క్రమముక్తి అంటారు.

సన్యాసాశ్రమంలో ఉన్నవాడు పవిత్రుడై నిర్జనప్రదేశంలో సుఖాశీనుడై, ఇంద్రియాలను నిరోధించి, మనసును నశింపచేసి, హృత్పద్మంలో ఉన్న ఆదిమధ్యాంత రహితుడు, అవాంగ్మానసగోచరుడు, ఇంద్రియాతీతుడు అయిన పరమాత్మను సేవించినట్లైతే, అర్హత గలవారు ముక్తులవుతారు. ఈ రకంగా సర్వదేవతా స్వరూపుడు, సర్వజగద్రూపుడు, త్రికాలముల యందు ఉన్నవాడు, సనాతనుడు అయిన బ్రహ్మను అనుభవంలోకి తెచ్చుకున్నవాడు మృత్యువును జయిస్తాడు. ఈ విధంగా ఆత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే అనే విషయం అనుభవపూర్వకంగా తెలుసుకోవటమే మోక్షానికి మార్గము.

పొల్లుతో కప్పబడిన ధాన్యపుగింజ 'వడ్లగింజ' అనబడుతుంది. ఆ పొల్లు లేకపోతే అది బియ్యపుగింజ అవుతుంది. అలాగే జీవుడు – మాయాబద్ధుడు. మాయారహితుడు – శివుడు. మాయ అంటే కర్మ. కర్మ గనక నాశనం అయితే జీవుడే – దేవుడవుతాడు. కులము, జాతి, మతము అనే తేడా లేకుండా చూడటమే జ్ఞానము. మనసును విషయాలలోకి చేరనివ్వకపోవటమే 'ధ్యానము' మనసులోని మలినాలు పోగొట్టటమే స్నానము. ఇంద్రియాలను విషయాలలోకి చేరనియ్యకుండా మనసులో దోషాలు

మాలిన్యాలు పోగొట్టటమే స్నానము. ఇంద్రియ నిగ్రహమే శౌచము బ్రహ్మామృతమే – ఆచమనము. అందుచేత ఎప్పుడూ బ్రహ్మామృతాన్నే పానము చెయ్యాలి. జ్ఞాని ఎప్పుడూ, ఏకాంత ప్రదేశంలో ఒంటరిగానే ఉండాలి. రెండవ వారు తోడు ఉండరాదు. ఎప్పుడూ బ్రహ్మమును దర్శించాలి. అలాంటి బ్రహ్మజ్ఞానికి మాత్రమే ముక్తి లభిస్తుంది.

అన్నింటియందు సమభావంతో చూసేవాడు, సమస్త భూతాలలోను తన ఆత్మనే చూడగలుగుతాడు. ఆత్మను క్రిందఅరణిగాను, ప్రణవాన్ని పైనఅరణిగాను చేసుకుని, నిరంతరధ్యానము అనే అభ్యాసం చెయ్యటం వల్ల కలిగే తత్త్వజ్ఞానం ద్వారా విద్వాంసుడు తన పాపాలనుదహించి వేస్తాడు.

అజ్ఞాని దేహాన్నే ఆత్మగా భావిస్తాడు. స్త్రీసుఖము, అన్నపానాదులు మొదలైన వాటిచేత ఇంద్రియాలను తృప్తిపరుస్తూ ఇదే సుఖము అనుకుంటాడు. మాయాకల్పిత సంసారంలో జీవుడే భోక్త. సుఖదుఃఖాలను అతడే అనుభవిస్తాడు. అజ్ఞానము అనే అంధకారంలో ఉన్న జీవుడు, గాఢనిద్రలో ఆత్మలో లీనమై అవిద్యచేత ఆచ్ఛాదింపబడిన స్వరూపసుఖాన్ని అనుభవిస్తాడు. తానుచేసిన కర్మఫలాన్ని అనుభవించటానికి మళ్ళీమేల్కొంటాడు. ఈ రకంగా జాగ్రస్వప్న సుషుప్తులలో క్రీడిస్తూఉంటాడు. అయితే జాగ్రస్వప్న సుషుప్తులు, స్థూలసూక్ష్మ కారణ శరీరాలు, వీటికి అభిమాని అయిన జీవుడు లయమైపోతే, మిగిలేది పరమాత్మ. ఈ విశ్వానికి మూలకారకుడు. అఖండ జ్ఞానస్వరూపుడు. అతనివల్లనే పంచభూతాలు, తన్మాత్రలు, ఇంద్రియాలు, ఈ జగత్తు అంతాపుడుతున్నాయి.

ఏపరబ్రహ్మ అందరికీ ఆత్మఅయినాడో, ఏపరమాత్మ ఈసృష్టికి ఆధారమైనాడో, ఆ పరమేశ్వరుడవు నువ్వే. అవస్థాత్రయాన్ని ప్రకాశింపచేస్తూ, వాటికి సాక్షీభూతమైన పరమాత్మను నేనే అని తెలుసుకున్నవాడు సమస్తబంధనాల నుంచీ విముక్తుడవుతాడు.

సచ్చిదానంద రూపుడను నేనే. నా నుండే ఈ జగత్తు అంతా ఆవిర్భవిస్తున్నది. నాలోనే అన్నీఉన్నాయి. అన్నీ నాలోనేలయమవుతున్నాయి. అద్వితీయుడైన పరబ్రహ్మనునేనే. సూక్ష్మాతిసూక్ష్మమైనవాడనునేనే. మహత్తులలో కెల్లా మహత్తరమైన వాడను నేనే. ఈ విశ్వానికి కారకుడను, హిరణ్మయ స్వరూపుడను, కళ్యాణ

పురుషుడను. నేను అవయవాలు లేనివాడను. ఊహకుకూడా అందని శక్తిస్వరూపుడను నేనే. కళ్ళులేకపోయినా చూడగలను. చెవులులేకపోయినా వినగలను. నేను అద్వితీయుడను. నేను అసంగుడను. కాని అందరినీ ఎరుగుదును. నన్ను గుర్తించగలవారుమాత్రం ఎవరూలేరు. వేదాలద్వారామాత్రమే తెలుసుకోదగిన వాడను. జ్ఞానముద్వారా మాత్రమే పొందదగినవాడను. వేదాంతకర్తను. వేదవేత్తను. నాకు పాపపుణ్యాలు, జననమరణాలు, ధర్మాధర్మాలు ఏవీలేవు. బుద్ధి, ఇంద్రియాలు లేవు. పంచభూతాలు నాచేతనే సృష్టించబడినాయి. నన్నుతెలుసుకున్నవారు బంధ విముక్తులవుతారు అని త్రికరణశుద్ధిగా భావించినసాధకుడు సాయుజ్యం పొందుతాడు. గాలిలో గాలిలాగా, నీటిలో నీరులాగా, మహదాకాశంలో ఘటాకాశం లాగా అతనిజీవాత్మ పరమాత్మనుచేరుతుంది. అతనికి కర్మశేషం ఉండదు కాబట్టి పునర్జన్మకూడా ఉండదు.



## 23. జ్ఞానానందం

చరాచర జగత్తంతా పరమేశ్వరమయము. ఈ జగత్తులో పరమేశ్వరుడు తప్ప రెండవది ఏదీ లేదు. జగత్తు సృష్టి కాక ముందు, ప్రళయం జరిగిన తరువాత కూడా ఉండేది ఒక్కటే. అదే పరమేశ్వర స్వరూపము. ఆ పరమేశ్వర స్వరూపము అనేక వికారాలు పొందింది. దానివల్లనే ఈ జగత్తు ఏర్పడింది. నిజానికి దృశ్యమానమయిన జగత్తు అనేది ప్రత్యేకంగా లేదు. జీవాత్మ పరమాత్మ వేరు కాదు. రెండూ ఒక్కటే. ఈ విషయాలు తెలుసుకోవటాన్నే జ్ఞానము అంటారు. ఈ రకమైన జ్ఞానం పొందిన వాడు తానే పరమేశ్వర స్వరూపము. తాను తప్ప ఈ జగత్తులో ఇంకొకటి లేదు అని భావన చేస్తాడు. అటువంటి జ్ఞాని పొందే ఆనందాన్నే జ్ఞానానందము అంటారు. దీన్నే విద్యానందము అని కూడా అంటారు. ఇది నాలుగు రకాలుగా ఉంటుంది.

**దుఃఖాభావశ్చ కామానాస్తిః కృతకృత్యోఽహమిత్యసౌ ।**
**ప్రాప్తప్రాప్యోఽహమిత్యేవ చాతుర్విధ్య ముదాహృతమ్ ॥**

1. దుఃఖ అభావము – దుఃఖం లేకపోవటము
2. కామానాస్తి – సమస్త భోగాలు అనుభవించటం వల్ల కోరికలు తీరటం.
3. కృతకృత్య భావన – చేయవలసినవన్నీ చేసేశాను అనే భావన
4. ప్రాప్తప్రాప్యభావన – పొందవలసిన వన్నీ పొందేశాను అనే భావన.

జ్ఞానికి ఆనందము ఈ నాలుగు కారణాల వల్ల వస్తుంది. ఇప్పుడు వీటిని వివరంగా చూద్దాం.

**1. దుఃఖాభావము :** దుఃఖము రెండు రకాలుగా ఉంటుంది.

1. ఐహిక దుఃఖం 2. ఆముష్మిక దుఃఖం

**1. ఐహిక దుఃఖము :** ఈ లోకానికి సంబంధించిన దుఃఖము ఇది. ఈ జగత్తులో ఉన్నది నేను ఒక్కడినే. నాకన్న ఇతరమైనది ఏదీ లేదు అని తెలుసుకున్న వాడికి ఇంకా కావలసినది ఏదీ లేదు. అతనికి ఏ రకమైన భోగము అవసరం లేదు. అతడు భోక్త కాదు. కాబట్టి ఈ శరీరాన్ని బాధించాల్సిన అవసరం లేదు. ఆత్మ రెండు రకాలుగా చెప్పబడుతోంది. 1. జీవాత్మ 2. పరమాత్మ. స్థూలసూక్ష్మ కారణ

దేహాలతో తాదాత్మ్యం కలిగినప్పుడు, చిదాత్మ జీవభావాన్ని పొంది భోక్త అవుతుంది. అంటే శరీర త్రయంతో చిదాత్మ తాదాత్మ్యం చెందటం వల్ల జీవభావం పొంది, భోక్తగా వ్యవహరింపబడుతుంది. సచ్చిదానంద స్వరూపుడైన ఆ పరమాత్మ నామరూపాలు కలిగినప్పుడు భోగ్యరూపాన్ని ధరిస్తాడు. ఈ నామరూపాలకు, ఆత్మకు ఉన్న భేదాన్ని తెలుసుకోవటం వల్ల భోగ్య, భోక్త రూపాలు రెండూ నాశనమయి పోతాయి. ఈ రకంగా భోక్త రూపం పొందిన జీవాత్మ, భోగ్య వస్తువుల కోసం ఈ శరీరం వెంట పడి దుఃఖాలు పొందుతుంది. ఈ జ్వరాలు లేదా తాపాలు స్థూల సూక్ష్మ కారణ శరీరాలకు మూడింటికీ ఉంటాయి. ఈ తాపాలు దేహానికే కాని ఆత్మకు కాదు. అసలు ఈ తాపాలు ఏ రకంగా కలుగుతాయో చూద్దాం. స్థూలదేహంలో దాతు దోషాల వైషమ్యం కారణంగా ఈ రోగాలు కలుగుతాయి. వాత, పిత్త, శ్లేష్మాలలో ఉండే తేడాల వల్ల ఈ రోగాలు వస్తాయి. సూక్ష్మదేహానికి కామక్రోధాలుండటం వల్ల తాపాలు, దుఃఖాలు కలుగుతాయి. ఈ రెండు శరీరాల బీజాలు కారణ శరీరంలో ఉంటాయి. కాబట్టి కారణ శరీరానికి తాపాలు కలుగుతాయి. అయితే మాయకు నామరూపాలకు భిన్నమయిన సచ్చిదానంద స్వరూపాన్ని తెలుసుకుని సమస్త భోగాలు మిధ్య అని తెలుసుకున్న వాడికి ఇంకా ఏ రకమైన భోగపదార్థాలు అవసరం లేదు. కాబట్టి అతనికి ఐహిక దుఃఖాలు ఉండవు.

**2. ఆముష్మిక దుఃఖము :** దీన్నే పారలౌకిక దుఃఖము అంటారు. గతజన్మలో చేసిన పాపపుణ్యాలకు సంబంధించిన చింతననే 'పారలౌకికజ్వరము' అంటారు. విద్వాంసుడైన వాడు పుణ్య, పాప కర్మలన్నింటినీ వదిలి, నిరంతరము ఆత్మ చింతన చేస్తుంటాడు. అతడు ఈ కర్మలన్నీ తన స్వరూపంగానే చూస్తాడు. అందుచేత పుణ్యాపాపాలు అతడికి తాపాలు కలిగించలేవు. తామరాకు మీద నీటిబొట్టులాగా జ్ఞానికి కర్మ సంబంధం ఉండదు. జ్ఞానాగ్ని ప్రారబ్ధకర్మ మినహా, మిగిలిన కర్మలను భస్మం చేస్తుంది. కాబట్టి జ్ఞానియైనవాడు కర్మలు చేస్తున్నా, ఫలితం రాదు. అతడు కర్మ చేసినా కర్త కాదు. అతన్ని కర్మలు బంధించవు. మాతృవధ, పితృహత్య, భ్రూణహత్య మొదలైన పాపకర్మలుకూడా అతనికి ముక్తి రాకుండా ఆపలేవు. పాపకర్మల వల్ల అతని ముఖప్రసన్నతకీ, కాంతికీ ఏ లోటూ రాదు.

ఈ రకంగా జ్ఞానియైన వాడికి ఈ లోకానికి సంబంధించినది కాని, పరలోకానికి సంబంధించినది కాని, దుఃఖము అనేది ఉండదు. అందుచేత ఆనందాన్ని అనుభవిస్తాడు.

